నృసింహశాస్త్రి గ్రంథమాలా—2.

శ్రీమద్రామాయణవ్యాఖ్యా



(ఆంధ్రతాత్పర్యసహితము.)



69
C.

గ్రంథకర్త:

బొమ్మకంటి నృసింహశాస్త్రి.

ఓం నమః

శ్రీ పరమర్షిభ్యో యోగిభ్యః

శుభమస్తు సర్వజగతామ్॥

శ్రీ మ ద్రా మా య ణ వ్యా ఖ్యా



శ్రీమదాంధ్రదేశీయ గోదావరీమండలాంతర్గత భీమేశ్వరపురీ
వాస్తవ్య శ్రీ చంద్రాభట్ల గౌరీపతిశాస్త్రిణాం చరణకమల
సేవాసమాసాదిత పూర్ణదీక్షాపవిత్రీకృత మానసేన
బొమ్మకంటి పేరుశాస్త్రిశర్మణః సుభద్రాం
బాయాశ్చ గర్భసంభూతేన చతుర్థపుత్రేణ
నృసింహశాస్త్రిణా విరచితా తజ్జ్యేష్ఠ
పుత్ర సుబ్రహ్మణ్యశాస్త్రి
విరచితాంధ్రతాత్పర్య
సహితా

ద్వి తీ య సం పు టం.

1940



[మూల్యం రు 1—8—0.

# వినతి.

ఈగ్రంథమాలారంభమున నేఁ జేసిన విజ్ఞప్తి ననుసరించి ర్లభ మగు నీ కిసలయపీయూషమును సులభముగ రసాస్వాద ముఁ జేసి నిత్యానందనిమగ్ను లగు నటుల నీ సంపుటమును ాడ పాఠకలోకమున కందఁజేసినాఁడను. అరణ్య, కిష్కింధ, ందర, యుద్ధకాండల వ్యాఖ్యాన మంతయు నేకసంపుటముగ చిరకాలముననే వెలువడనై యున్నది.

ఇంతదనుక యీ నా యుద్యమమునకుఁ దోడ్పడి సాయ ముసర్చుచున్న మహాశయులకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈగ్రంథమును గురించి శ్రీ కామకోటి పీఠాస్థానవిద్వత్ప వి నలంకరించిన బ్ర॥ శ్రీ॥ పాణ్యాం శ్రీనివాసశాస్త్రి పండితు ొసంగిన యభిప్రాయ మిందు ముద్రించినాఁడను.

నాప్రార్థన నంగీకరించి పెద్దలయ్యు నమితశ్రమ కోర్చి ావధానముగ నీ గ్రంథమును బరిశీలించి మృదుమధురశైలిని ికను రచించిన సాహిత్యవిశారదులగు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్బయ్యశాస్త్రి గారికి నా కృతజ్ఞతాపూర్వకనమస్కృతుల ందఁజేయుచున్నాఁడను.

పూర్ణదీక్షాలబ్ధతేజోవిశిష్ట మైన నిరంకుశవిద్యావైను ృమును లోకమునకు శాశ్వతముగఁ బ్రసాదించిన మత్పితరుల ంథమాలను బాఠకమహాశయులు ధరించి ఐహికాముష్మి బులందుఁ గృతకృత్యు లగుదురుఁగాక యని

విన్నవించు
ప్రకటనకర్త,
బొమ్మకంటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

# పండితాభిప్రాయము.



శ్రీకామకోటీ పీఠ శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరాచా
ర్యాస్థాన విద్వాంసుల యభిప్రాయము.

శ్లో॥ దర్శం దర్శం కల్పవల్లీం ।
మనో గద్గమ్యతే ఽనిశం ।
కి మేషా లతికా ఖస్థా ।
పరార్థైకఫలప్రసూః ।

ఇత్థం,
పాణ్యాం,
శ్రీనివాసః,
త్రికోటీ వాసః,
కామకోటీ దాసః.

తాత్పర్యము॥ కల్పవల్లికను చదివి చదివి నా మన మెల్ల పుడు నమితానందము నందుచున్నది. ఈ లతిక ఆకాశమం దున్నను (భూస్పర్శ లేనిదైనను) పరులకు ముఖ్యప్రయోజన కరముగను, పరమార్థఫలదాయినిగను, పరాశక్తి ప్రతిపాదనై కఫలకమగు నర్థము నిచ్చునదిగను, ఎట్లయినది ?



శ్రీ ర స్తు.

# కృ తి ప్ర స్తు తి.

శ్లో॥ "కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరం।
ఆరుహ్యకవితాశాఖాం వందే వాల్మీకికోకిలం॥"

ప్రాణిసంతతిని మానవజాతి సర్వోన్నతమై వెలయుటకుఁ గారణమేమి? దాని కైహికాముష్మికానందముల నందఁజేయు వివేకసంపద యమరియుండుటయే. అట్టి తెలివికలువసిరిని వికసింపఁజేయునది వాఙ్మయచంద్రిక. వాఙ్మయ మన వాచ్యలక్ష్యవ్యంగ్యార్థసుందరమగు పదకదంబము. దీనికి భాష యనియు, సారస్వతమనియు నామాంతరములు. అరవిందమునుండి మకరంద ముదయించున ట్లింనుండియే సాహితీభారతి యుదయించినది. సాహితి యన నాదపదార్థభావముల సంగతి. దీనికిఁ గవిత యని వేఱుపేరు. సాహితి కాశ్రయము కావ్యము.

కావ్యము ప్రభుసమ్మిత మనియు, సుహృత్సమ్మిత మనియు, కాంతాసమ్మిత మనియుఁ ద్రివిధముగా విభాగితమై యున్నది. ప్రభుసమ్మితమన నేలికవలెఁ గర్తవ్యాకర్తవ్యముల శాసించునది. వేదవేదాంతసాహితి యీతెగలోనిదే. సుహృత్సమ్మితమన సన్మిత్రుని పగిది మది కింపగు గాథలతో ధర్మాధర్మముల బోధించునది. పురాణసాహితీసమితి యీ కోటిలోనిదే. కాంతాసమ్మితమన వినయానురాగలలితమగు సతీతిలకమువలె

హితాహితముల మనోహరముగా విదితముసేయునది. రామాయణాదిసాహిత్యసరణి యీ శ్రేణిలోనిదే.

విశ్వమోహనమగు సరసకవితాసారమున వాల్మీకివదనారవిందనిర్గత మగు రామాయణమకరంద మమృతాధిక మాధురీభరితమై యమరతరువు మాదిరి సకలాభీష్టముల నొసంగంజాలియున్నది. ఈ యాదికావ్య మింత మనోహరముగా నుండుటకుం గారణములు దీనికవి బ్రహ్మర్షి యగుట యొకటి. ఇందలి భారతి శ్రుతిసుఖదయగు సంస్కృతియగుట వేఱొకటి. ఇందు నేతలు పూతచరితులగు సీతారాము లగుట యింక నొకటి. ఈ కావ్యగాయకులు గానకళాకుశలులగు కుశలవకుమారులగుట మఱియొకటి. ఈ చతుష్టయసమిష్టి, వాల్మీకికావ్యసృష్టి కమిత మగు పుష్టిని సమకూర్చినది.

కవి యనుభవముగల ప్రతిభాశాలి కావున్నం గావ్యము రమణీయార్థప్రతిపాదకము కాంజాలదు. ఇటం గావ్యకర్తయగు వాల్మీకి, నిశ్చలయోగసమాధిని భగవత్స్వరూపమును సందర్శించిన బ్రహ్మర్షిసత్తముం డగుటచే నీపొత్తమున దివ్యవైభవములు చక్కంగాం బ్రస్తుతింపంబడినవి. కృతినివ్రాసిన మానిసి వనవాసియగు తపసియగుటచేం గృతినిం బ్రకృతిసౌందర్యము సుందరముగాం జిత్రింపంబడినది. కావ్యరచయిత లోకానుభవముగల కోవిదుం డగుటచే నీగ్రంథమున రాజ్యపరిపాలనాది లౌకికవిషయములు చతురముగ వర్ణింపంబడినవి. పెక్కుపలుకులేల ? కవి

వివేకసుధాకరుఁ డగుటచే నీరామాయణసాగరమున శృంగారాది నవరసతరంగము లున్నతగతిని వన్నెఁగాంచినవి.

మానససరోవరసీరమునుండి గంగాస్రవంతి బయలు వెడలి, లోకమును బావనముసేయున ట్లీరామాయణభారతీసుధావాహిని వాల్మీకి హృదయారవిందమునుండి బయలువెడలి భూవలయము నంతను బూతమునుగాఁ జేయుచున్నది. భరతఖండమున నాసేతుహిమాలయమువఱకుఁ గల జనపదములందు శ్రీరామమందిరములు లేని తావులు గానరావు. రామాయణగానమును విననొల్లని చెవులు గాని, సీతాపతి గుణముల నుతింపని నాలుకలు గాని కానరావు. పెక్కుమాట లెందులకు? రామాయణవాణి సాహితీరమణికి వెలలేని తలమానికముగా వెలయుచున్నది.

అమృతద్రోణియగు నీరామాయణవాణిని శ్రద్ధాభక్తులతో శ్రవణమననాదులఁ జేయు మానవు లైహికసరణిని జరామరణాది భయవిరహితులై సుఖముగా జీవించుటయగాక పరమపదమున శ్రీమన్నారాయణచరణారవింద మకరంద రసాస్వాదనమగ్నులై బ్రహ్మానందముతో నుందు రని మన మహర్షులు తెలిపియున్నారు.

శ్లో॥ "యః కర్ణాంజలి సంపుటై రహరహస్సమ్యక్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు।
జన్మవ్యాధి జరావిపత్తి మరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయగచ్ఛతి పుమా న్విష్ణోఃపదం శాశ్వతం॥"

రామాయణము కళ్యాణగుణాఢ్యమై, కవిపండితగణ్యమై, వరగాయకగేయమై, సారస్వతమున కమూల్యాభరణమై, హిందూవసుంధరకుఁ గీర్త్యాపాదకమై తేజరిల్లుచున్నదనుట నిర్వివాదాంశము. ఈ యనూల్యకావ్యరాజమునకు విద్వద్వరేణ్యు లెందరో యుదారభావశోభితములగు వ్యాఖ్యానముల వ్రాసియున్నారు. కాని వారెల్లరును రామాయణము పరమేశ్వరప్రతిపాదకమనియే నిర్ణయించి యున్నారు. ఖనిమణి శాణకషణముచే వన్నెఁగాంచునట్లు, కావ్యవాణి ధిషణాఘర్షణములచే సొంపు లీనుచుండును. ఇందుల కీక్రిందఁ బేర్కొనఁబడిన వ్యాఖ్యానరాజమే తార్కాణము.

మన యాంధ్రదేశమున షట్ఛాస్త్ర కోవిదులనియు, సకల కళాప్రవీణులనియు, నసమానసాహితీధౌరేయు లనియు, నిరుపమానకవితానిర్మాణనిపుణు లనియుఁ బ్రఖ్యాతిఁ గాంచిన బ్రహ్మశ్రీ శ్రీ బొమ్మకంటి నృసింహశాస్త్రి మహోదయులు వాల్మీకిరామాయణము పరశక్తిప్రతిపాదకమగు గ్రంథమని నిర్ణయించుచుఁ గల్పవల్లిక యను నొక యపూర్వవ్యాఖ్యను సంస్కృతభాషలో లిఖియించి యున్నారు. నిజమే. మహీరుహములొక్క మేదినీతలము నుండియే నవరసములఁ జేకొనునట్లు పండితవరులొక గ్రంథమునుండియే నవభావములఁ దీయుచుందురు. ఒక్క శారీరకసూత్రగ్రంథమునుండియే శ్రీశంకరాచార్యులవారద్వైతార్థమును, రామానుజాచార్యులువారు విశిష్టాద్వైతార్థమును,

మాధ్వాచార్యులు వారు ద్వైతార్థమును గ్రహించి, వేలువేలు భాష్యములు వ్రాసియుండలేదా? అటులనే శ్రీ నృసింహ శాస్త్రిగారు పురుషార్థప్రతిపాదకమని పూర్వపు వ్యాఖ్యాతలు వ్రాసియున్న రామాయణమునకే పరదేవతాప్రతిపాదకమను భావమును వెల్లడించియున్నారు.

"యస్తి ప్రీణయేత్ సుచరితైః పితరం స పుత్రః" అను నార్యమర్యాదానుసారము శ్రీ నృసింహశాస్త్రిగారి జ్యేష్ఠ పుత్త్రులగు సుబ్రహ్మణ్యశాస్త్రి మహాశయులు తమ పితృపాదులచే వ్రాయఁబడిన కల్లవల్లికా వ్యాఖ్యానము సంస్కృతభాషామయమై యుండుటచే, సంస్కృతము నెఱుంగని తెలుంగువారి కవగతము గానేరదని భావించి, మూలానుకూలముగఁ జక్కని యాంధ్రానువాదమునుగూడ దానికిఁ దోడుచేసి ప్రకటించుచున్నారు. అందు బాలకాండ మీవఱకే ముద్రితమైనది. దానిపై నెందఱో విద్వాంసులు ప్రశంసోక్తుల వెలయించి యున్నారు. మఱియు నీ బాలకాండమునకు వ్యాకరణవిద్యాప్రవీణపట్టభద్రులగు బ్రహ్మశ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి గారు విపులమగు పీఠికను వ్రాసియున్నారు. దానియందు దర్పణమునఁ బ్రతిబింబమట్లు, నృసింహశాస్త్రిగారి పాండితీగరిమ ప్రస్ఫుటముగఁ జూపట్టుచున్నది.

నృసింహశాస్త్రిగారి వ్యాఖ్యానగ్రంథమునకు శ్రీ పాపయ్యశాస్త్రిగారే పీఠికను వ్రాయ సర్వవిధముల నర్హులని

నా భావము. ఏమందురా ? వ్యాఖ్యానకర్తలు బొమ్మకంటి వట్టి మని ప్రతిభ గాంచిన పండితకుటుంబమునకుఁ జెందిన విద్వాంసులు. పీఠికాకర్త లన్ననో చిలుకూరిచతుష్టయ మని పన్నెకెక్కిన విపశ్చిద్వంశమునకు సంబంధించిన పండితశిరోమణులు.

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తిరుగ నిపు డయోధ్యాకాండమును బ్రకటించుచు, దానికి నన్నుఁ బీఠిక వ్రాయఁ గోరిరి. నా యల్పజ్ఞతను వారి కెఱింగించి, వే ఱెవ్వరిచేతనైన వ్రాయింపుఁడని తెలిపితిని. కాని వారు నన్ను విడువరైరి. సహృదయుల మాటలను బాటింపకుంట మోటుతనమనియు, ఘనవిజ్ఞానవిలసితమగు కల్పవల్లికా వ్యాఖ్యానసారమును గ్రోలిన నాకింత తెలివి సమకూరు ననియుఁ దలంచి, పీఠికను వ్రాయ సాహసించితిని.

సరససాహితీమధురిమాస్వాదనకోవిదులారా ! ఆంధ్ర సోదరమహాశయులారా ! వాల్మీకి కవికోకిల కాకలీరవశోభితము లగు రామాయణకాండములలో నయోధ్యాకాండము సర్వోన్నతమై తేజరిల్లుచున్నయది. ఏలయందురా ? రామాయణ వర్ణితములగు ప్రధానపాత్రముల స్వరూపస్వభావములందుఁ జక్కఁగా వ్యక్తము సేయఁబడినవి. మిగిలిన కాండములయందీగుణములే విపులీకరింపఁబడినవి. ఈకాండమున నిర్ణీతమైన శ్రీరామపట్టాభిషేకమహోత్సవమును గైకేయి భగ్నము

సేయుటచేఁ గోసలసార్వభౌముఁడును, వసిష్ఠ మునీంద్రుఁడును,
మంత్రి పుంగవులును, రాజపత్నులును, రాకొమరులును, రాజ్య
వాసులును నొక్కసారిగా వ్యాకులితచిత్తు లగుట తటస్థించి
నది. కష్టసమయముననే విశిష్టగుణకాంతి స్పష్టమగును. అలజడి
లేనినాఁడు జనులంద ఱొక్కరీతినే చూపట్టుదురు. కావున
నీకాండమునందుఁ బై వా రెట్టి స్వభావము కలవారలో బాగుగఁ
దెలుపఁబడినది.

సూర్యుఁ డుదయమునందు వారిజకోరకముల వికసింపఁ
జేయునటుల వాల్మీకిమునీంద్రుఁ డిందుఁ బై వారి భావారవింద
ముకుళముల వికసింపఁజేసియున్నాఁడు. అందు శ్రీరామచంద్రుని
ఘనహృదయవైభవమును గొప్పగాఁ జిత్రించియున్నాఁడు. దీనిం
జదువునపుడు దేహము గగుర్పొడుచును. హృదయము సంతోష
మయమగును. నేత్రములనుండి యానందబిందువు లాణిముత్తి
యములవలె రాలుచుండును.

ప్రజలేమి, మంత్రులేమి, మహారాజేమి, ప్రాణులేమి,
రాజనందనులేమి, మహర్షులేమి, శ్రీరామగుణముల బహువిధ
ములఁ గీర్తించియున్నారు. అందుఁ గైకముందు మందహాస సుం
దరవదనారవిందుఁడగు శ్రీరామునిచేఁ గవి యాడించిన
మాటల పసందు హృదయంగమమై విలసిల్లుచున్నయది. అందుఁ
జిత్రితమైన యీక్రింది శ్లోకము నొకదాని నుదాహరింతును.

"నాహమర్థపరో దేవి లోకమావస్తు ముత్సహే ।
విద్ధి మామృషిభి స్తుల్యం కేవలం ధర్మమాస్థితం."

ఈ పద్యారవిందమునుంచి వెలువడుచున్న యుదార భావామోదము నెంత యనుభవించినను దనివి తీరదు. సకల మనోరథార్థముల సమకూర్చు కల్పవల్లిక యీ శ్లోకమునకు బహువిధామూల్యభావములఁ గరతలామలకము లట్లు ప్రత్యక్షము సేయుచున్నయది.

ఇట్టి విశేషార్థములతో విరాజిల్లు శ్లోకము లెన్నియో యీ కల్పవల్లికయందుఁ బాలవెల్లినిఁ బూలగుత్తులవలె నలరారుచున్నయవి. ఈవ్యాఖ్యయందు శ్రీ నృసింహశాస్త్రిగారు ప్రకటించిన యమూల్యభావముల నిచటఁ గ్రోడీకరించుటకంటెఁ బాఠకమహాశయులను ఆంధ్రానువాదసుందరమగు కల్పవల్లికా వ్యాఖ్యానగ్రంథమును బఠింపఁగోరుటయే యుచితమని తలంచుచున్నాఁడను.

ఓం తత్సత్.

ఇట్లు,

విబుధవిధేయుఁడు,

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

# శ్రీమద్రామాయణస్య అయోధ్యాకాండే వ్యాఖ్యాత శ్లోకానుక్రమణికా.

| క్రమ సంఖ్యా | సర్గః | శ్లోక సంఖ్యా | శ్లోకవివరణం. | పుటం |
|---|---|---|---|---|
| 1 | 1 | 1 | గచ్ఛతామాతులకులం | 3 |
| 2 | ,, | 10 | సచనిత్యం ప్రశాంతాత్మా | 5 |
| 3 | ,, | 11 | కథంచిదుపకారేణ | 6 |
| 4 | ,, | 14 | నచానృతకథోవిద్వాన్ | 12 |
| 5 | ,, | 30 | అనసూయోజితక్రోధో | 15 |
| 6 | 2 | 7 | ఇదం శరీరం కృత్స్నస్య | 17 |
| 7 | ,, | 13 | అనురూపస్సవైనాథో | 18 |
| 8 | 4 | 27 | కింతుచిత్తం మనుష్యాణాం | 24 |
| 9 | 7 | 15 | అనిష్టే శుభగాకారే | 26 |
| 10 | ,, | 27 | శత్రుః పతిప్రవాదేన | 27 |
| 11 | 8 | 5 | భరతాదేవరామస్య | 30 |
| 12 | ,, | 6 | లక్ష్మణోహి మహేష్వాసో | 32 |
| 13 | ,, | 7 | ప్రత్యాసన్నక్రమేణాపి | 33 |
| 14 | ,, | 8 | విదుషః క్షత్రచారిత్రే | 35 |
| 15 | 14 | 47 | యథానందతితేజస్వీ | 37 |
| 16 | 16 | 13 | కౌసల్యా సుప్రజారామ | 40 |
| 17 | 17 | ,, | నహితస్మిన్మనః కశ్చిత్ | 41 |
| 18 | ,, | 14 | యశ్చరామన్నపశ్యేత్తు | ,, |
| 19 | ,, | 15 | సర్వేషాం హి సధర్మాత్మా | 46 |
| 20 | 18 | 17 | కచ్చిత్తే పరుషం కించిత్ | 50 |
| 21 | ,, | 24 | ధర్మమూల మిదం రామ | 52 |
| 22 | ,, | 28 | అహోధిఙ్నార్హసేదేవి | 53 |
| 23 | ,, | 29 | భర్తుర్యోఽయం విషంతీక్ష్ణం | 54 |
| 24 | ,, | 30 | తద్బ్రూహి వచనం దేవి | 55 |
| 25 | ,, | 35 | సన్నిదేశే పితుస్తిష్ఠ | 58 |
| 26 | ,, | 36 | భరతస్త్వభిషిచ్యేత | ,, |

| క్రమ సంఖ్యా | సర్గః | శ్లోక సంఖ్యా | శ్లోకవివరణం. | పుటం |
|---|---|---|---|---|
| 54 | 30 | 1 | సాంత్వ్యమానాతురామేణ | 104 |
| 55 | ,, | 2 | సాతముత్తమసంవిగ్నా | 105 |
| 56 | ,, | 3 | కింత్వామన్యతవై దేహః | 106 |
| 57 | ,, | 4 | అనృతంబతలోకోయం | 113 |
| 58 | ,, | 5 | కింహికృత్వా విషణ్ణస్త్వం | 115 |
| 59 | ,, | 6 | ద్యుమత్సేనసుతంవీర | 117 |
| 60 | ,, | 9 | యస్యపథ్యంచ రామాత్థ | 118 |
| 61 | ,, | 10 | సమామనాదాయవనం | 119 |
| 62 | ,, | 29 | యత్సృష్టాసిమయాసార్ధం | 124 |
| 63 | ,, | 31 | సఖ్యవ్వాం నగచ్ఛేయం | 125 |
| 64 | 34 | 40 | ప్రాప్స్యామియానద్యగుణాన్ | 126 |
| 65 | 40 | 5 | సృష్టస్త్వం వనవాసాయ | 128 |
| 66 | ,, | 9 | రామం దశరథం విద్ధి | 129 |
| 67 | 41 | 19 | అనర్థినస్సుతాస్త్రీస్త్రిణాం | 131 |
| 68 | 42 | 5 | తాం నయేన చ సంపన్నో | 132 |
| 69 | ,, | 6 | కైకేయిమమాంగాని | ,, |
| 70 | ,, | 7 | యేచత్వామనుజీవన్తి | ,, |
| 71 | ,, | 8 | అగృహ్ణాం యచ్ఛతేపాణిం | 133 |
| 72 | ,, | 9 | భరతశ్చే త్ప్రతీతస్స్యాత్ | 134 |
| 73 | ,, | 34 | రామం మేనుగతాదృష్టిః | 135 |
| 74 | 44 | 1 | విలపంతీం తథా తాంతు | 136 |
| 75 | ,, | 5 | వర్తతేచోత్తమాంవృత్తిం | 137 |
| 76 | ,, | 6 | అరణ్యవాసేయద్దుఃఖం | 140 |
| 77 | ,, | 7 | కీర్తిభూతాం పతాకాంయో | 141 |
| 78 | 50 | 36 | యథాయోధ్యాతథేఽయం | 142 |
| 79 | ,, | 42 | దిష్ట్యాత్వాం గుహపశ్యామి | 145 |
| 80 | ,, | 43 | యత్విదం భవతాకించిత్ | 146 |

ఓం

శ్రీమత్పరమ గురుభ్యోనమః

శ్రీమద్రామాయణే

# అయోధ్యాకాండ వ్యాఖ్యా ప్రారంభః

శ్లో॥ దిశా కయాచి త్ప్రవివిచ్య కాంశ్చి ।
చ్ఛ్లోకా నహం వ్యాఖ్య మిహాదికాండం ।
సాకేత కాండం వివృణోమి సమ్య ।
గ్రామాయణ స్యాత్మగురోః కటాక్షాత్ ॥

తా॥ శ్రీమద్రామాయణ బాలకాండమునందలి శ్లోకముల కింతకు ముందొకరీతిని వివేచనము చేసి వ్యాఖ్యానము చేసి యుంటిని. మా గురువర్యుల కటాక్షమున అందలి అయోధ్యాకాండమును బాగుగ వివరించెదను.

ఇతఃపూర్వకాండే స్త్రీపుంభిదయాం వ్యక్తస్య జగత స్సచరాచరస్య నియమనాయ రామరూపేణావతీర్ణాయా స్త్రీపురసుందర్యాః ప్రకాశాంశస్య "ఇయం సీతే" త్యాది సీతాపరిణయకథాసందర్భేణ విమర్శాపరపర్యాయశక్తిసంబంధ మభివర్ణ్య మహర్షి రధునా తత్సామరస్యప్రయుక్త విశ్వపాలన కథా ముపక్షిపతి । అత ఏవ. శంకరాచార్యాః ప్రోచుః.

శ్లో॥ "శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం। నచే దేవం దేవో నఖలు కుశల స్స్పందితు మపి। అత స్త్వా మారా

ధ్యాం హరిహరవిరించ్యాదిభి రపి। ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి'' ఇతి। తతః పూర్వతన తాటకాదివధ ద్వారా విశ్వామిత్ర యాగరక్షణాదికం తు తదుపదిష్ట మంత్రాత్మక శక్తిసంబాధా దిత్యవగంతవ్యం। అభేద పంచకమధ్యే మంత్రదేవతయో రప్యభేదసిద్ధాంతాంగీకారాత్॥

తా॥ బాలకాండమున, స్త్రీపురుష భేదముచే వ్యక్తమైనట్టి చరాచరాత్మకమగు జగత్తును నియమించుట కొఱకు శ్రీరాముని రూపమున అవతరించిన ప్రకాశాంశరూపమగు త్రిపుర సుందరికి, "ఇయం సీతా" మున్నగు సీతాపరిణయ కథాసందర్భముచే విమర్శమను నామాంతరము గల శక్తిస్వరూపముతో సంబంధమును వర్ణించి వాల్మీకిమహర్షి ఇప్పుడు ఆప్రకాశ విమర్శమను నుభయస్వరూప సామరస్యముచే కలిగిన జగత్పరిపాలనకథ నుపక్రమించుచున్నాఁడు. కావుననే "శివుడు శక్తితో గూడిననే ప్రభుత్వమునకు సమర్థుఁడగుచున్నాడు. అట్లు కూడనిచో మహాతేజశ్శాలి యయ్యును చలించుటకేని సమర్థుడు కాజాలఁడు. కావున విష్ణువు, శివుడు, బ్రహ్మ మున్నగు వారిచే కూడ ఆరాధింప దగిన నిన్ను నమస్కరించుటకుగాని, స్తోత్రము చేయుటకుగాని, పూర్వజన్మమున విశేషముగ పుణ్యము చేయనివాఁడెట్లు సమర్థుఁడగును'' అని శ్రీశంకర భగవత్పాదులు తెలిపియున్నారు.

ఇంతకు ముందు శ్రీరాముఁడు తాటక మున్నగు వారిని వధించి విశ్వామిత్రుని యాగమును రక్షించుట, ఆమహర్షి

యుపదేశించిన మంత్రరూపము శక్తిసంబంధమునవే యని తెలి యనగును. అభిన్నమగు దేహము, మంత్రము, మంత్రదేవత, గు రువు, సిద్ధి అను ఐదింటిలో మంత్రమునకు తదధిష్ఠానదేవతకును గూడ అభేదము కలదనెడు సిద్ధాంతము నంగీకరించుటచే మం త్రముకూడ శక్తిస్వరూపమే.

స 1. శ్లో॥ 1. గచ్ఛతా మాతులకులం భరతేన తదానఘః ।
శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః॥

వ్యా॥ పూర్వకాండశేషే సప్తసప్తతితమసర్గే "ఆపృచ్ఛ్య పితరం శూరో రామం చాక్లిష్టకారిణం । మాతౄశ్చాపి నర శ్రేష్ఠ శ్శత్రుఘ్నసహితో యయౌ" ఇత్యాదినా శత్రుఘ్నస్యా పి భరతమాతామహదేశగమన మభిధాయ శత్రుఘ్నస్య భరతే భక్తిసత్త్వేఽపి తద్బంధుదేశగమనం సామాన్యతోఽనుచి తం । రాజమర్యాదయా తు సుతరా మిత్యాశంక్య తస్య తత్పా రతంత్ర్య మూలకత్వే నోచితమేవ తద్గమన మితి సమాధత్తే । గచ్ఛతేతి - గచ్ఛతా గమనోద్యుక్తే నేత్యర్థః । నిత్యశత్రుఘ్న ఇత్యనేన ఆంతరశత్రుశూన్యస్య తస్య జ్యేష్ఠపారతంత్ర్యం ద్యోతి తం । అత ఏవ అనఘః - నిర్దుష్టః । ప్రీతిపురస్కృతః-అన్యోన్య ప్రీతి ప్రేరితః-అన్యథా ఏకతరమాత్రనిష్ఠా ఏకతరమాత్ర విష యిణీ చే న్నైవం భవతీతి భావః-స్వాశయ ముల్లంఘ్య నాయం వర్తత ఇతి భరతస్య గమనోద్యోగః । నాత్మాన మయం జహా తీతి శత్రుఘ్నస్య నిశ్చయ ఇత్యుభయోరపి సహయాత్రా సిద్ధ్యా న పూర్వోక్త దోష ఇత్యనవద్యం॥

తా॥ బాలకాండము డెబ్బదియేడవ సర్గలో "రాముడును భరతుడు తండ్రి యనుజ్ఞ నొంది, ఇతరులకు క్లేశము గలుగజేయని కార్యముల నొనరించెడి రాముని యనుజ్ఞ గైకొని, తల్లుల నడిగి, శత్రుఘ్నునితో గూడ మాతామహ దేశమునకు వెడలెను" అనుటచే శత్రుఘ్నుడు భరతుని మాతామహ దేశమునకు వెడలినాడని తెలిపి, శత్రుఘ్నునకు భరతుని యందు భక్తి యున్నను, ఆతని బంధువుల దేశమునకు వెడలుట సామాన్యముగ అనుచితము- క్షత్రియుల మర్యాద ననుసరించి మిక్కిలి యనుచిత మని శంకించి, శత్రుఘ్నుడు భరతుని యధీనముగు ప్రవృత్తి గలవాడగుటచే ఆత డట్లు వెడలుట యుక్తమే యని వాల్మీకిమహర్షి సమర్థించినాడు.

'గచ్ఛతా' వెడలుటకు సంసిద్ధుడగు (భరతునిచే) "నిత్యశత్రుఘ్నః" ఆంతరంగిక శత్రువులగు కామ క్రోధాదులను జయించినవాడు. కావుననే ఈతని జ్యేష్ఠుని (భరతుని) యందు నిర్భరుడై యుండుట వ్యక్తమగుచున్నది. 'అనఘః' దోషరహితుడు. 'ప్రీతిపురస్కృతః' పరస్పరప్రీతిచే ప్రేరితుడు. ఒక్కనికే ప్రేమయున్నను, ప్రేమపాత్రు డొక్కడే యైనను నిట్లు కాజాలదు. నా యభిప్రాయము నీత డుల్లంఘించి ప్రవర్తింప డని భరతునకు శత్రుఘ్నునితో గూడ వెడలుటకు యత్నమును, నన్నీతడు వదలి వెడల డను నిశ్చయము శత్రుఘ్నునకును సంభవించుటచే, నిద్దరు కలిసి వెడలుట తటస్థింపవచ్చును.

కావున ముందు పేర్కొనబడిన దోష మిక్కడ సంభవించదు. సర్వము రమణీయము.

స 1. శ్లో॥ 10. స చ నిత్యం ప్రశాంతాత్మా మృదుపూర్వం తు భాషతే। ఉచ్యమానోపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే॥

వ్యా॥ ప్రశాంతాత్మా- నిర్వికారచిత్త ఇతి మనశ్శుద్ధిః। మృదుపూర్వంతు భాషతే- ఇత్యనేన అన్యేన సంభాషణదశాయాం శబ్దతోఽర్థతశ్చ మార్దవమేవేతి వాచికశుద్ధిః। పరుషం- పరుషాక్షరఘటితం యథా తథేతి క్రియావిశేషణం। ఉచ్యమానోపి- భాష్యమాణస్తు। ఉత్తరం నప్రతిపద్యతే- యథాదేశకాలం భాషితు మయం నాభిజ్ఞ ఇతి-అతోఽస్మిన్విషయే మౌనమేవ నివర్తనోపాయ ఇత్యుదాస్త ఇత్యర్థః। లోకేహి విద్వానపి శబ్దార్థద్వారాఽనుద్వేజకం సభాషితు మర్హః- కిం పునః ప్రాకృతోయం జన ఇతి జ్ఞాత్వా న ప్రతివక్తీతిభావః। నతు స్వవిషయేఽన్యస్య మనః పారుష్యనిషేధపర మేతత్। తస్య పూర్వోత్తర వాక్యసందర్భానుసారేణ తస్మిన్నసంభావ్యత్వాదితి జ్ఞేయం॥

తా॥ 'ప్రశాంతాత్మా' వికారము లేని చిత్తము కలవాడు. అనుటచే మనశ్శుద్ధి వ్యక్తమగుచున్నది. "మృదుపూర్వం తు భాషతే" మార్దవముతో మాటలాడును. ఇట్లనుటచే ఇతరులతో మాటలాడునపుడు శబ్దములందును అర్థములందును మార్దవము గోచరించును. కావున వాక్శుద్ధి కలవాడని భావము.

'పరుషం' కఠినాక్షరములు గలుగునట్లుగ 'ఉచ్యమానోఽపి' ఇతరులు మాటలాడినను 'ఉత్తరం న ప్రతిపద్యతే' సమాధాన మిచ్చుటలేదు. అనగా దేశ కాలానుగుణముగ నీతడు భాషింప నెరుగడు. కావున వీని విషయమున మౌనమును వహించుటయే మరలించుటకుపాయమని యుదాసీనుడై యుండునని భావము.

లోకమున విద్వాంసుడును శబ్దార్థముల ద్వారా ఉద్రేకము కలుగకుండ మాటలాడ లేనపుడు. ప్రాకృత జనుని విషయము చెప్పనక్కరలే దని తెలిసికొని సమాధాన మిచ్చుట లేదని భావము. ఇంతియే కాని, తన విషయమున నితరులకు గలిగిన మనఃపారుష్యమును తొలగించు కొనుట కట్లు మౌనమును వహించుట లేదు. పూర్వోత్తర వాక్య సందర్భముల బట్టి యీతని విషయమున నితరులకు మనఃపారుష్యముండునని యూహింప నలవికాదు- అని తెలిసికొన తగినది.

స 1. శ్లో॥ 11. కథంచిదుపకారేణ కృతేనైకేన తుష్యతి ।
నస్మర త్యపకారాణాం శతమప్యాత్మవత్తయా॥

వ్యా॥ అథాస్య ప్రజారంజనచాతుర్య మభివర్ణయతి । స్వస్మాత్ సర్వాత్మనా ఉపకార మనపేక్షమాణోపి పురుషే కథంచిత్ యేనకేనాపి ప్రకారేణ సాక్షాత్పరంపరయా వా కృతేనైవోపకారేణ తుష్యతి-అధునా మమ మనోరథః ఫలితః- కిమస్మి న్ననుపకుర్వాణస్య మమేశనేనేతి మత్వా స్వప్రజాన్సర్వా అపి స్వోపకారప్రాపణే నానుకూలయతీతి భావః । అప

కారాణాం శత మపి- అవశ్యదండనీయమపీతి శేషః । న స్మరతి- కోపోదయ శంకయా స్మృతిపథం ననయతి। తత్ర హేతుః ఆత్మ వత్తయేతి- ఆత్మా సర్వత్రాస్యాస్తీతి ఆత్మవాన్- తస్య భావేన సర్వత్ర ఆత్మబుద్ధ్యేతి ఉభయత్రాపి సంబాధః। యద్వా- అస్య సర్వథా పరోపకారశీలత్వ మేవ । నతు స్వస్య పరోపకార్యత్వ బుద్ధి రిత్యాహ । కథంచిత్- అతిస్వానునయేన తుష్యతి- స్వా పకర్తరి పరస్మి న్నాకృతిం త్యజతి । తచ్చాపి సకృత్కృతేనై వే త్యాహ । ఏకేనేతి- యద్యసకృదుపకుర్యా త్తర్హి పరత్ర ద్వేష ఏవే త్యపూర్వ మేవాస్య పరోపకారశీల మితి భావః- అత ఏవా రణ్యకాండే శరభంగం ప్రతి వక్ష్యతి। "అహ మేవా హరిష్యా మి" త్యాదినా । యద్వా- పరోపకారప్రావణ్య మాత్మ తౌ ల్యేన సర్వత్ర యోజయతీ త్యాహ । కథంచిత్కృతేన- మనసా వాచా కర్మణా వా కృతేన సతా తుష్యతి- ఉపకర్తరీతి శేషః- అయం సాధుః పరోపకారశీలత్వా దితి తస్మి న్నిచ్ఛత్యతీతి భావః । అపకారాణాం శతం- అన్యై నాన్యస్మై కర్తవ్యతయా స్వగోచర మపి న స్మరతి- తత్కథాం న స్మరతీత్యర్థః । సర్వైరపి పరస్మి న్యథాశక్త్యుపకర్తవ్య మేవ- న త్వపకర్తవ్యం- సతిత్వపకార ప్ర సంగే తన్నివృత్తి ర్యథా స్యా త్తథా యతితవ్య మిత్యభిసంధినా వర్తత ఇతి భావః । ఆపాతతః ప్రతీతం పరోపకారత స్తస్య కృతజ్ఞత్వాది తాత్పర్యం తు నాస్య శ్లోకస్య సుందరం- తత్పక్షే యథా కథంచి త్పూర్వార్ధోపపత్తావపి సర్వగుణోత్తరే తస్మిన్న పకారగంధస్యైవాభావేన ఉత్తరవాక్యార్థాసాంగత్యప్రసం

గాత్ । కించ- ఏకేన కృతేనోపకారేణ కథంచి త్తుష్యతీత్యర్థే బహూపకారై స్సుష్ఠు తుష్యతీ త్యపార్థ ప్రతీతే రపి మర్వారత్వేన । అన్యసంబంధిత్వేనైవోపకారాపకారయో రన్వయే సామంజస్యాత్ । అస్య గ్రంథస్య నాయక గుణోత్కర్ష ప్రత్యాయన పరత్వే నోత్తర గ్రంథ సమన్వయ ఆవయో రుభయో రపి తుల్యయోగక్షేమ ఇతి నాహం తదంశే పర్యనుయోజ్యః । అత్ర చమత్కార విశేషప్రతిపత్తయే "ఆశంసాయాం భూతవచ్చ" ఇతి నిష్ఠాం సంపాద్య కృతేనే త్యస్య కర్తుమిష్టే నేత్యర్థవర్ణనపరం పీతాంబరం తు న సమ్యక్ । తద్ధి భవిష్యత్కాలావచ్ఛిన్న క్రియావాచకాద్ధాతో ర్భూత కాలావచ్ఛిన్న క్రియాసంబంధ నిమిత్తకస్య వర్తమాన కాలావచ్ఛిన్న క్రియాసంబంధ నిమిత్తకస్య చ ప్రత్యయస్యాతిదేశపరం ఆశంసాయాపార్థ ప్రతీతౌ । తథా చ కృతేనేత్యస్య కరిష్యమాణే నేత్యర్థకత్వం స్యాత్- నతు చికీర్షితే నేత్యర్థకత్వం-. భవిష్యత్కృతి విషయత్వ కృతీచ్ఛావిషయత్వయో ర్భేదాత్- నహి గమిష్యతీత్యర్థే జిగమిషతీతి సాధు । ఆశంసాయా అప్రతీతేశ్చ యత్రహి ద్వయోః క్రియయో ర్నిమిత్త నిమిత్తిభావః । యథా "దేవశ్చేదవర్షీద్ధాన్య మవాప్స్మ" ఇత్యాదౌ । తత్ర ఆశంసార్థప్రతీతిః- ఆశంసా హి అప్రాప్తవస్తు విషయక ప్రాప్తీచ్ఛా- తథా చాత్ర తాదృశ వాక్యార్థా ప్రతీత్యా న తస్యాత్ర ప్రవృత్తి రత్రేత్యలం । యద్వా- సర్వథా పరోపకారా నపేక్షాపరత్వ మస్యేత్యాహ । ఏకేన- ఏకేనైవ । కథంచి త్కృతేన- ఉపకారాభాసే నేత్యర్థః । తావన్మాత్రేణైవ తుష్యతి-

నతూపకార రూపేణేతి కృతజ్ఞత్వ నిర్భరాతిశయః ప్రతిపాద్యతే। అథాస్య తితిక్షాతిశయ మాహ । ఉత్తరవాక్యే కృతేనేత్యేతత్ ద్వితీయాంతత్వేన విపరిణమ్యతే । అపకారాణాం శతం కృతమపి న స్మరతి । అస్య తితిక్షాపరీక్షాయై బహ్వప్యపకృతం న స్మరతి । కిముత నోద్విజతీతి- తత్ర హేతు మాహ- ఆత్మవత్తయేతి- అతి ధీరతయేత్యర్థః॥

తా॥ పిమ్మట సీతని ప్రజారంజనకౌశలమును మహర్షి దెలుపుచున్నాడు. "కథంచిదుపకారేణ కృతేనైకేన తుష్యతి" ఏదియో యొకరీతిని తాను చేసిన యుపకార మొక్కటేని యున్నచో సంతసించును. తనవుండి ఉపకారము నపేక్షింపని పురుషుని విషయమున, స్వయముగగాని, ఇతరుల ద్వారాగాని, ఉపకారము చేసిన సంతసించును. "నేటికి నా మనోరథము ఫలించెను. ఈతని కుపకారము జేయనున్నచో నా ప్రభుత్వమునకు ఫలిత మేమి?" అని తలచి సమస్త ప్రజలకు ఉపకారములు చేసి తన కనుకూలింప జేసికొనుచున్నాడని భావము. "అపకారాణాం శతమపి" అవశ్యము దండింపదగిన వందల కొలది అపకారము లున్నను, 'న స్మరతి' కోపము కలుగునని శంకచే స్మరణమునకు దెచ్చుటలేదు ఇందులకు హేతువు 'ఆత్మవత్తయా' ఆత్మ యంతట గలవాడు కావున 'ఆత్మవాన్' అనబడును. ఆ హేతువుచే అంతటను ఆత్మబుద్ధి కలుగుటయే. లేదా, ఈతనికి సర్వవిధముల పరుల కుపకారము జేయుటయందే ముఖ్య తాత్పర్యము కలదని తాత్పర్యము. పరుల వలన తానుపకా

రము పొందవలెనను బుద్ధి లేదని తెలుపుటకై 'కథంచిత్' అని నాడు. మిక్కిలి తన్ను నుమించుటచే 'తుష్యతి' తన కపకారము జేసిన పురుని యందు వికృతభావమును వదలుచున్నాడు. అది యు నొకసారి యుపకారము జేసినచే యనుటకై 'ఏకేన' అని నాడు. నూటి నూటికి ఉపకారము జేసినచో ఇతరునియందు ద్వేషమే. ఇట్లీతని పరోపకార స్వభావము విలక్షణమైనదని యెఱుగదగును. కావుననే అరణ్యకాండ యందు శరభంగ మహ ర్షిని గూర్చి "నేనే తీసికొని వచ్చెద" నని తెలుపగలడు.

లేదా, అంతటను తనవలె పరోపకార ప్రవణతను గూ ర్చుచున్నా డనుటకు 'కథంచిత్కృతేన' అనినాడు. మనస్సుచే గాని, వాక్కుచే గాని, కర్మచే గాని, ఉపకారము జేసినవాని విషయమున సంతసించుచున్నాడు. ఈతడు పరోపకారశీలుడు గాన సాధువు. అని స్నేహయుతు డగుచున్నాడని భావము. ఇతరునిచే వేఱొకనికి చేయదగిన నూఱపకారములు తనకు గోచ రించినను స్మరింపడు. అట్టి కథనేని స్మరింపడని యర్థము. అంద రును తముకంటె నితరులకు యథాశక్తిగ ఉపకారమే చేయవల యును. అపకారము చేయగూడదు. అపకారము చేయవలసి వచ్చినను, అట్టిది యెట్లు జరుగకుండునో అట్లే యత్నింపవలెనను సదాశయముతో నీతడుండెనని భావము.

ఆపాతముగ తోచునట్టి 'పరోపకారముచే కృతజ్ఞు డీత' డను భావ మీశ్లోకమున ముఖ్యమనుట సుందరము కానే రదు. ఆపక్షమున ఏదియో యొకరీతిని శ్లోకపూర్వార్థమునకు

అన్వయము పొసగినను, సర్వగుణములచే శ్రేష్ఠుడైన యీతని యందపకార గంధమేని లేకుండుటచే ఉత్తరవాక్యార్థము పొసగనేరదు గాన వాక్యార్థమునకే భంగము వాటిల్లును. మఱియు ఒక ఉపకారము చేసినంతనే సంతోషించువన్నచో, అనేక యుపకారములు చేసినచో బాగుగ సంతోషించు నను అపార్థము గూడ అనివార్యముగ తోచును. ఉపకారాపకారముల రెంటింటిని ఇతరులకు సంబాధించునట్లు అన్వయము చెప్పిననే సమంజసముగ నుండును. ఈ గ్రంథసందర్భము నాయకుని గుణోత్కర్షను తెలియజేయునది గాన ఉత్తరగ్రంథముతో సమన్వయము చేయుట ఉభయులకు తుల్యమోగ క్షేమకరము. కావున ఆయంశమున నేను ప్రశ్నింప దగినవాడను కాను.

ఇచ్చట చమత్కారవిశేషమునకై "ఆశంసాయాం భూతవచ్చ" అను వ్యాకరణసూత్రముచే 'కృతేన' అనుచోట 'క్త' ప్రత్యయమును సాధించి 'చేయ నిచ్ఛయించిన' అను అర్థమును తెలిపిన 'పీతాంబర' మను గోవిందరాజీయవ్యాఖ్యానము రమ్యము కాదు. ఆసూత్రము భవిష్యత్కాల క్రియావాచకమగు ధాతువుకంటె భూతకాలక్రియా సంబాధ నిమిత్తకమైన, లేక, వర్తమానకాలిక క్రియాసంబంధ నిమిత్తకమైన ప్రత్యయమును ఆశంసాయాపార్థము తోచునప్పు డతిదేశించును. అపుడు 'కృతేన' అను దానికి 'చేయగల' అని యర్థము. 'చేయ నిచ్ఛయించిన' అను నర్థము కానేరదు. "వెళ్లగలడు" అను నర్థమున "వెళ్ళ నిచ్ఛయించుచున్నాడు" అను నర్థము గల శబ్దము సాధువు కాదు.

ఇచ్చట ఆశంసారూపార్థము తోచుటను లేదు. ఎక్కడ రెండు క్రియలకు కార్యకారణభావ ముండునో "దేవుడు వర్షించిన ధాన్యము నొందగలము" మున్నగు తావులందే ఆశంస తోచును. ఆశంస యనగా పొందబడని వస్తువును పొందవలెనను ఇచ్ఛ. కావున ఇచ్చట అట్టి వాక్యార్థప్రతీతి లేదు గాన ఆ సూత్రమున కిచ్చట ప్రవృత్తియే లేదు. లేదా, ఈతనికి సర్వవిధముల పరుల నుండి యుపకారాపేక్ష లేదని తెలుపుటకై 'ఏకేన' 'కథంచిత్ కృతేన' అనినాడని కూడ చెప్పవచ్చును. ఒకటియే యగు ఉపకారాభాసము చేతనే సంతసించును. ఉపకారరూపముచేత గాదు. ఇట్లనుటచే సీతనియందు కృతజ్ఞత హెచ్చుగ నున్నదని తెలియవచ్చుచున్నది. తరువాతి వాక్య మీతని ఓరిమిని తెలియ జేయుచున్నది. 'కృతేన' అను దానిని 'కృతం' అను ద్వితీయాంతముగా మార్చుకొనవలెను. అపకారములు నూఱు చేసి నను స్మరింపడు. ఈతని సహనశక్తిని పరీక్షించుటకై ఇతనికి మిక్కిలి అపకారము లొనర్చినను స్మరింపడు. ఉద్వేగపడడని వేరుగ చెప్పనేల? ఏలయన "ఆత్మవత్తమా" గొప్ప ధీరుడు గాన.

స 1. శ్లో॥ 14. న చానృతకథో విద్వాన్ వృద్ధానాం ప్రతిపూజకః। అనురక్తః ప్రజాభిశ్చ ప్రజాశ్చాప్యనురంజతే॥

వ్యా॥ అనృతకథః- వినోదకాలేఽపి స్వప్నస్య సమావేశే అసదర్థక కథాశూన్యః। తత్ర హేతుః। విద్వానితి- సర్వవస్తుజ్ఞానవతస్స్వస్మాత్ భిన్నా న కశ్చిదపి అసదర్థకవృత్తాంత ముదాహరతీతి భావః। యద్వా- లోకైః కథ్యమానేషు స్వీయవృత్తాం

తేషు అనృత లేశరహిత ఇత్యర్థః । తత్ర హేతుః- విద్వా నితి- పరిజ్ఞాతా- ప్రవృత్తి పర్యవసాయి జ్ఞానవాన్- నతు హస్తిస్నా నతుల్యజ్ఞాన విశిష్ట ఇత్యర్థః । తాదృశ సుప్రవృత్తౌ హేతుమా హ "వృద్ధానాంప్రతిపూజకః" సేవా వినయాదినా తదారా ధక ఇత్యర్థః- నహి బుభూషు స్తత్సేవామంతరావర్తత ఇతి భావః- యది తావన్మాత్రం తదా తేషామేవ ప్రీతిస్స్యాత్తస్మిన్ నతు సామాన్యేన సర్వేషామిత్యత ఆహ । అనురక్త ఇతి- తద్వి శ్లేషాసహిష్ణుః తద్విషయక ప్రేమ విశేషోఽనురాగః- తదా శ్రయః- సచార్థాత్ ప్రజావిషయక ఏవేతి లభ్యతే । అత ఏవ ప్రజాభిస్సహ ప్రజాః అనురంజతే· అనురంజయతి- స్వచాతు ర్యేణ ప్రజానా మన్యోన్యానురాగ ముత్పాదయతీత్యర్థః । సర్వ ప్రభో స్స్వస్య ప్రజాస్వనురాగే నైయత్యేన స్వస్మిన్ తదను రాగస్య అర్థత ఏవ సిద్ధిరితి స్వస్మిన్ ప్రజానురాగబోధకం నే దం చతుర్థవాక్యమితి తదర్థావిష్కరణపరం ప్రాచీనవ్యాఖ్యాన ముపేక్ష్యం॥

తా॥ 'నచ' 'అనృతకథః' స్నేహితులతో కూడి వినో దము లాడు సమయమునను అసత్యమగు నర్థముల దెలుపు సల్లా పములు లేనివాడు. ఇందులకు హేతువు. 'విద్వాన్' సర్వవస్తు విషయకమగు జ్ఞానము కలవాడు. కావున నాతనివలన భయ ముచే ఎవ్వడును అసత్యమగు వృత్తాంతమును తెలుపకుండు టయే.

లేదా, లోకులు చెప్పుకొను తన వృత్తాంతము లందు లేశమేని యసత్యము లేనివాడు. విద్వాంసుడగుటయే దీనికి హేతువు. తా నాచరించుటయే పర్యవసానముగా గల జ్ఞానము తో గూడినవాడు విద్వాంసుడు. కాని హస్తి స్నానముతో తుల్యమైన జ్ఞానము కలవాడు మాత్రము కాడని యర్థము.

ఇట్టి యోగ్యప్రవృత్తి కలుగుటకు కారణమును కవి తెలుపుచున్నాడు. 'వృద్ధానాం ప్రతిపూజకః' వినయముతో వృద్ధులను సేవించువాడని యర్థము. యోగ్యుడు కాదగిన వాడు సత్పురుషులను సేవింపక యుండడు. అట్టివాడైనచో వృద్ధులకే యీతనియందు ప్రేమ యుండును. సామాన్యముగ జను లందఱకు ప్రేమ యుండక పోవచ్చు నను సందేహ నివృత్తికై 'అనురక్తః' అనినాడు. ప్రజలతోడి విశ్లేషమును సహింపక వారి ప్రేమకు పాత్రుడగుచున్నాడు. కావుననే "ప్రజాభిస్సహ ప్రజాః అనురంజతే" ప్రజలతో కూడ ప్రజలు సంతసించుచున్నారు. అనగా తన చాతుర్యముచే ప్రజల కొండొరుల యందు అనురాగమును బుట్టించుచున్నాడు.

అందఱకు ప్రభువైన తనకు ప్రజలయం దనురాగము తప్పక కలుగును గాన, తన విషయమున ప్రజల కనురాగము స్వారసికముగనే సిద్ధించును. కావున 'ప్రజా శ్చాప్యనురంజతే' అను నాల్గవవాక్యము "తనయందు ప్రజలకు గల యనురాగమును బోధించునది కాదు" అనెడు నర్థమును తెలుపు ప్రాచీనుల వ్యాఖ్యానము పేక్ష చేయతగినది.

స 1 శ్లో॥ 30 అనసూయో జితక్రోధో న దృప్తో న చ మత్సరీ।
న చావమంతా భూతానాం న చ కాలవశానుగః॥

వ్యా॥ అనసూయః- సత్స్వపి దోషేషు పరగుణ ప్రకట నైక శీల ఇతి భావః। అత్ర యద్వక్తవ్యం తదుక్తం బాల కాండే। "న చ కాలవశానుగః" "కాలో వా కారణం రాజ్ఞః। రాజా వా కాల కారణం। న కాలః కారణం రాజ్ఞో। రాజా కాలస్య కారణ" మితి యాజ్ఞవల్క్యాది ధర్మశాస్త్రోక్త రీత్యా పరమేశ్వరశక్తివిశేషరూపత్వేన కాలస్యవా "అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృప" ఇతి "నావిష్ణుః పృథివీపతి'' రిత్యాది ప్రమాణైః రాజ్ఞోవా సర్వవ్యవహార ప్రయోజకీభూత తత్తద్వృత్తిప్రేరకత్వ మితి సంశయ్య కారణ విశేషేణ రాజ్ఞ ఏవ ప్రాధాన్యం- కాలస్య తు తదనువృత్తి పరత్వబోధక మేవ శాస్త్ర మితి నిశ్చిన్వాన స్స్వవశేనైవ కాలం యాపయతీత్యర్థః॥ ఏతేన త్రిపాదపరిమిత ధర్మపరాయామపి త్రేతాయాం చతుష్పాద మేవ ధర్మం ప్రవర్తయ౯ అనావృ ష్ట్యాది పీడారహితమేవ లోకం సుఖయతీతి సిద్ధం- కృతాదిభే దేన చతుర్విధేపి కాలే పురాణాది ప్రసిద్ధస్య పరస్పర ధర్మసాం కర్యస్య తు తత్తత్కాలాధీన ప్రవృత్తిక రాజదౌర్బల్య మూల కత్వమేవేతి భావః॥

తా॥ 'అనసూయః' పరులయందు దోషము లున్నను గుణములను వ్యక్తము చేయుటయందే తాత్పర్యము కలవా డని భావము. ఈ తావున జెప్పతగిన యంశము బాలకాండ

మున చెప్పబడియున్నది. "స చ కాలవశానుగః" "రాజునకు కాలము కారణమా? కాలమునకు రాజు కారణమా? అను సంశయమున "రాజునకు కాలము కారణము కాదు. రాజు కాలమునకు కారణము" అని యాజ్ఞవల్క్యాది ధర్మశాస్త్రముల యందు చెప్పబడిన రీతిని పరమేశ్వరుని శక్తివిశేష స్వరూప మగుటచే కాలమూ, లేక "లోకపాలుర యెనిమిద శలచే రాజు నిర్మింపబడెను." "విష్ణువు కానివాడు పృథివీపతి కానేరడు" అని చెప్పు ప్రమాణవాక్యములచే సమస్త వ్యవహారములకు ప్రయోజకమైన ఆయావృత్తులను ప్రేరేపించువాడు రాజా? అని సంశయించి, కారణ విశేష మగుటచే రాజునకే ప్రాధా న్యము. కాలము వాని ననుసరించియే యుండును. ఈవిషయ మునే శాస్త్రము తెలిపినదని నిశ్చయించి తన యనీనము చేసికొనియే కాలమును నడపుచున్నాడని భావము. ఇట్లగు టచే త్రేతాయుగమున ధర్మము త్రిపాదపరిమితమైనను, చతుష్పాదపరిమితమైన ధర్మమును సాగించుచు, లోకమునకు అనావృష్టి మొదలగు బాధలు కలుగకుండ ప్రజలను సుఖింప జేయుచున్నాడనుట సిద్ధము. కృత, త్రేతా, ద్వాపర, కలి భేదముచే, నాలుగువిధములయిన కాలములందును పురాణాదుల యందు ప్రసిద్ధమయిన ధర్మసాంకర్యమునకు ఆయాకాలమునకు స్వాధీనమయిన ప్రవృత్తిగల రాజదౌర్బల్యమే మూలమని భావము.

స 2. శ్లో॥ 7. ఇదం శరీరం కృత్స్నస్య లోకస్య చరతా హితం।
పాండురస్యాతపత్రస్య చ్ఛాయాయాం జరితం మయా॥

వ్యా॥ "కృత్స్నస్య లోకస్యే" త్యనేన "దేవా న్భావయతానేన తే దేవా భావయంతు వః। పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథే" తి న్యాయాద్దేవమనుష్యాదీనా మన్యోన్యోపకారప్రయోజక కృత్యప్రాపణేన లోకద్వయభారపీడాతిశయో ద్యోత్యతే। పాండురస్యేత్యనేన శరీరస్య తత్సావర్ణ్యం సూచ్యతే। ఛాయాయామితి చ జరాత్వరాసూచకం। ఆతపత్రాంతిర్హి వ్యాయామరూపతయా శరీరదార్ఢ్యోపపాదనార్థం రాజ్ఞా మావశ్యకీతి భావః। ఇదం శరీరమిత్యనేన ఏతావత్కాలపర్యంత మత్యంత సారవత్తర మితి ద్యోత్యతే। యద్వా-కృత్స్నస్యేతి- స్వపరభేదాభావః అధికాల్పభేదాభావశ్చ ప్రతిపాద్యతే। ఏవం చ ప్రభుమాత్రస్య సర్వసాధారణ్యేన హితాచరణ మావశ్యక మితి లబ్ధం॥

తా॥ "కృత్స్నస్య లోకస్య హితం చరతా" సమస్త లోకమునకు హితమును జేయుచున్న; ఇట్లనుటచే "దేవతలను నీ యజ్ఞముచే భావింపుము. ఆ దేవతలు మిమ్మును సంభావన చేసెదరు. ఒకరి నొకరు భావించుకొనుచు ఉత్కృష్టమగు శ్రేయస్సు నందగలరు" అను న్యాయమున పరస్పరము నుపకారము జరుగు కార్యముల జేయుటచే రెండులోకముల భారము వహించుటచే గలిగిన పీడాతిశయము తోచుచున్నది. "పాండురస్య" తెల్లనయిన. "ఆతపత్రస్య" శ్వేతచ్ఛత్రముయొక్క. దీనిచే శరీ

రము దానిని పోలియున్నదని సూచితమగును. "ఛాయాయాం నీడయందు. ఇది ముదుసలితనమును సూచించుచున్నది.

ఆతపమున శ్రమించుట, రాజులకు వ్యాయామరూపముగ శరీరదార్ఢ్యమునకై ఆవశ్యకమని భావము. "ఇదం శరీరం" శరీరము. ఇంతవఱకు మిక్కిలి సారముతో గూడినదని ద్యోతిత మగుచున్నది.

లేదా, "కృత్స్నస్య" అనుటచే తాను ఇతరులు అను భేదము లేకుండుటయు, గొప్ప కొలది భేదము లేకుండుటయును సూచితములు. కావున ప్రభుమాత్రునకు సర్వసాధారణముగ క్షేమ మాచరించుట ఆవశ్యకమని తెలియనగును.

స 2. శ్లో॥ 13. అనురూప స్సవై నాథో లక్ష్మీవా న్లక్ష్మణాగ్రజః।
త్రైలోక్యమపి నాథేన యేనస్యాన్నాథవత్తరం।

వ్యా॥ సవై- స ఏవ (నాహమిత్యర్థః-) అనురూపః- అనుకూలః। నాథః- ప్రభుః। లోకస్యేతివా- ప్రజానామితి వా శేషః। యథావా- సర్వత్ర సుఖ మేధతే జన స్తదనుగుణ ప్రవృత్తి సంపాదకతయా సర్వాన్పాలయితుం సమర్థ ఇత్యవగమ్యతే। అత ఏవ వక్ష్యతి కైకేయీం ప్రతి రామః "నాహ మర్థపరో దేవి లోకమావస్తు ముత్సహే" ఇతి। తత్ర హేతుః। లక్ష్మీవానితి- "సా లక్ష్మీ రుపకురుతే యయా పరేషా" మిత్యు క్తరీత్యా పరోపకృతి ప్రయోజక ప్రకృతిశాలీత్యర్థః। "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యా" వితి పురుషసూక్త ప్రతిపాదితలక్ష్మీ పదార్థః। స ఏవేతి భావః। అత ఏవ "పరిత్రాణాయ సాధూ

నాం వినాశాయ చ దుష్కృతాం । ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" ఇత్యాది ప్రతిజ్ఞా భగవత స్సంగ చ్ఛతే। తత్రాపి హేతుః। లక్ష్మణాగ్రజ ఇతి "లక్ష్మ్యా అచ్చేతి" పామాది గణాంతఃపాతిసూత్రేణ లక్ష్మీశబ్దస్య అకారాంతా దేశే "లోమాది పామాది పిచ్ఛాదిభ్యశ్శనేల చ" ఇతి మత్వర్థీ య న ప్రత్యయే చ లక్ష్మణశబ్దః నిష్పన్నః- తస్యాప్యగ్రజ ఇత్యనేన రామస్య మహోపకారశీలత్వం ప్రతీయతే- తచ్చ రామలక్ష్మణయో స్తత్వం బాల్యాత్ప్రభృతి సర్వసంప్రతిపన్న మితి దశరథస్యాశయః। యద్వా- ఏతావత్పర్యంతం కులమర్యా దయా మమ నాథత్వేఽపీదానీం దివాకరసన్నిధౌ కరదీపికాయా ఇవాస్యసన్నిధౌ ప్రభుత్వమయుక్తమిత్యాహ- అనురూప ఇతి । వైశబ్దో నిశ్చయే । లక్ష్మీవానితి ప్రశంసాయాం మతుప్- తచ్చ ప్రాశస్త్యం స్వస్వామిత్వ మాత్రేణ సర్వాహ్లాదకత్వ రూపం- అత ఏవ "కస్త్వైక ప్రియదర్శనః" ఇతి వాల్మీకేః ప్రశ్నః- అత ఏవ లక్ష్మణాగ్రజత్వ మస్య యుక్తమితి లక్ష్మణాగ్రజ ఇత్యుక్తం। అథవా- అనుగతం సర్వహృదయానుష్యూతం-రూపం-మూర్తిః యస్య సః అనురూపః- తాదృశో నాథః- ప్రభుః- లోకే హి సౌమ్యస్యాపి ప్రభోః కదాచి దుద్వేజకతయా సర్వహృదయా నుగతం రూపం న భవతీతి తతోఽస్య విశేషః। తత్ర హేతుః- లక్ష్మీవానితి- అనపాయేన లక్ష్మీసంబంధినోఽస్య ప్రజాస్వామ్యే కథం తాసాం తదనుగతివిరహ ఇతి భావః । తదేవ ఉపష్టంభ యతి- లక్ష్మణాగ్రజ ఇతి- తద్ధి అవిచ్ఛిన్న తత్సాహచర్యబోధ

కం- పూర్వోక్తరీత్యా లక్ష్మణస్యాప్యగ్రజత్వే కింవర్ణ్యతేఽస్య
లక్ష్మీవత్వ మితి భావః। అత ఏవ వక్ష్యతి "రామో రామో
రామ ఇతి ప్రజానా మభవన్ కథాః। రామభూతం జగ దభూ
ద్రామే రాజ్యం ప్రశాసతీ"తి। ఇదమే వావశ్యకమిత్యాహ
త్రైలోక్యమపీతి- అస్మిన్ లోకే ఽస్య నాథత్వ ఏవ తత్తల్లోక
నాథానా మింద్రాదీనా మనేన నాథవత్తయా స్వాస్థ్యం భవతి
నత్వన్య థేత్యర్థః- సర్వోత్కృష్టగుణవిశిష్టస్య భగవత్ప్రసాద
లబ్ధస్య మత్పుత్రస్యోదయః భూభారవహనజన్యక్లేశహరణ
ద్వారా మదర్థ మేవ కేవలం న- కింతు తత్తద్దేవతాపీడానివారణ
ఫలకోఽపి సంభావ్యత ఇతి భావః- విష్ణుపరత్వ ప్రతిపాదన ప్రసం
గేన అనురూప ఇత్యాదా శివసంబంధి విరూపాక్షత్వా ద్యమం
గళరూపరహిత ఇత్యాద్యర్థవిషయక తాత్పర్యకతయా వాల్మీకి
కృతస్తుతిపరోఽయం శ్లోక ఇతి వ్యాఖ్యానం తు దశరథస్య శ్రీరా
మచంద్ర సంబంధి మాహాత్మ్యజ్ఞానతాత్పర్యేణ వా స్వపుత్ర
సంబంధి మహిమాతిశయస్య దశరథకర్తృకవర్ణన మనుచిత మితి
తాత్పర్యేణ వా శివనిందాద్వారా స్వీయవిష్ణువిషయక భక్తి
ప్రకటనతాత్పర్యేణ వా న విద్మః। ప్రాజాపత్య పురుషాను
గ్రహాలబ్ధపాయసపరిణామస్య స్వపుత్రచతుష్టయస్య దేవతా
త్వజ్ఞానే సర్వసులభే దశరథస్యైవ కథం తదభావస్స్యాత్।
స్వపుత్రసంబంధి సకలగుణశ్రేష్ఠతాయా ఏతచ్ఛ్లోక సంబంధి
దశరథప్రోక్త పూర్వసందర్భవర్ణానుగతాయాః కథం పరిత్యా
గస్స్యాత్। విరూపాక్షత్వాది శివసంబంధి వికృతరూప ఇవ

విష్ణ్వవతారభూత మత్స్య కూర్మ వరాహాది విరూప భగవదం శేపి హేయత్వబుద్ధిప్రసక్త్యా తద్వ్యాఖ్యాతుః కథం వా విష్ణు భక్తి రిత్యాది చింతనీయం। ఏతద్వ్యాఖ్యానే ప్రకరణ విరోధస్తు కశ్చి దతిశేత ఇత్యలం॥

తా॥ "సవై" ఆతడే- నేను కానని యర్థము."అనురూపః" అనుకూలమైన. "నాథః" లోకమునకుగాని, ప్రజలకుగాని ప్రభువు; లేదా, ఏరీతిగ జనులు అంతటను సుఖము నొందునో దానికి తగిన ప్రవృత్తిని సంపాదించుటచే అందఱను పాలించుటకు సమర్థుడని తోచును. కనుకనే "దేవీ! నేను ధనాసక్తుడను కాను. లోకక్షేమమునే కోరుచున్నాను" అని కైకనుగూర్చి రాము డనుచున్నాడు. ఇందులకు కారణము "లక్ష్మీవాన్" "దేనిచే పరుల కుపకారముచేయబడునో అదియే లక్ష్మి" అను రీతిని పరుల కుపకారము జేయు స్వభావముతో గూడినవాడని యర్థము. "హ్రీ యును లక్ష్మియును నీకు భార్యలు" అని పురుషసూక్తమున జెప్పబడిన లక్ష్మిపదార్థ మాతడే యని భావము. కనుకనే "సత్పురుషులను రక్షించుటకు, దుర్మార్గులను శిక్షించుటకు, ధర్మమును స్థాపించుటకును యుగ యుగమున అవతరింతును" ఈ మొదలగు భగవంతునిప్రతిజ్ఞ తగియున్నది. అందుకును హేతువు 'లక్ష్మణాగ్రజః' లక్ష్మి కలిగినవాడయిన లక్ష్మణుని కగ్రజుడనుట. దీనిచే రామునికి గొప్పదగు పరోపకార స్వభావము సూచిత మగుచున్నది. ఇట్టి రామ

లక్ష్మణుల తత్త్వము బాల్యమునుండియు సర్వవిదితమైనదని దశరథుని యభిప్రాయము.

లేదా, ఇంతవఱకు కులమర్యాదచే నేను ప్రభువునైనను ఇప్పుడు దివాకరుని (సూర్యుని) యెదుట దీపమునకువలె ఈతని యెదుట రాజ్యము చేయుట నాకు తగదని తెలుపుటకై "అనురూపః" అనినాడు. 'వై' అను శబ్దమునకు నిశ్చయమని యర్థము. "లక్ష్మీవాన్" ఈపదము ప్రశంసారూపార్థమున విధింపబడిన మతుప్ప్రత్యయముతో గూడినది. ఆప్రశంసయును తన ప్రభుత్వముచే అందఱను ఆహ్లాదమును కలుగజేయుటయే. కనుకనే "ఎవడు ముఖ్యమగు ప్రీతిని గలుగజేసెడి దర్శనముకలవాఁడో" అను వాల్మీకి ప్రశ్నయు, కనుకనే లక్ష్మణునికి అన్నగారగుటయు ఈతనికి తగినదని 'లక్ష్మణాగ్రజః' అనినాడు.

లేదా, "అనుగతం" అనుగతమైన, సర్వహృదయములయందు అనుస్యూతమైన "రూపం" మూర్తికలవాడు; అనగా ప్రభువు. "సవై నాథః" అటువంటినాథుడు. సౌమ్యుడైన ప్రభువు కూడ ఒకప్పుడుద్రిక్తుడైనచో నాతని రూపము అందఱి హృదయములను చూరగొననేరదు. కావున ఇతరులకంటె నీతనియందట్టివిశేషము కలదనుటకై "లక్ష్మీవాన్" అనినాడు. లక్ష్మీదేవితో ఎన్నడును ఎడబాటులేని యీతడు ప్రభువగుచుండ ప్రజలాతనిని యనుసరింపకుండుటెట్లు? "లక్ష్మణాగ్రజః" అనువిశేషణము ఈవిషయమునే సమర్థించుచున్నది. ఈపదము అవిచ్ఛిన్నముగ లక్ష్మణునితో కూడినవాడని బోధించు

చున్నది. కావున వెనుక చెప్పిన రీతిని లక్ష్మణుని కన్నగారగు నీతడు లక్ష్మీవంతుడని వేఱె చెప్పనేల? కావుననే "రాముడు రాజ్యమును బాలించుచుండ ప్రజలు రామ, రామ యనియే ప్రసంగించుచుండిరి. జగత్తంతయు రామమయ మాయెను" అని మహర్షి వచించియున్నాడు. కావలయునది ఇదియే యనుటకై "త్రైలోక్యమపి" యనునది. ఈలోకమున కీతడు ప్రభువైనపుడే, ఆయా లోకములకు ప్రభువులయిన యింద్రాదులు ఈతనిచే ప్రభువు కలవారగుదురు. అప్పుడే వారలకు స్వస్థత కలుగును. వేఱొక రీతిని వారలకు స్వాస్థ్యము కలుగనేరదని యర్థము.

సమస్తమైన యుత్కృష్టగుణములతో గూడినట్టియు, భగవదనుగ్రహముచే లభించిన నా పుత్రుని యుదయము భూభారమును వహించుటచే నాకు కలిగిన క్లేశమును హరించి నన్నే యుద్ధరించునది గాక, ఆయాదేవతలకు కలుగు పీడలను కూడ నివారించునదిగా నాచే నూహింపబడుచున్నదని భావము.

విష్ణు పారమ్యమును ప్రతిపాదించు సందర్భమున 'అనురూపః' అను పదము "శివునియందు గన్పట్టు విరూపాక్షత్వము మున్నగు అమంగళరూపము లేనివాడు" అను నర్థమునకు సంబంధించిన తాత్పర్యముతో గూడినదనియు, ఈ శ్లోకము వాల్మీకి చేసిన శ్రీరామస్తోత్రరూపమనియు కొందరు వ్యాఖ్యానము చేసియున్నారు. ఇట్లు వ్యాఖ్యానము చేయుట, దశరథుడు శ్రీరామచంద్రుని మాహాత్మ్యము నెఱుగడనియా? దశరథుడు తన పుత్రుని మహిమను వర్ణించుట యుక్తము కాదనియా?

శివుని నిందించుటచే తనకు (ఆవ్యాఖ్యాతకు) విష్ణునియందుక
భక్తి వ్యక్తమగుననియా? ఎందులకో తెలియకున్నది. పు
కామేష్టియందు ప్రాజాపత్య పురుషుని యనుగ్రహముచే లభి
చిన పాయసమునకు ఫలముగ కలిగిన పుత్రులు నలుగు
దేవతాస్వరూపులే యనుజ్ఞానము సర్వసులభమైయుండ, దశ
థుని కట్టి జ్ఞాన మేల యుండను.

ఈ శ్లోకమునకు సంబంధించిన పూర్వశ్లోకములయం దను
గతముగ వచ్చుచున్న తనపుత్రుని సకలగుణశ్రేష్ఠతను వర్ణి
చుట ఇచ్చట నేల విడువవలయును. విరూపాక్షత్వము మున్న
శివుని వికృతరూపమువలె విష్ణ్వవతారమైన మత్స్య, కూర్మ
వరాహాది భగవదంశావతారములయందును హేయత్వబు
ప్రసక్తమగుటచే, పైరీతిగ వ్యాఖ్యానముచేసిన పెద్దలకు విష్ణ
భక్తి మిక్కుటముగ కలదనుట ఎట్లు? మఱియు ఈవ్యాఖ్యా
మందు ప్రకరణవిరోధ మొకటి విశేషము.

స 4. శ్లో॥ 27. కింతు చిత్తం మనుష్యాణా మనిత్య మితి మే మతిః
సతాం తు ధర్మనిత్యానాం కృతశోభిచ రాఘవ

వ్యా॥ ధార్మికేషు మనుష్యేషు ధర్మాత్మానః ధర్మ
త్యా ఇతి చ ద్వివిధాః పురుషాః। తత్ర ధర్మాపేక్షయా ప్రత్య
క్షే ఫలే మహతి యే ప్రవర్తంతే తేషాం చిత్తం అనిత్యం- ఫ
బలాబలతారతమ్యాధీనప్రవృత్తికం- ధర్మనిత్యానాం- మహ
దపి ప్రత్యక్షం ఫలం ధర్మలోపభియా యే తృణాయ మన్యంతే
తాదృశానాం- సతాం- సచ్ఛబ్దవాచ్యానాంతు- చిత్తం కృ

శోభి- కృతం ప్రథమం మనసి నిశ్చితం యత్ - తేనైవ శోభతే-
న తత్త్యజతీతి చ మే మతిరితి సముదితార్థః । ఏవంచ తాదృశ
చిత్తవృత్తేః క్రియామాత్రసాక్షికతయా బహువిధఫలసాధన
భూత సామ్రాజ్యరూప మహాఫలవిషయే స్వమాతృపరిణయ
కాలే మదీయప్రతిజ్ఞానుసారేణ స్వస్యాపి స్వామ్యాకాంక్షా
యా న్యాయ్యతయా జ్యేష్ఠానువర్తనరూప ధర్మపరస్య భరతస్య
చిత్తప్రవృత్తిః కీదృశీవాస్యా న్నవిద్మ ఇతి భావః । "నిష్ఫలం
క్లేశబహుళం, సందిగ్ధఫలమేవ చ । న కర్మ కుర్యా న్మతిమాన్
సదా వైరానుబంధిచే'' తి న్యాయేన పూర్వోక్తవిధయా భరత
సన్నిధానే తచ్చిత్తపరీక్షాపేక్షయా తదసన్నిధాన ఏవ త్వదభి
షేకశ్రేయా నిత్యభిసంధిః । తదుభయకోట్యప్రవిష్టానాం మను
ష్యాణాం తు స్మరణ మేవాప్రశస్త మితి తాత్పర్యం॥

తా॥ ధర్మపరాయణులగు మనుజులలో ధర్మాత్ము లనియు
ధర్మనిత్యు లనియు రెండుతెగల వారు కలరు. వారిలో ధర్మము
నపేక్షించి గొప్పదైన ప్రత్యక్షఫలమం దెవరు ప్రవర్తింతురో
వారల చిత్తము అనిత్యము. ఫలముల బలాబల తారతమ్యమును
గుర్తించియే కార్యమునకు గడంగుదురని భావము. "ధర్మని
త్యానాం" గొప్ప ప్రత్యక్షఫల మున్నను, ధర్మలోపభీతిచే తృణ
ముగ తలచెడి "సతాం'' సత్పురుషులని చెప్పబడువారి చిత్తము,
"కృతశోభి" మొట్టమొదట నిశ్చయించినదానిచేతనే శోభించునది.
దానిని విడుచునది కాదని నాయభిప్రాయమని యర్థము.
కావున అట్టిచిత్తవృత్తి క్రియామాత్రమే సాక్షిగా కలదిగాన

అనేక ఫలముల నార్జించుటకు సాధనమైన సామ్రాజ్య మనెడు మహాఫలము విషయమై, తనతల్లిని వివాహమాడు సమయమున నే జేసిన ప్రతిజ్ఞానుసారముగ తానుకూడ ప్రభుత్వమును కోరుట న్యాయము గాన, జ్యేష్ఠు ననుసరించుట యనెడు ధర్మమునకు కట్టుపడిన భరతుని చిత్తవృత్తి యెట్లుండునో తెలియకున్నదని భావము.

"నిష్ఫలమైనది, అనేక క్లేశములతో కూడినది, సంశయగ్రస్తమైన ఫలము కలది, ఎల్లపుడు వైరముతో గూడినది యగు కార్యమును బుద్ధిమంతు డెన్నడును చేయగూడదు" అను న్యాయముచే, వెనుక చెప్పిన రీతిని భరతుని సమక్షమున ఆతని చిత్తము పరీక్షించుటకంటె ఆతడు లేనపుడే నీకు పట్టాభిషేకము చేయుటయే శ్రేయస్కరమని నాయూహ.

పైనచెప్పిన రెండుతరగతులలో చేరని మనుజులను స్మరించుట అప్రశస్తమని భావము

స 7. శ్లో॥ 15. అనిష్టే శుభగాకారే, సౌభాగ్యేన వికత్థసే।
చలం హి తవ సౌభాగ్యం నద్యాః స్రోత ఇవోష్ణగే॥

వ్యా॥ ఉష్ణగే- ఉష్ణస్పర్శం- గచ్ఛతి ప్రాప్నోతి ఇతి ఉష్ణగః- గ్రీష్మకాలే ఇత్యర్థః। తస్మిన్ నద్యాః స్వరూపమాత్రమివ తవేదానీం ఆకార విన్యాసమాత్రగత సౌందర్య మవశిష్టమ్ తే- న తు స్రోతస్తుల్యం లావణ్యం- అత స్త్వయి భర్తురనురాగః లుప్తః। తథాపి సౌభాగ్యమానస్తు నగత ఇత్యాక్షేపః। యద్వా- అనిష్టే ఇతి- అప్రియే- సర్వేషా మవేతి తన్నిందాదో

తకం। సుభగాకారే సౌభాగ్యేవ వికత్థసే ఇతి- సౌందర్యమా
త్రేణ కేవలరూపరామణీయకేన భర్తృవాల్లభ్యం మయ్యేవేతి
గర్వితాసి। తచ్చ సౌభాగ్యం కాలభేదేన నదీవేగ ఇవ తవేదా
నీం నష్టమిత్యాహ । చలం హీత్యాదినా- కింశుకపుష్పవ దాకా
రమాత్రేణ రమణీయత్వేఽపి జ్ఞానగంధశూన్యతయా భర్త్రా పరి
త్యక్తాసీతి భావః॥

తా॥ "ఉష్ణగే" ఉష్ణస్పర్శను పొందిన, అనగా గ్రీష్మకాల
మున అని అర్థము. అప్పుడు నదికి స్వరూపమాత్రమే ఎట్లు
మిగిలియుండునో అటులనే నీ కిప్పుడు ఆకార విన్యాసమందుండు
సౌందర్యమే మిగిలియున్నది ప్రవాహమువంటి లావణ్యము
లేదు. కావున నీయందు భర్తకు అనురాగము లోపించినది.
అయినను నీకు సౌభాగ్యాభిమానము పోలేదు. అనగా భర్త
నాయందే ప్రేమకలవాడను గర్వముమాత్రము లోపించలేదు.

లేదా, 'అనిష్టే' అందరకు ఇష్టముకానిదానా! "శుభ
గాకారే సౌభాగ్యేనవికత్థసే" సౌందర్యమాత్రమున అనగా
కేవలము రూపసౌష్ఠవముచే భర్తకు నాయందే ప్రేమ కలదని
గర్వించుచున్నావు. అట్టి నీ సౌభాగ్యము (భర్తృవాల్లభ్యము)
కాలభేదముచే నదీవేగమువలె నష్టమైనదని తెలుపుటకై "చలం
హి" మున్నగు పదములను కూర్చినాడు. మోదుగపుష్పము
వలె ఆకారమాత్రముచే సుందరమైనదాన వైనను జ్ఞానగంధము
లేకపోవుటచే భర్తచే విడువబడితివని భావము.

స 7. శ్లో॥ 27. శత్రుః పతిప్రవాదేన మాత్రేన హితకామ్యయా ।
ఆశీవిష ఇవాంకేన బాలేఽపరిహృతా త్వయా ॥

వ్యా॥ బాలే- పరేంగితానభిజ్ఞే। తే భర్తేతి పూర్వశ్లోక
త్సంబధ్యతే। పతిప్రవాదేన- పతిరితి వ్యవహారేణ। శత్రుః
స్వతః త్వయి శత్రుత్వం వహన్నపి। అంకేన- ఫణాప్రసర
మందోపసర్పణాదిలక్షణేన ఆశీవిష ఇవ స్థితోఽపి। హితకామ
యా- హితాభిలాషిణ్యా। మాత్రేవ త్వయా అపరిహృతః- న
రిత్యుక్తః। ఆదౌ త్వత్సౌందర్యవశో దశరథ స్త్వయ మాభిలష
త్వాం పరిణీయాపి త్వత్పితృ కామనావిషయ త్వత్పుత్ర రాజ్య
దానవిషయే అన్యథా భావం మనసి నిధాయ స్వాత్మ సర్వ
త్నీసాధారణ్యేన పతిత్వేఽపి నిరంతరపోషణ లాలన ప్రణయ
భాషణాదిభి ర్లక్షణై స్తవైవ పతి ర్దశరథః అన్యాసాం తు నామ
మాత్రేణ వ్యవహ్రియమాణ స్సమయప్రాప్తౌ త్వామేవా
విష ఇవ వ్యనాశయదితి భావః। "దశాస్యాం పుత్రానాధేహి
పతి మేకాదశం కృధి" ఇతి శ్రుత్యా వయోతిక్రమేఽపి పుత్రవ
త్పతిః పత్న్యారక్షణీయ ఇతి చోదనాన్మాతృ సామ్యోక్తిః। పతి
భావేన దశరథస్య అంతర్గతశత్రుత్వగూహనపూర్వకం తవ
అనిష్టాచరణాత్ సర్పవృత్తిః- పూర్వోక్త సకల లక్షణైః త్వ
న్మోహనమజానంత్యా స్తవ తద్ధితాచరణ ఏవ ప్రవృత్తి రితి
యువయో రన్యోన్య మానసశుద్ధౌ మహద్వైషమ్య మితి సం
బంధః। యద్వా- మాత్రేత్యనేన ససంబంధికతయా పుత్ర ఇతి
లభ్యతే। శత్రురపి పతివ్యవహారేణ మాత్రా పుత్ర ఇవ అపరి
హృత ఇతి యోజనా। ఏవం ఉత్తరవాక్యేఽపి బాలే ఇతి పద
సామర్థ్యేన బాలయేతి ప్రతీయతే- క్రీడాసక్తయేత్యర్థః। ధృత

ఇతి శేషః । బాలయా క్రీడాసక్త్యా అంకేన గృహీతః ఆశీవిష ఇవ అపరిహృత ఇతి యోజనా॥

తా॥ "బాలే" పదుల అభిప్రాయము తెలుగనిదానా! నీభర్త (వెనుకటి శ్లోకమునుండి అనువృత్తము) 'పతిప్రవాదేన' భర్త యను వ్యవహారముచే 'శత్రుః' స్వతస్సిద్ధముగ శత్రుత్వ మును వహించుచున్నను 'అంకేన' పడగను జాపుట, మెల్లగా దగ్గరకు వచ్చుట మున్నగులక్షణములచే "ఆశీవిష ఇవ" సర్పము వలె నున్నను 'హితకామ్యయా మాత్రేవ' హితమును కోరు తల్లివలె నీచే "అపరిహృతః" విడువబడలేదు.

మొదట నీ సౌందర్యమునకు వశీభూతుడయిన దశరథుడు స్వయముగ నిన్ను కోరి వివాహమాడియు, నీ తండ్రి కోరినట్లు నీ పుత్రునకు రాజ్య మొసగుటలో వేఱొక భావము మనసునం దుంచుకొని, ఇతరభార్యలకు సాధారణమయిన భర్తయైనను, ఎల్లప్పుడు లాలనపోషణలు చేయుట, సరససల్లాపములు చేయుట మున్నగు లక్షణములచే నీకే దశరథుడు ప్రియమైన భర్త; ఇత రులకు నామమాత్రమునకే భర్తయని వ్యవహరింపబడియు, సమయము వచ్చినపుడు సర్పమువలె నిన్నే నశింపజేసెనని భావము.

"ఈమెయందు పదిపుత్రులను కూర్చుము. పదునొకండవ వానినిగా భర్తను చేయుము" అను శ్రుతివాక్యముచొప్పున వయస్సు మీరినను పుత్రునివలె భర్త కాపాడతగినవాడు. అని తెలుపుచుండుటచే నిచ్చట తల్లితో పోలిక చెప్పబడినది. దశర

ధుడు భర్తృభావముచే, లోపలనున్న శత్రువర్గమును కప్పిపుచ్చి నీ కనిష్టమును గలుగజేయుటచే సర్పమువంటివాడు. వెనుక చెప్పిన లక్షణములచే నిన్ను మోసగించు టెఱుగక, నీ వాతనికి హితవును కోరుచుండెడిదానవు. కావున మీ యిద్దరి చిత్త పరి శుద్ధతలలో గొప్ప వైషమ్యము కలదనియు సంబంధము చెప్ప వచ్చును.

లేదా, పుత్రుడు లేనిదే తల్లి యగుట యుండదు కావున "మాత్రా" అను పదముచే, సంబంధముచేతనే 'పుత్రః' -అను పదము లభించుచున్నది. శత్రువయినను పతి యన్నంతనే తల్లి పుత్రునివలె (భార్య) రక్షింపవలెనుకాని విడువగూడదు. రెండవవాక్యమందలి 'బాలే' అనుపదమును 'బాలయా' అని తృతీయాంతముగా మార్చుకొనవలెను. క్రీడలయందలి ఆసక్తిచే ఒడిలో బెట్టుకొనిన పామువలె నీచే విడువబడలేను అను నర్థమును గూర్చుకొనవలెను.

స 8. శ్లో॥ 5. భరతాదేవ రామస్య రాజ్యసాధారణాద్భయమ్
తద్విచింత్య విషణ్ణాస్మి భయం భీతాద్ధిజాయతే॥

వ్యా॥ నన్వస్తు రామస్య జ్యేష్ఠమహిషీపుత్రత్వేన జ్యేష్ఠత్వేన చ రాజ్యార్హస్య రాజ్యం- కిమస్మద్విషాదేన మాత్సర రూపదోషపిశునేన ఇత్యత ఆహ । భరతాదితి । జ్యేష్ఠమహిషీ పుత్రత్వేన జ్యేష్ఠత్వేన చ యథా రామస్య రాజ్యార్హత్వం తథా త్వత్పరిణయకాలే దశరథకృత ప్రతిజ్ఞానుసారేణ త్వత్పుత్రస్యా రాజ్యార్హత్వ మతః రాజ్యస్వామిత్వే సమప్రధానాత్ భరత

దేవ రామస్య భయం- సతాం సతి విమర్శే కులాచారస్య వా ప్రతిజ్ఞానిర్వహణస్య వా అపరిత్యాజ్యత్వం స్యాత్। యది ద్వితీయ ఏవ పక్షః "సత్యాన్న ప్రమదితవ్యం- తస్మాత్సత్యం పరమం వదంతీ" త్యాది శ్రుతిప్రామాణ్యేన స్వీక్రియతే। తదా భరతస్యైవ రాజ్యం నతు మమేతి రాజ్యచింతయా రామో భరతం సర్వదా ద్వేక్ష్యత్యేవేత్యర్థః॥ తత్- తాదృశ మితివృత్తం। విచింత్య- విషణ్ణాస్మి- విషాదం గతాస్మి। హి- యస్మాత్। భీతాత్- భీతిమూలక ద్వేషాదియుక్తాత్। భయం జాయతే- వ్యాఘ్రస సర్పాది దర్శనజస్య భీతిస్తు తదీయదుష్టత్వజ్ఞానమూలికా- నతు స్వాపాదానక తదీయ భయమూలికా- ఆత్మాన మపశ్యతోఽపి తస్య దర్శనే భయోదయానుభవాత్- మనుష్యాణా మన్యోన్యస్మా దన్యోన్యస్య తు ప్రాయశ స్స్వాభిప్రేత వస్తుభాగిత్వ సంభావనాదిమూలక ద్వేషప్రయుక్తం భయమితి వివేకః॥

తా॥ శ్రీరాముడు జ్యేష్ఠభార్యకు పుత్రు డగుటచేతను, జ్యేష్ఠు డగుటచేతను, రాజ్యమున కర్హుడగుగాక. మాత్సర్య దోషమును సూచించు మనస్సుఃఖముచే ప్రయోజనమేమి ? అను శంకకు సమాధాన మిచ్చుచున్నాడు.

"రాజ్యసాధారణాత్" రాజ్యమునకు సమానుడగు "భరతాదేవ" భరతునివలననే 'రామస్య భయం' రామునకు భయము. జ్యేష్ఠ మహిషికి పుత్రు డగుటచేతను, జ్యేష్ఠు డగుట చేతను రామునకు రాజ్యార్హత యెట్లో, అట్లే కైకను వివాహ మాడుసమయమున దశరథుడు చేసిన ప్రతిజ్ఞానుసారముగ

ఆమెపుత్రుడగు భరతునకు రాజ్యార్హత సమమైనదే గావున భరతునివలననే రామునకు భయము. పెద్దలు విమర్శించునపుడు విడిచిపెట్టతగనిది కులాచారమా? లేక, ప్రతిజ్ఞ నిర్వహించుటయా? "సత్యమునుండి ప్రమాదము నొందవలదు. సత్యమునే సర్వోత్కృష్టముగా దెలుపుచున్నారు" మున్నగు శ్రుతివాక్యములచే రెండవపక్షమే స్వీకృతమైనచో భరతునకే రాజ్యము. నాకు లేనేలేదను చింతచే రాముడు భరతుని ద్వేషించుచునే యుండునని యర్థము.

'తద్విచింత్యవిషణ్ణాస్మి' ఈసంగతిని దలచి దుఃఖించుచుంటిని. "భయం భీతాద్ధి జాయతే" భయమును కలుగజేయు ద్వేషాదులతోగూడినవారివలన భయము కలుగుచునే యుండును. వ్యాఘ్రమునుగాని, సర్పమునుగాని జూచినపుడు అవి ఘాతుకజంతువు లను జ్ఞానము గలుగుటవలననే భయము జనించును. తనవలన నవి భయపడుటవలన గాదు తన్నామృగములు చూడకపోయినను, వానిని చూచినతోడనే భయము నొందుట యనుభవసిద్ధమే. సాధారణముగ మనుజులలో నొకరివలన వేరొకనికి పరస్పరము భయము కలుగుట, తాను కోరు వస్తువున కెడుటివాడు భాగస్వామి యగుటచే గలిగిన ద్వేషమూలముననే.

స 8. శ్లో॥ 6. లక్ష్మణోహి మహేష్వాసో రామం సర్వాత్మనా గతః। శత్రుఘ్నశ్చాపి భరతం కాకుత్స్థం లక్ష్మణో యథా॥

వ్యా॥ రామవ ద్భరతస్యాపి రాజ్యాధికారే సమప్రాథా

న్యై జ్ఞాపకాంతరమప్యాహ। లక్ష్మణోపీతి। లక్ష్మణశత్రుఘ్నా హి స్వాభిప్రేతరాజ్యఫలభోగార్థం స్వమత్యర్థం రామభరతా వశ్రియతామ్। అన్యథా తయో స్తత్ర గాఢానుబంధః కథం స్యాదితి భావః॥

తా॥ రామునివలె భరతునకును రాజ్యాధికారమున సమమైన ప్రాధాన్యము గలవాడనుటకు వేఱొక ప్రమాణమును దెలుపుచున్నాడు.

లక్ష్మణశత్రుఘ్నులు తమ కిష్టమయిన రాజ్యఫలము ననుభవించుటకై రామభరతుల నాశ్రయించిరి. లేనిచో వారి వారికి వారివారియందు గాఢానురాగ మె ట్లుండగలదు ?

స 8. శ్లో॥ 7. ప్రత్యాసన్న క్రమేణాపి భరతస్యైవ భామిని।
రాజ్యక్రమో విప్రకృష్ట స్తయోస్తావ త్కనీయసోః॥

వ్యా॥ దూరవిచారే తు రామాపేక్షయా భరతస్యైవ రాజ్యే అధికారప్రాబల్యహేతు రస్తీత్యాహ। ప్రత్యాసన్నేతి। భరతస్యైవ- ఇత్యనేన రామస్య రాజ్యాధికారవ్యవచ్ఛేదః। ప్రత్యాసన్నక్రమేణేత్యస్య అయం అర్థః- ప్రత్యాసత్తిర్హి ప్రకృతే రాజ్యాధికారనియామకసంబంధవిశేషః- తద్విశిష్టః క్రమః- న్యాయః- సచ రాజ్ఞో యథేష్టవినియోగానుకూలః ప్రీతివిశేషాదిః తద్విషయక ఏవ- నతు కౌసల్యాదివిషయకః- తదీయత్వాపాదకస్తు జ్యేష్ఠమహిషీజన్యత్వం జ్యేష్ఠత్వమిత్యేవ సంబంధః- త్వత్పుత్రస్య తు మహిషీ పుత్రత్వం త్వద్విషయక ప్రీతివిశేషః- తదీయప్రతిజ్ఞావిషయత్వంచేతి హేతుత్రయం- తథా చ- జ్యేష్ఠ

పుత్ర మపి యసుం విహాయ తురీయపుత్రాయ పూరవే య యాతిరివ భరతాయైవ రాజ్యం దాతు మర్హో రాజా యది ప్రాజ్ఞః- తాదృశప్రత్యాసత్తిబలం రామస్య నేత్యాశయః। కనీయసోస్తు- లక్ష్మణశత్రుఘ్నయోః నియుక్తప్రత్యాసత్తి పదార్థానా మన్యతమస్యాప్యభావాత్ - విప్రకృష్టః- ఆలోచనస్యైవావిషయః రాజ్యక్రమః- అతస్సాధారణ్యం వా రామేణ ప్రాగుక్తదిశా- అసాధారణ్యం హా వినా రామేణ ప్రకృతమార్గేణ భరతస్య రాజ్యాధికారే న్యాయ్యమితి సముదితతాత్పర్యం॥

తా॥ దూరమాలోచింపగ రాముని కంటె భరతునకే రాజ్యాధికారమునకు ప్రబలహేతువు గలదని తెలుపుచున్నాడు. 'ప్రత్యాసన్నక్రమేణ' ప్రత్యాసత్తి క్రమముచేనైన 'భరతస్యైవ' భరతునకే అనుటచే రామునకు రాజ్యాధికారము లేదనుట. భరతునకే రాజ్యక్రమము సన్నిహితము అని అర్థము. ప్రత్యాసత్తిక్రమ మనగా ప్రత్యాసత్తి యన ప్రకృతమున రాజ్యాధికారముకు నియమించు సంబంధ విశేషము. దానితో గూడిన క్రమము అనగా న్యాయము. అదియును రాజున కిచ్చవచ్చినట్లుగ వినియోగించుటకు తగిన ప్రీతివిశేషము మున్నగునది. నీ (కైకేయి) విషయముననే. కౌసల్య విషయమున లేదు. రాముని దనుటకు జ్యేష్ఠమహిషి వలన బుట్టుట, జ్యేష్ఠుడగుటయే కారణములు.

నీ పుత్రునకో పట్టమహిషికి పుత్రుడగుట, నీయందు ప్రేమవిశేష ముండుట, ఆతడు ప్రతిజ్ఞ చేసియుండుటయు మూడు

కారణములు. కావున జ్యేష్ఠపుత్రుడయినను యదువును వదలి యయాతి నాల్గవపుత్రుడగు పూరునకు రాజ్య మిచ్చినట్లుగ, రాజు ప్రాజ్ఞు డయినచో భరతునకే రాజ్య మీయదగును. అట్టి యోగ్యత రామునకు లేదని యభిప్రాయము.

'కనీయసోః' చిన్నలగు లక్ష్మణశత్రుఘ్నులకు పై చెప్పిన కారణములలో నొకటియును లేకుండుటచే వారికి రాజ్యాధికారము మిక్కిలి దూరము. 'విప్రకృష్టః' రాజ్యక్రమమును గురించి యాలోచింపదగిన విషయము. కావున రామునితో సాధారణముగను లేక ముందు చెప్పిన రీతిని రాముని వదలి యసాధారణమగు రాజ్యాధికారము ప్రస్తుతమార్గమున భరతునకే న్యాయ్యమనియు సముదాయ తాత్పర్యము.

స 8. శ్లో॥ 8. విదుషః క్షత్రచారిత్రే ప్రాజ్ఞస్య ప్రాప్తకారిణః।
భయాత్ప్రవేపే రామస్య చింతయంతి తవాత్మజం॥

వ్యా॥ భరతస్యైవ- న రామస్య రాజ్యక్రమః ప్రత్యాసన్నః ఇత్యత్ర రామప్రవృత్తిరేవ జ్ఞాపికేత్యాహ । విదుషః- సర్వవిద్యాపారదృశ్వనః । క్షత్రచారిత్రే ప్రాజ్ఞస్య- రాజ్యతంత్రే పండితస్య । ప్రాప్తకారిణః- యచ్ఛ న్యాయప్రాప్తం తత్రైవ యత్నవతః । తాదృశస్య రామస్యాపి భయాత్- భరతాత్కిం? వా విహతం స్యాదితి శంకాయాః- తవాత్మజం చింతయంతీ- న్యాయ్యమపి రాజ్యం భరతాదవ్యాప్యైతి- అన్యథా సర్వదర్శీ రామః కిమితి బిభీయాద్భరతా దితి ధ్యాయంతీ ప్రవేపే- ప్రకంపే- ఇతికర్తవ్యతా మూఢా భవామీత్యర్థః- యది రామస్య

భరతాన్నభయం తర్హి ఏతాదృశే స్వస్య మహోత్సవే సాక్షా త్సోదరస్య సర్వగుణాకరస్య భరత స్యాగమనం కిమితి నాపేక్షిత వానితి భావః। యత్తు భరతాదేవేత్యాది శ్లోకచతుష్టయస్య (స॥ 8. శ్లో॥ 5, 6, 7, 8.) వ్యాఖ్యానే జన్మప్రత్యాసత్త్యాదినా కేనచిత్ నక్షత్రప్రత్యాసత్త్యాదినా కేనచిదర్థవర్ణనేన భరతస్యైవ రాజ్య ప్రత్యాసత్తిః నతు లక్ష్మణ శత్రుఘ్నయో రిత్యాదినా లక్ష్మణశత్రుఘ్నయో రాజ్యాధికార నిరాకరణపరతయా పూ ర్వోక్త చతుశ్శ్లోక్యా స్తాత్పర్యవర్ణనం ప్రాచాం। త న్నసమ్య క్। "సుహృదశ్చ ప్రమత్తా స్త్వాం రక్ష న్త్వద్య సమన్తతః। భవన్తి బహువిఘ్నాని కార్యాణ్యేవం విధానిహి॥ విప్రోషితశ్చ భరతో యావదేవ పురా దితః। తావదే వాభిషేకస్తే ప్రాప్త కాలో మతో మమ" ఇత్యాది సందర్భేణ భరతస్యైవ రాజ్య స్వామిత్వమిత్యర్థస్య దశరథేనోక్తప్రాయత్వా వగమేన తత్క్ల ప్తైరై వాన్వయస్య వక్తవ్యత్వాత్॥

తా॥ భరతునకే రాజ్యక్రమము సన్నిహితము. రాము నకు గాదనుటలో రాముని ప్రవృత్తియే కారణమని తెలుపు చున్నారు. "విపశ్చితః" సర్వవిద్యల యంతమును జూచినట్టియు, "క్షత్రచారిత్రే ప్రాజ్ఞస్య" రాజ్యమును నడిపించుటలో పండితు డగునట్టియు, "ప్రాప్తికారిణః" న్యాయప్రాప్తమైన పనియందే యత్నముగలట్టి రామునకు భరతునివలన నేమి చెడిపోవునో యను భయమువలన, "తవాత్మజం చింతయంతీ" న్యాయ్యమయి నను రాజ్యము భరతుని తొలగిపోవుచున్నది; లేకున్న సర్వజ్ఞు

డగు రాముడు భరతునివలన భయపడనేల? అని ధ్యానించుచు "ప్రవేపే" వడకెను. ఇది చేయుతగిన దను జ్ఞానము లేనిదాన నగుచున్నానని యర్థము. రామునకు భరతునివలన భయము లేకున్నచో సీతని కిట్టి మహోత్సవము జరుగుచుండ భరతుడు రావలెనని యేల కోరదని భావము. కొందరు ప్రాచీనులు పైనుదహరించిన "భరతాదేవ" అను (స 8. శ్లో॥ 5, 6, 7, 8) నాలుగుశ్లోకములకు వ్యాఖ్యానము చేయునపుడు జన్మచే సాన్నిధ్య ముండుటవలనను, నక్షత్రసాన్నిధ్య ముండుటవలనను, భరతునకే రాజ్యాధికార సంబంధమనియు, లక్ష్మణ శత్రుఘ్నులకు రాజ్యాధికారము లేదనియు, ఇదియే పై నాలుగు శ్లోకములకు తాత్పర్యమనియు వర్ణించియుండిరి. ఆ వ్యాఖ్యాన మనుకూలముగ లేదు. "నీ స్నేహితులు ఏమరక నిన్నంతటను రక్షింతురుగాక. ఇట్టికార్యముల కనేక విఘ్నములు వచ్చుచుండును" "ఎంతవరకు భరతు డీపురమునుండి యుత్తరదేశమునకు వెడలియుండునో ఆలోపుగనే నీ పట్టాభిషేకము జరుగుట యుక్తము" మున్నగు సందర్భములచే భరతునకే రాజ్యాధికార మను నర్థము దశరథుడే చెప్పినట్లగుటచే ఈ వ్యాఖ్యానక్రమముననే అన్వయము చెప్పుట యుక్తము.

స 14. శ్లో॥ 47. యథా నందతి తేజస్వీ సాగరోఽభాస్కరోదయే।
ప్రీతః ప్రీతేన మనసా తథానందఘనస్స్వతః॥

వ్యా॥ పూర్వేద్యు ర్నిశ్చితప్రకారేణ పట్టాభిషేకేతికర్తవ్యతాకలాప మవిద్యమానమివ భావను న్సుమన్త్రః సాకూతం

రాజానం స్తౌతి । యథేతి । అభాస్కరోదయే- చంద్రోదయే- నక్షస్యాదృశ్యస్యాపి గమకత్వేన సదృశస్య చంద్రస్యైవ ప్రతీతేః। సాగరః- సముద్రః । యథా నందతి- సంతుష్యతి- పుత్రాభ్యుదయస్య పితృసంతోష హేతుత్వాత్ । తథా- స్వపుత్రాభ్యుదయం దృష్ట్వా- నంద- ఆనందం ప్రాప్నుహి । పూర్వాపేక్షయాపి స్వాభివృద్ధి హేతుత్వాదితి భావః । తదనుకూలం సంబోధయతి । ఘనేతి- సత్స్వభావేత్యర్థః- అన్యేషాం తు రాజ్ఞాం స్వసన్నిధౌ స్వపుత్రస్యాప్యభ్యుదయేఽసహనం ప్రాయికం- త్వంతు న తాదృశో భవేదితి భావః । యద్వా- గరం- గరళం- తద్భిన్నం అమృతం- అగరం- తత్సహితః చంద్రః ఇత్యర్థః- తేజస్వీ- తతఃపూర్వం ప్రకాశమానోపి పర్యాయేణ భాస్కరోదయే- సూర్యాభివృద్ధౌ- యథా నందతి- తత్సన్నిధౌ స్వస్య తేజోహైన్యేపి యథా నఖిద్యతి- కాలక్రమేణ సోఽపి స్వాభివృద్ధికాలే వృద్ధిం ప్రాప్నోతి- కింతద్విషయే విచారేణేతి మత్వా యథా నాత్మని వికరోతి । తథా త్వమపి వర్తస్వేతి యావత్ । అమృతస్యాగరపదేవ గ్రహణాత్ సాధుత్వం వ్యజ్యతే । స్వతః- స్వీయే మనసి- "సార్వ విభక్తికస్తసిః ।" కించ యథా సాగరః సగరవంశోత్పన్న స్సరోఽపి। తేజస్వీ- ప్రతాప విశిష్టః । భాస్కరోదయే- ప్రతాపవిషయే సూర్యప్రతాపే ప్రస్తూయమానే। యథా నందతి- సంతుష్యతి- తస్య స్వకూటస్థత్వాదితి భావః । తథా స్వతః స్వకీయే స్వకులోపాస్యదేవతాస్వరూపే ఽస్మిన్ శ్రీరామే విషయే నంద- సంతోషం ప్రాప్నుహి ఇత్యర్థః॥

తా॥ పూర్వదినమున నిశ్చయించిన రీతిని పట్టాభిషేకము జేయుటకు తగు ప్రయత్నము లేనట్లుగ భావించుచు సుమంత్రుడు అభిప్రాయగర్భితముగ రాజును స్తుతించుచున్నాడు. "అభాస్కరోదయే" చంద్రోదయమగునెడ. (న + భాస్కరః = అభాస్కరః) సూర్యుడు కానివాడు. ఇచ్చట 'న' అనుదానికి సాదృశ్యార్థమును గ్రహించి సూర్య సదృశుడగు చంద్రుడను నర్థము గ్రహింపనగును. "సాగరః యథా నందతి" సముద్రు డెట్లు సంతసించునో, (పుత్రాభ్యుదయము తండ్రికి సంతోషజనకము గాన) అట్టులనే నీపుత్రుని యభ్యుదయమును జూచి సంతసింపుము. పూర్వముకంటె నీయభివృద్ధికి గారణ మని భావము. దానికి తగునట్లుగ సంబోధించుచున్నాడు. "ఘన" మంచి స్వభావముగలవాడా ? యని యర్థము. ఇతరరాజులకు తమ సన్నిధిని తమపుత్రుల కభ్యుదయము గలిగినచో తరుచుగ సహింపకుండుటయే తటస్థించును. నీ వట్టివాడవు కావుమని భావము.

లేదా, గరం—గరళము. అగరం—గరళముకంటె వేరైనది. అమృతము. "సాగరః" అమృతముతో గూడినవాడు చంద్రుడు అనియు నర్థము చెప్పవచ్చును. 'తేజస్వీ' అంతకుముందు ప్రకాశించువాడయినను, "భాస్కరోదయే యథా నందతి" క్రమముగ సూర్యు డుదయించునపు డెట్లు సంతసించునో; అతని (సూర్యుని) సన్నిధానమున తన తేజస్సు క్షీణించినను (చంద్రుడు) ఖేదము నెట్లుపొందడో. కాలక్రమముచే నందరును తమ యభివృద్ధికాలమున వృద్ధినందుచుందురు. ఆవిషయమున ఆలో

చనతో నేమిప్రయోజనమని తలచి తనవిషయమున (చంద్రుడు ఎట్లు వికారము నొందడో ఆరీతిగ నీవుకూడ వర్తింపుమని భావము. 'అగర' అను పదముచే అమృతమను నర్థమును గ్రహించుట యుక్తమని తోచును. 'స్వతః' తనమనస్సునందు 'యథా సాగరః' ఏరీతిగ సగర వంశమందు పుట్టిన ప్రతివాడును, 'తేజస్వీ' ప్రతాపముతో గూడినవాడు. "భాస్కరోదయే" సూర్యుని ప్రతాపము స్తుతింపబడునపుడు "యథానందతి" ఎట్లు సంతోషించునో. ఆతడు (సూర్యుడు) తన కూటస్థుడు గాన అని భావము. ఆరీతిగనే స్వతస్సిద్ధముగ తనసంబంధమైన తన కులమున కుపాస్యదేవతాస్వరూపుడగు నీ శ్రీరాముని విషయమున సంతోషము నొందుమని యర్థము.

స 16. శ్లో॥ 13. కౌసల్యా సుప్రజా రామ పితా త్వాం ద్రష్టుమిచ్ఛతి। మహిష్యా సహ కైకేయ్యా గమ్యతాం తత్ర మాచిరం॥

వ్యా॥ ఇతఃపూర్వం త్వత్పితుః- కైకేయీ విషయకానురాగదర్శనేన త్వన్మాతు రదృష్టలోప ఇతి మాదృశాం మతిరిదానీం తు తత్ప్రతీపం త్వన్మాత్రైవ శ్లాఘ్యా- యతః కైకేయ్యా అపి భర్తృసన్నిధౌ త్వద్దర్శనోత్కంఠాభూదిత్యాహ । కౌసల్యా సుప్రజేతి । మహిష్యేతి- మహిషీ త్వేపి- పత్యు రత్యంతానురాగవిషయత్వేఽపి- తత్పుత్రం విహాయ త్వయ్యేవ ప్రేమాతిశయవత స్సకైకేయీకస్య దశరథస్య ప్రవృత్త్యా త్వన్మాతృపుణ్యాతిశయ స్స్వరూపేణ పరిణత ఇతి సూచ్యత ఇతి భావః॥

తా॥ ఇంతకుముందు దశరథుడు కైకేయివిషయమున యనురాగము జూపుటచే నది సీతల్లికి (కౌసల్యకు) అదృష్టలోప మని నూవంటివారి యభిప్రాయము. ఇప్పుడు దానికి వ్యతిరేక ముగ సీతల్లియే కొనియాడదగినది. ఏకారణముననో కైకేయికి గూడ తనభర్త సమ్ముఖమున నిను జూడవలెనను కోరిక జనించుటచే "కౌసల్యా సుప్రజా" అనినాడు. 'మహిష్యేతి' పట్టపుభార్య యయినను, అనగా భర్తకు మిక్కిలి యనురాగ పాత్రురాలైనను, ఆమెపుత్రుడగు భరతుని వదలి, నీయందే ప్రేమాతిశయము గలిగిన కైకేయి దేవితోగూడిన దశరథునకు నీయందలి ప్రవృత్తిచే సీతల్లి యొక్క పుణ్యాతిశయ మీరూపమున పరిణమించినదని సూచిత మగుచున్నది.

స 17. శ్లో॥ 13. న హి తస్మాన్మనః కశ్చి చ్చక్షుషీ వా నరోత్త మాత్। నర శ్శక్నో త్యపాక్రష్టు మతిక్రాంతేఽపి రాఘవే॥

స 17. శ్లో॥ 14. యశ్చ రామ న్నపశ్యేత్తు యం చ రామో న పశ్యతి। నిందిత స్సవసేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే॥

వ్యా॥ అతిక్రాంతేఽపి రాఘవే- అత్మీయప్రీతి మపూరయిత్వా అన్యత్ర గతేఽపి శ్రీరామే ప్రసృతం మనః తాదృశే చక్షుషీ వా । తస్మా న్నరోత్తమాత్ - పురుషశ్రేష్ఠాత్ । అపాక్రష్టుం- సన్నివర్త్య విషయాంతర ప్రవణీకర్తుం। కశ్చిదపి- అతిధీరోపి । నరః- జీవః । నశక్నోతి- నపర్యాప్నోతి । తద్రూప రామణీయకస్య తదీయ ప్రజావిషయకసౌమనస్యస్య చ అనన్యసాధారణతయా తత్సంగజన్యసుఖవిశేషానుభవయుతం పూర్వో

క్తే బాహ్యాభ్యంతరేంద్రియద్వయ మపి పురోవస్థిత దారపుత్రా దికం వా సన్నికృష్టరమ్యాంతరం వా నావగాహత ఇత్యర్థః। రమ్యతమం హి వస్తు దుస్త్యజమితి భావః। యద్వా- అతిక్రాం తేఽపి- "న చక్షుషా పశ్యతి కశ్చిదేనం" "యతో వాచో నివ ర్తంతే అప్రాప్య మనసా సహ" ఇతి శ్రుత్యా చ స్వవృత్త్యతీత త్వేన ప్రసిద్ధే రాఘవే తద్వంశ్యపుణ్యప్రభావేన తదుత్పన్నే ప్రసృత మితి శేషః। తస్మా న్నరోత్తమా దపాక్రష్టుం- అప కృష్య పృథక్కృత్య అన్యత్ర శ్రుతిప్రసిద్ధేషు దేవతాన్తరేషు ప్రసారయితుం కశ్చిదపి నరః- విద్వాన్- నశక్నోతి- తదతిరిక్త స్య దేవతాన్తరస్య తాదృశమహిమానాస్పదత్వ నిశ్చయేన తముత్తమపురుషం విహాయ అన్యత్ర న రమత ఇతి భావః। అథ వా- తస్మా న్నరోత్తమాత్ మనః చక్షుషీ వా రాఘవే అతి క్రాన్తేఽపి- యావన్మన శ్చక్షు ర్వా నరస్య ప్రసర్పతి తద్దేశమతీ త్య క్రాన్తేఽపి- గతేఽపి అపాక్రష్టుం- క్రమేణాయం దూరం గచ్ఛతి- తతో నాయం విషయీభవతి- కి మనేనాదృష్టవస్తు విషయకాభిలాషేణేతి పశ్చా దాక్రష్టుం నశక్నోతి-నాలంభవతి। స్వయం తత్తదపేక్షయా దూరతోఽపసర్పన్నపి ద్రష్టృజనప్రీత యే స్వస్వరూపం నికటస్థ ఇవ దర్శయతీత్యర్థః। సూర్యాదీనా మివ తద్రూపసాక్షాత్కారే దూరస్థత్వాదికం తథాత్వే న దోష ఇతి భావః। యద్వా-బలవదధీనం వస్తు దుర్బలః కథం స్వవశం కుర్యాదితి భావః। కించ। కశ్చిత్ హీనోవా అధికోవా నరః। అతిక్రాంతేఽపి- స్వసమీపప్రదేశ మతిక్రమ్యాన్యత్ర గతే

ऽपि రాఘవే- తద్వంశోత్పత్తి మాత్రేణైవ సర్వానుకూలచరితే ప్రవర్తితం మనః తథావిధే చక్షుషీవ। నరోత్తమాత్ - ప్రత్యేకం తత్తద్వ్యక్తిమాత్రస్య సంభూయ తాదృశ మహోత్సవే మనాంసి చక్షూంసి చ యావన్తి స్వస్మిన్ ప్రవృత్తాని తావద్భి ర్మనోభి శ్చక్షుర్భిశ్చ సర్వాన ప్యతిప్రేమ్ణా నందయత స్తస్మా దపాక్రష్టుం-పునరప్యపకృష్య స్వాయత్తీకర్తుం న శక్నోతీత్యర్థః- స్వస్మిన్ప్రజానాం యావాననురాగ స్తతోऽపి గాఢానురాగం తా ఆదృతవతో రాజ్ఞః కోనామ విరజ్యేదితి భావః। నను కిమితి తత్సమయే తస్మింస్తాదృశీ ప్రీతిః; కిమితివా తస్య తత్ర తాదృగను బంధః కాలాన్తరేऽపి తస్య సౌలభ్యాదిత్యత ఆహ- యశ్చరామ మితి। తాదృశ సామ్రాజ్య మహోత్సవస్య స్వీయత్వాభిమానేన ఆత్మదిదృక్షయా యది న సమాయాయాత్ తాదృశం వా జనం స్వదృష్టిప్రసారేణ యది రామో నప్రీణయేత్ తర్హి స నరః వవసేదేవ- తత్ర యది వసేత్ తదాభిశప్తో వసేత్ తథాత్వేచ- స్వాత్మస్వరూప ఈశ్వరోపి తన్నిరాకుర్యాత్। అతస్తాదృశనిందాప్రయోజకీభూత బలవత్తరదోషవిశిష్టః కోऽపి నాస్తీతి భావః॥

తా॥ "అతిక్రాంతేऽపిరాఘవే" తమప్రీతిని పూరింపకయే శ్రీరాముడు వేఱొకచోటికి కేగినను, "ప్రసృతం మనః" ఆతనియందు తగిలిన మనస్సును "చక్షుషీవా" నేత్రములను గాని, "తస్మాత్ నరోత్తమాత్" ఆపురుషోత్తమునినుండి 'అపాక్రష్టుం' దగ్గరనున్న వేఱొక విషయమునందు దగుల్చుటకు

'కశ్చిదపినరః' మిక్కిలి ధీరుడగు మనుజుడుగూడ "నశక్నోతి" సమర్థుడగుటలేదు. ఆతని సౌందర్యము, ప్రజలయం దాతనికి గల సౌమనస్యమును ఇతరులకు సాధారణములు గాకుండుటచే, యాతని సహవాసమున గలిగిన సుఖవిశేష మనుభవించుచున్న బాహ్యాభ్యంతరేంద్రియములు యెదుటనున్న దారపుత్రాదులనుగాని, దూరముగనున్న రమ్యమగు వస్తువులనుగాని, గుర్తించుట లేదని యర్థము. మిక్కిలి సుందరమగు వస్తువును విడుచుట కష్టమని భావము.

లేదా, 'అతిక్రాంతేఽపి' అతిక్రమించినను, "ఈ ఆత్మనెవ్వడును చక్షు రింద్రియములచే గుర్తింప లేడు." "దేనిని తెలిసికొనలేక మనస్సుతో గూడ వాక్కులు మరలినవో" మన్నగు శ్రుతులచే నింద్రియప్రవృత్తుల కతీతుడని ప్రసిద్ధి జెందిన శ్రీరాముడు, ఆ వంశస్థుల పుణ్యప్రభావముచే నచ్చట యవతరించినపు డాతనియందు దగుల్కొనిన మనస్సును "తస్మా న్నరోత్తమా దపాక్రష్టుం" ఆ పరమపురుషుని నుండి వేరు జేసి శ్రుతిప్రసిద్ధమయిన యితర దేవతల యందు ప్రసరింప జేయుట కొఱకు, 'కశ్చిదపి నరః నశక్నోతి' విద్వాంసు డెవడు సమర్థుడు గాడు. ఆతని కంటె నితరమయిన దేవత యట్టి మహిమ గలది గాదను నిశ్చయ మున్నపు డుత్తమ పురుషు డగు నాతని వదలి ఇతరత్ర మనస్సు రమించుట లేదని భావము.

లేదా, ఆ నరోత్తముని నుండి 'మన శ్చక్షుషీ వా రాఘవే అతిక్రాన్తేఽపి' మనస్సు నేత్రములు నెంతవరకు ప్రసరిం

చునో యట్టి ప్రదేశమును దాటి వెడలినను "అపాక్రష్టుం నశ క్నోతి" ఈతను దూరమున కేగినాడు; మనకింక గనబడడు; ఈ కనబడని వస్తువు విషయమై మనకీ యభిలాష యేల యని వెను కకు మరలుటకు సమర్థుడగుట లేదు. తాను వారి వారి నుండి దూరముగ తొలగినను, చూచువారి ప్రీతి కొఱకు తన స్వరూ పమును దగ్గర నున్నట్లుగనే చూపించుచున్నా డని యర్థము. సూర్యుడు మున్నగు వారియొక్క-వలె యాతని రూపసాక్షా త్కా-రవిషయమున దూరముగ నుండుట దోషావహము గాదని భావము.

లేదా, బలవంతుని యధీనములో నున్న వస్తువును బల హీను డెట్లు స్వాధీనము జేసికొన గలడని భావము. మఱియు, 'కశ్చిత్' హీనుడైనను, అధికు డైనను మనుజుడు, 'అతిక్రాం తేఽపి' తన సమీప ప్రదేశమును దాటి వేఱొక చోటికి వెడలి నను, 'రాఘవే' రఘువంశ మందు బుట్టుటచేతనే యందర కనుకూలమయిన చరిత్రము గలవాని విషయమున "ప్రవర్తితం మనశ్చక్షుషీ వా" తగుల్చబడిన మనస్సును నేత్రములను 'నరో త్తమాత్' అట్టి మహోత్సవసమయమున తనయందు సంసక్త మయిన మనస్సులు నేత్రములు నెన్ని గలవో యన్నిటిని, యన్ని మనస్సుల తోను, నేత్రముల తోను, యందర నానందము నొం దించు చున్న శ్రీరాముని వలన నుండి, 'అపాక్రష్టుం' తిరిగి మరలించుకొని తన యధీనము చేసి కొనుటకు "నశక్నోతి" సమర్థు డగుట లేదు. ప్రజలకు తనయం దెట్టి యనురాగము

గలదో, అంతకంటె నెక్కుడగు యనురాగముతో వారి నాద
రించు రాజువిషయమున నెవడు విముఖుడు గాగల డన
భావము.

ఆ సమయమున యాతనియం దట్టి ప్రీతి యేల కలుగ
వలెను ? ఆతనికిని యట్టి ప్రేమానుబంధ మేల కలుగవలెను ?
కాలాంతరమందును లభించెడివారే గదా! యను ప్రశ్నలకు
సమాధానముగ దెల్పుచున్నాడు. 'యశ్చ రామం న పశ్యేత్తు'
ఎవ డట్టి సామ్రాజ్యమహోత్సవమును తనదను అభిమాన
ముచే, తన్నును జూడవలెనను నిచ్ఛచే రాడో, 'యంచ రా
మో న పశ్యతి' అట్టి జనుని శ్రీరాముడు తనదృష్టిప్రసార
ముచే సంతోషపెట్టడో, 'స న వసేదేవ' ఆ జనుడుండనే యుం
డడు. ఒకవేళ ఉన్నను, 'నిందితః వసేత్' నిందితుడై యుం
డును. 'స్వాత్మాప్యేనం విగర్హతే' అట్టి తఱిని స్వాత్మస్వరూపు
డగు నీశ్వరు డాతని నిరాకరించును. కావున నట్టి నిందింప బడు
టకు దగిన దోషముతో గూడినవా డెవడును లేడని భావము.

స 17. శ్లో॥ 15. సర్వేషాం హి స ధర్మాత్మా వర్ణానాం కురుతే ద
యాం। చతుర్ణాం హి వయస్థానాం తేన తే తమనువ్రతాః॥

వ్యా॥ హి- యస్మాత్ । ధర్మాత్మా- ధర్మే న్యాయే
ఆత్మా బుద్ధిర్యస్య స జాతితో వా మతతో వా భేద మనాదృత్య
న్యాయైకపక్షపాతీత్యర్థః । చతుర్ణామపి వర్ణానాం- ఏతేషా
మేవ కేవలం న- కింతు సర్వేషామపి తద్బహిష్కృతానామపి ।
వయస్థానాం- యావనదశాస్థేఽపి దయాం కురుతే-వయోబలేన

ఆగామ్యనర్థ మనాలోచ్య వివదమానే ష్వన్యోన్యం తేషు ధర్మ నిర్ణయే కర్తవ్యే జాత్యాదిభేద మవిగణయ్య దయాం దర్శయ న్నేవ మృదుపూర్వం దండనీతి ముపయుజ్య ప్రజాః పాలయత్యే యమితి సర్వానుమతప్రవృత్తిక ఇత్యర్థః। దయాధర్మయో స్సమ బలయోరపి ధర్మాపేక్షయా దయామేవ ప్రధానీకృత్య నిష్పక్షపాతం సర్వత్రాపి సామ్యేన వర్తత ఇతి భావః। శక్తేష్వపి ఏవం కిముత బాలవృద్ధేష్వితి తాత్పర్యం। యద్వా-చతుర్ణాం వయస్థానా మిత్యనేన- చతుర్విధవయోగతానా మిత్యర్థః। తేన హేతునా। తే నరాః సర్వేపి। తమనువ్రతాః- తదనుసరణమేవ వ్రతమితి నిశ్చితాత్మాన ఇత్యర్థః। నరా ఇత్యనేన నారీణాం కైముతికత్వకల్పనం తు న న్యాయ్యం। స్వీయాతిరిక్త స్త్రీమాత్రే మాతృభావేన ప్రవర్తమానే తస్మిం స్తాదృశబుద్ధేరప్రసక్తే రుత్తమనాయకస్య తత్కల్పనే అనౌచిత్యప్రసంగాత్। తస్య సర్వమోహనాకారవత్త్వేఽపి ఇతరత్ర స్వస్యే వేతరస్యాఽపి స్వవిషయే సుబుద్ధేరేవోదయ కల్పనాయా ఏవోచితత్వాచ్చ।

ఇతి శ్రీమద్రామాయణే అయోధ్యాకాండే హారితస
గోత్రోద్భవేన బొమ్మకంటి నృసింహశాస్త్రిణా
విరచితాయాం కల్పవల్లికాఖ్యాయాం
వ్యాఖ్యాయాం ప్రథమః కిసలయః

---

తా॥ 'హి' ఏకారణమున, 'ధర్మాత్మా' ధర్మమందె బుద్ధి గలవాఁడో, (జాతి మత భేదముల నాదరింపక న్యాయము నందే పక్షపాతము గలవాఁ డనుట.) ఆ కారణముచే 'చతుర్ణా మపి వర్ణానాం దయాం కురుతే' నాల్గు వర్ణముల వారికిని దయ ను జూపుచున్నాఁడు. వీరలకుమాత్రమే కాదు. ఈ వర్ణములలో నుండెడి 'వయస్థానామపి' యౌవనావస్థయం దున్నవానియం దును దయ పఱచుచున్నాఁడు. వయోబలముచే రాజోవ్యు యనర్థ ము నాలోచింపక యువకు లొండొరులు వివాదము నొందు నపుడు ధర్మనిర్ణయము జేయు నవసరము రాగా, జాతి మత భేదములను పాటింపక దయను జూపుచునే మృదురీతిని దండనీతి నుపయోగించి, యాతఁడు ప్రజలను పాలించుచున్నాఁడు. కావున యందరకు నభిమతమైన ప్రవర్తన గలవాఁడని యర్థము.

దయా ధర్మములు సమమైన బలముగలవయినను, ధర్మము కంటె దయనే ప్రధానముగ జేసికొని, పక్షపాతము లేకుండ యంతటను సమానముగ ప్రవర్తించు చున్నాఁడని భావము. సమర్థుల విషయముననే యిట్లు దయ జూపు నపుడు బాల వృద్ధుల విషయమున దయ జూపునని వేరుగ జెప్ప నేల ? యని తాత్పర్యము. లేదా, 'చతుర్ణాం వయస్థానాం' (బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యములను) నాల్గువిధముల వయస్సు కలవారికిని యని యర్థము.

'తేన తే త మనువ్రతాః' ఆ కారణమున ఆ జను లం దఱు, నాతని ననుసరించుటయే వ్రతమని నిశ్చయించుకొనినా

రని యర్థము. ఇక్కడ "నరులే యిట్లున్నపుడు నారులు (స్త్రీలు) అట్లుందురని వేరే చెప్పనేల ?" యనుట యుక్తము గాదు. తన స్త్రీని తక్క యితర స్త్రీలను మాతృ భావముతో జూచెడి శ్రీరాముని విషయమున యట్టి బుద్ధి కలుగదు గాన, యుత్తమ నాయకుని కట్టి భావమును గల్పించుటకంటె వేరొక యసాధారణమైన యభిప్రాయ మెద్దియు నుండబోదు. ఆత డందరను మోహింపజేసెడి యాకారము గలవాడయినను, ఆతని కితరులయందువలె, నితరుల కాతనియందును మంచిబుద్ధి కలిగినదని చెప్పుటయే యుక్తము.

ఇట్లు శ్రీహారితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహ
శాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ
కల్పవల్లికా వ్యాఖ్యానమందు ప్రథమ
కిసలయము సంపూర్ణము.

---

స 18. శ్లో। 17. కచ్చిత్తే పరుషం కించి దభిమానా త్పితా మమ
ఉక్తో భవత్యా కోపేన యత్రాస్య లులితం మనః
వ్యా। తే అభిమానాత్ - ప్రణయాత్ -మత్పితరీతి శేషః
ఉపపత్తేః- తద్ధేతుకోయః కోపః। తేన- ప్రణయకలహేనే
యావత్। తన్నిమిత్తేన। పరుషం- కించి ద్దుర్వచం తత్సందర్భ
విరుద్ధం యథా తథా మమ పితా ఉక్తః కచ్చి దిత్యన్వయః
ప్రణయకలహస్య నాయికావిశేషస్వభావత్వేఽపి భర్తృగ
ప్రభుత్వాదిక మనాలోచ్య శబ్దతోఽర్థతశ్చ విరుద్ధం యది భా
షేత పత్నీ తన్మహదనిష్ట మితి భావః। యత్ర సతి- అస్య
మత్పితుః మనః లులితం-కలుష మాసీత్ - తదా చక్షేత్యాది
తే అభిమానాదిత్యస్య త్వద్విషయక భర్తృవాల్లభ్యార్థకత్వం
తస్మా త్కో-పేనేత్యనే నాన్వయపరం। తే కోపేన అభిమా
నాత్ - గర్వాదాౖ ఇత్యర్థం ప్రకల్ప్య తస్య పరుషోక్తిహేతుత్వ
వర్ణనపరం చ వ్యాఖ్యానం న సమ్యక్। ఆద్యే-భర్తృవాల్లభ్యస్య
పరుషోక్తిహేతుత్వాసిద్ధేః- కోపేనవేతి పక్షాంతరం తు తస్య
త్వాంతరాపేక్షితయాఽసంపూర్ణం। ద్వితీయే తు పరుషోక్తిహేతు
ద్వయస్యాపి హేత్వంతరాపేక్షితయా తదకథనేన న్యూనతా
యథా కథంచి న్మదీయార్థతాత్పర్యకత్వే తు మమ క్తరీత్యైవా
న్వయ స్స్వీకర్తవ్యః। సోౖక్తవ్యాఖ్యయా తదలాభాత్॥
తా॥ "తేఽభిమానాత్ కోపేన" నీకు మా తండ్రియం
దుగల ప్రణయమువలని కోపమున- ప్రణయకలహముచే నన
భావము. 'మమపితా' నాతండ్రి, "పరుషం కించి దుక్తః కచ్చి

త్'' కఠినముగ మాటలాడబడి నాడా? ప్రణయకలహము నాయికామాత్రమునకు సహజమయినను, భర్తయొక్క ప్రభుత్వాదికము నాలోచింపక భార్య, శబ్దార్థములచే విరుద్ధముగ మాటలాడినచో నది గొప్ప యనర్థమే యగు నని భావము. "యత్ర అస్య లులితం మనః" ఏ ప్రసంగమున నా తండ్రి మనస్సు కలుషిత మాయెనో అట్టి ప్రసంగము కలిగినదా చెప్పుము.

"తే అభిమానాత్" అనుదానికి నీవిషయమున గల భర్తృవాల్లభ్యమనియు, దానివలని కోపముచే, యని యన్వయించుటయు, "తే కోపేన'' నీ కోపముచే, "అభిమానాత్" గర్వము వలన గాని, యని అర్థము చెప్పి, అవి పరుషోక్తికి హేతువు లని వర్ణించిన వ్యాఖ్యాన మనుకూలముగ లేదు. మొదటిపక్షమున భర్తృవాల్లభ్యము పరుషవాక్కులను గూర్చి కారణ మగుట అప్రసిద్ధము.

"కోపముచేగాని" అను పక్షాంతరము మఱియొక కారణము నపేక్షించుటచే నసంపూర్ణ మగును. కాన పరుషవాక్కులను గురించి చెప్పిన రెండుకారణములకు కారణాంతరము లపేక్షితములు గాన ఆహేతువులను జెప్పకుండుట న్యూనతయే యగును. ఏదియో యొకరీతిని నే చెప్పిన అర్థములందే తాత్పర్యము కలదన్నచో నే చెప్పిన రీతినే యన్వయక్రమమును స్వీకరింపవలెను. ఇతర వ్యాఖ్యానములయం దట్టియర్థము లభింపుట లేదు.

స 18. శ్లో॥ 24. ధర్మమూల మిదం రామ విదితం చ సతామపి।
తత్సత్యం న త్యజే ద్రాజా కుపిత స్త్వత్కృతే యథా॥

వ్యా॥ మహ్యం వరద్వయం దాస్యామీతి త్వత్పిత్రు ప్రతిజ్ఞా రూపం ఇదం సత్యం- ధర్మమూలం। ఇతః పూర్వం యజ్ఞ దానాది రూప స్తదాచరితో యో ధర్మః- తస్య మూలం ఫల వత్వే కారణం। అస్య త్యాగే తదీయ సర్వోధర్మోఽపి నిరర్థకః॥ "సత్యే సర్వం ప్రతిష్ఠిత" మితి శ్రుతిప్రామాణ్యా దితిభావః। తచ్చ వాక్యం తాత్కాలిక ప్రీతివిశేషేణ లీలాయితం వా మద్విషయక స్నేహాతిశయానిబంధనం వా న। కింతు సతామపి విదితం। తత్రత్యానాం సర్వేషామపి రాజర్షి ప్రభృతీనాం సమక్ష మవశ్యకర్తవ్యతయా నిశ్చితం । తత్- తాదృశ బలయుతం సత్యం రాజా నత్యజేత్ । కుపితః- మదీయ నిర్బంధవశేన కోప యుక్తః। నను సత్యసంధేఽస్మి న్నిత్యమితి తవ విపరీతాశంకేత్యత ఆహ । త్వత్కృతే- తద్విషయక ప్రేమానుబంధేన యథాపూర్వం ప్రథమతో విశ్వామిత్రంప్రతి సామాన్యతః ప్రతిజ్ఞాతమ ప్యంశ మత్యాక్షీ త్తథా కుర్యాదితి భీత్యా ఇత్థం వదామీతి భావః॥

తా॥ "ఇదం సత్యం" నాకు రెండువరముల నిచ్చెదనని నీతండ్రి గావించిన ప్రతిజ్ఞారూపమైన యీ సత్యము "ధర్మమూలం" ఇంతకు ముందాచరించిన యజ్ఞదానాదిరూపమగు ధర్మము ఫలవంత మగుటకు గారణభూతము. ఈ సత్యమును వీడి నచో ఆతని ధర్మమంతయు నిరర్థకమగును.

"సత్యమందే సర్వము ప్రతిష్ఠితమైనది" అను శ్రుతివాక్య ప్రామాణ్యము పై విషయమును సమర్థించును. ఆనాటి దశరథ వాక్యము, తాత్కాలికమగు ప్రీతివిశేషముచే విలాసముగ మాటలాడినది గాదు; నాయందుండెడి ప్రేమవిశేషమును బురస్కరించుకొని యనినదియు గాదు. "కింతు సతామపి విదితం" అచ్చట నుండెడి రాజర్షులు మున్నగు వారందఱి యెఱుట అవశ్యము చేయదగినదిగా నిశ్చయింప బడినది.

"తత్సత్యం రాజా" అట్టి బలముతో గూడిన సత్యవచనమును ఈ దశరథమహారాజు "కుపితః నత్యజేత్" నా నిర్బంధముచే కోపముతో గూడినవాడై విడువకుండు గాక; సత్యసంధుడగు నీతని విషయమున నీకు విపరీతాభిప్రాయ మెందులకుం దురేమో? "త్వత్కృతే యథా" నీ యందలి ప్రేమానుబంధముచే పూర్వము విశ్వామిత్రునకు మొదట ప్రతిజ్ఞ చేసిన యంశమును గూడ నెట్లు విడనాడినాడో యట్లే విడనాడునేమో యను భీతిచే నిట్లు పలుకుచుంటివని భావము.

స 18. శ్లో॥ 28. అహో ధిఙ్నార్హసే దేవి వక్తుం మా మీదృశం వచః। అహం హి వచనాద్రాజ్ఞః పతేయమపి పావకే॥

వ్యా॥ దేవి- పట్టమహిషి। ఈదృశం- పితృవాక్యాతిక్రామితయా త్వయాపి శంక్యమానం । మాం ధిక్- నిందాస్తు! అతః- ఈదృశం వచః వక్తుం నార్హసే- నార్హసి- పితృవాక్య విముఖతయా సంభావ్యమానోఽహం త్వయా నైవం వర్తితవ్యం పితరీత్యాదినా ఽవమంతవ్య ఏవ। నతు తద్వాక్యకరణే మదాశయ

పరిజ్ఞానాయ సామ్నా సంభాష్య ఇత్యర్థః। "సద్విద్యా యది కిం ధనై రపయశో యద్యస్తి కిం మృత్యునా" ఇతి న్యాయేనా పయశోభాజనస్య జన్మ వృథైవేతి భావః। తదేవ సమర్థయతి। అహం హీత్యాదినా॥

తా॥ 'దేవి' పట్టపురాణీ? "ఈదృశం మాం ధిక్" పితృ వాక్యము నతిక్రమించెడి వాడ నేమో యని నీచే శంకింపబడు నన్నును గూర్చి నింద యగు గాక. "ఈదృశం వచః వక్తుం నార్హసే" కావున నిట్టి వాక్యమును పలుకుట తగదు. పితృవా క్యమునకు విముఖడనై యుందునని నీచే తలంపబడు నేను, తండ్రి విషయమున నిట్లుండజనదని నీచే యవమానింపదగిన వాడనే. ఆతని వాక్యమును పాలించుటలో నాయభిప్రాయమును దెలి యుటకు సామముగ మాట్లాడదగినవాడను కాను. "యోగ్య మయిన విద్య యున్నచో ధన మెందుకు? అపయశస్సున్నచో వేరె మృత్యువుతో పనియేమి?" అను న్యాయముచే అపకీర్తి భాజనుని జన్మ వ్యర్థమే యని భావము.

పై విషయమునే "అహం హి వచనా ద్రాజ్ఞః పతేయ మపి పావకే" నేను రాజువాక్యమును విని అగ్నియందైనను దుమికెద నని సమర్థించుచున్నాను.

స 18. శ్లో॥ 29. భక్షయేఽయం విషం తీక్ష్ణం మజ్జేయమపి చా
ర్ణవే। నియుక్తో గురుణాపిత్రా నృపేణ చ హితేన చ।

వ్యా॥ ఇత్యంతేన। వచనాదితి- "ల్యబ్లోపే పంచమీ" వచనం శ్రుత్వేత్యర్థః। గురుణా- పిత్రా- నృపేణ- హితేనచ-

ఏతేషా మేకైక ధర్మయుక్త ఏవాలం మాం నియోక్తుం- కిం పునరుక్త ధర్మచతుష్టయసంపన్న ఇతి తాత్పర్యం । నియుక్తః- ఆజ్ఞప్తశ్చేత్- త్వమేవం కుర్వితి తద్వచన మనుశాసనరూపం యది- దుష్కర మప్యగ్నిపతనాదికం కుర్యా మిత్యర్థః । పితృ వాక్యాతిక్రమణమూలకాపకీర్తిరూప దుర్మరణప్రాప్త్యపేక్షయా తత్పరిపాలనజన్యయశోభాజనతయాత్యల్ప మైహికం ఫలం పరిత్యజ్య చిరంతన మహాసుఖ మనుభవామీతి భావః ॥

తా॥ "గురుణా పిత్రా నృపేణ చ హితేన చ" గురువు, తండ్రి, రాజు, హితుడు, (వీరి ధర్మములలో నొకొక్క ధర్మము తో గూడి యున్నను నన్ను నియోగింపజాలియుండును. పై నాల్గు ధర్మములతో గూడిన యాతని మాట వేరె చెప్పనేల యని భావము.) నగువానిచే "నియుక్తః" నీ విట్లు చేయు మని ఆజ్ఞాపింపబడినచో దుష్కరమైనను అగ్నియందు దుమికెదను. తీక్ష్ణమగు విషమునైన భక్షించెదను. సముద్రమునందైనను దుమికెదను. పితృవాక్యము నతిక్రమించుట మూలమున గల్గిన యపకీర్తి యనెడు దుర్మరణము వచ్చుట కంటె దానిని పరిపాలించుటవలన గలిగెడి యశస్సునకు పాత్రుడనై, స్వల్పమగు ఐహికఫలమును వదలి చిరకాలముండెడి మహాసుఖము ననుభవించెదనని భావము.

స 18.శ్లో॥ 30. తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభికాంక్షితం।
కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభిభాషతే॥

వ్యా॥ రామో ద్విర్నాభిభాషతే- ద్విరితి- "ద్విత్రి
చతుర్భ్య స్సుజితి" సుజంత మవ్యయం। యాదృశార్థబోధ
తాత్పర్యేణ యద్వాక్యం ప్రయుక్తం తత్పున స్తథా న ప్రయుక్త
ఇత్యర్థః। తథా ప్రయోగశ్చ విప్రలిప్సాసంభావనానిషేధకతయా
ప్రమాదాదినా వా స్యాత్ । యథావద్వక్తరి రామే త
త్వభావా త్తదుభయం నాస్తీతి భావః। ద్విర్బద్ధం సుబద్ధం భ
తీతి న్యాయస్తు అస్మదీయవిషయక ఇతి తాత్పర్యం। ప్రకృతే
త్వదీయ విపరీతసంభావనానివృత్త్యర్థం తు- కరిష్యే- ప్ర
జానే ఇతి చ ఏకతాత్పర్యకమేవ వాక్యద్వయం ప్రయుక్త మితి
భిసంధిః । రామ ఇతి స్వస్మి న్నన్యత్వవ్యపదేశస్తు యది ద్విర
భాషేత తర్హి నాహం రామః- కింత్వన్య ఏవేతి శపథద్యో
నార్థ మిత్యాశయః। యత్తు ప్రతిజ్ఞయా వినా ద్విరుక్తి న్నకరో
తీతి ద్విర్నాభిభాషతే ఇత్యస్యార్థ ఇతి వ్యాఖ్యానం తత్ప్రతిజ్ఞయా
సహ ద్విర్వదతీ త్యర్థఫలకతయా తదఘటితస్య స్వవాక్యస
ప్రామాణ్యం నాస్తీ త్యర్థం ప్రత్యాయయ త్సందర్భవిరు
మిత్యుపేక్ష్యం । కించ- తద్వాక్యస్య తాదృశార్థపరత్వం ల
ణయా ఖలు కల్ప్యం- మదుక్తరీత్యార్థకల్పనే తాత్పర్యాను
పత్తే రభావేన తదనవకాశ ఇతి దిక్॥

తా॥ "రామో ద్విర్నాభిభాషతే" శ్రీరాముడు రెం
మాఱులు మాటలాడడు. 'ద్విః' యనునది 'సుచ్' ప్రత్యయా
తమైన యవ్యయము. ఏ యర్థమును బోధింపవలెనను తాత్ప
ముతో ఏ వాక్యము ప్రయోగింపబడెనో, తిరిగి యా వాక్య

నట్లు ప్రయోగింపదని యర్థము. అట్లు ప్రయోగించుట లిప్సచే గాని, సంభావింపబడిన దానిని నిషేధించుటచే గాని, ప్రమాదముచేగాని గలుగును. యథాయోగ్యముగ మాటలాడు శ్రీరాముని విషయమున ఆహేతువులు లేవుగాన పై జెప్పిన రెండుమారులు మాటలు లేవని భావము. "రెండుసార్లు బాధించిన బాగుగ బాధింపబడినదగును" అను న్యాయము ఇతరులవిషయముననే యని భావము. ప్రకృతమున నీకు గలిగిన విపరీత భావమును తొలగించుటకు 'కరిష్యే' (చేసెదను) "ప్రతిజానే" (ప్రతిజ్ఞ చేసెదను) అని ఒకే తాత్పర్యముగల రెండువాక్యములు ప్రయోగింపబడినవి.

ఇచ్చట 'రామః' అని తన్నన్యునిగ వ్యవహరించుట, "నేను రెండు మాటలు మాటలాడినచో రాముడనే కాను, అన్యుడనే యగుదు" నను శపథము తోచుట కొరకే.

"ద్విర్నాభిభాషతే" ప్రతిజ్ఞ లేనిదే ద్విరుక్తి చేయడని యర్థము చెప్పిన వ్యాఖ్యానము, ప్రతిజ్ఞతో గూడ రెండు మాఱులు చెప్పుచున్నాడను నర్థమును దెలుపును గాన, అట్లు రెండు మాఱులు చెప్పని వాక్యమునకు ప్రామాణ్యము లేదను విపరీతార్థమును దోపించుచు, సందర్భవిరుద్ధముగ నున్నది గాన, యుపేక్షింపతగినది. మఱియు నా వాక్యమున కట్టియర్థము లక్షణావృత్తిచే కల్పింపవలెను. నేను చెప్పిన రీతిని అర్థమును కల్పించినచో తాత్పర్యమున కనుపపత్తి యుండదుగాన అట్టి లక్షణ కవసరమే లేదని తెలిసికొనతగినది.

స 18. శ్లో॥ 35. సన్నిదేశే పితుస్తిష్ఠ యథా తేన ప్రతిశ్రుతమ్
త్వయారణ్యం ప్రవేష్టవ్యం నవవర్షాణి పంచ చ
శ్లో॥ 36. భరత స్త్వభిషిచ్యేత యదేత దభిషేచనం।
త్వదర్థే విహితం రాజ్ఞా తేన సర్వేణ రాఘవ।
శ్లో॥ 37. సప్త సప్త చ వర్షాణి దండకారణ్య మాశ్రితః।
అభిషేక మిమం త్యక్త్వా జటాజినధరో వస।
శ్లో॥ 38. భరతః కోసలపురే ప్రశాస్తు వసుధా మిమాం
నానారత్న సమాకీర్ణాం సవాజిరథకుంజరాం।

వ్యా। సన్నిదేశే- సాధు శాసనే తిష్ఠ- ప్రథమం సత్య భావేన పిత్రాజ్ఞానువర్తన ముత్తమ మితి బుద్ధ్యా ధైర్యేణ తదనుపాలయా మీతి ప్రతిజ్ఞాయాపి తద్విషయ పర్యాలోచనే దుష్కరత్వ జ్ఞానేన మన శ్చలేత్- తథా రహిత స్సన్ య స్వేత్యర్థః। యథా- యేన ప్రకారేణ- తం శృణ్వితి శేషః ప్రతిజ్ఞాప్రకార మేవాహ- త్వయేత్యాది రథకుంజరా మిత్య తేన। అభిషేచన మితి- కరణే ల్యుట్- అభిషేక సాధన మిత్యర్థః। త్వ దభిషేక ముద్దిశ్య రాజ్ఞా యదద్య త్సంపాదితం తేన సర్వేణాపి వస్తుజాలేన త్వదభిషేకవిహతిచింతయా నిరు త్సాహతా స్యాత్- కాలవిలంబేన వా స్యాత్- అరణ్యేఽపి సపరివారం సరాజ్యచిహ్నం చ వాసాభిలాషస్స్యా త్తాదృశ సకలవిషయ నిరోధపూర్వకం తవ వనవాసః సమస్త చతురంగ సేనాది సమేతాఖండభూమండలాధిపత్యం భరతస్య చేతి ద్వయ మిత్యర్థః। ద్విత్రాః- త్రిదశేత్యాదావివ చతుర్దశేత్యు

క్త్వావస్యాపాతత్వో౽ర్థాంతర ప్రతీతిస్స్యా దితి ఝటితి నిశ్చిత సంఖ్యాప్రతిపత్తి సంభావనయా నవ పంచేతి సప్త సప్తేతి చ నిర్దేశః । ఉత్తరత్ర చతుర్దశేత్యుక్తి స్తు పూర్వోక్త నిశ్చిత సంఖ్యాజ్ఞాన నిబంధనేతి జ్ఞేయం॥

తా॥ "పితుః సన్నిదేశే తిష్ఠ" తండ్రిగారి యోగ్యమగు శాసనమందుండుము. ముందుగ యోగ్యమగు స్వభావముచే దండ్రి యాజ్ఞననువర్తించుట యుత్తమమను బుద్ధిచేతను ధైర్యముచేతను నా యాజ్ఞను పాలించెదనని ప్రతిజ్ఞ చేసియును, తిరిగి దానివిషయము నాలోచించినపుడు చేయశక్యముగానిదను జ్ఞానముచే మనస్సు చలించెడిని. అట్టి చాంచల్యము లేక యత్నింపుమని యర్థము. "యథా తేన ప్రతిశ్రుతం" ఏరీతిగ నాతనిచే ప్రతిజ్ఞ చేయబడినదో దానిని వినుము.

నీ యభిషేకము నుద్దేశించి రాజుచే నేదేది సంపాదింపబడినదో ఆ సమస్తవస్తుజాలముచే భరతుడు అభిషిక్తుడగుగాక. నీ యభిషేకము ఆగిపోయినదను చింతచే నిరుత్సాహము గలుగవచ్చును. కాలవిలంబము గాని జరుగ వచ్చును. అరణ్యమందును పరివారముతో గూడ రాజ్యచిహ్నములు ధరించి యుండెదమను నభిలాషయు గలుగవచ్చును. అట్టి విషయము లన్నియు మాని వైచికొని నీవు వనమున వసించుటయు, సమస్త చతురంగసేనలతో గూడిన అఖండభూమండలాధిపత్యము భరతునకు నగుగాక.

'ద్విత్రాః' 'త్రిదశ' యను పదములందువలె 'చతుర్దశ' యను చోట నాలుగుపదు లను వేఱొక యర్థము తోచునేమో

యని సరియగు పదునాలుగను నర్థము సిద్ధించుటకై 'నవ పంచచ' 'సప్తసప్త' యనియు కవి ప్రయోగించుచున్నాడు. తరువాత "చతుర్దశ" (పదునాలుగు) యని చెప్పుట, ముందు నిశ్చితమైనసంఖ్యను పురస్కరించుకొనియే యని తెలియనగును.

స 19. శ్లో॥ 7. అహం హి సీతాం రాజ్యం చ ప్రాణానిష్టాన్ ధనాని చ। హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతా యాప్రచోదితః॥

వ్యా॥ యదీతః పూర్వమేవ భరతస్య రాజ్యాధికారాశయం పితుస్తవ వా జానీయాం- తదా- పితృచోదనాభావేఽపి సీతాది సకలవస్తుజాతం భరతాయైవ సమర్పయేయ మిత్యాహ। అహం హీత్యాదినా। అత్ర సీతాదానం- తదీయాజ్ఞాపరిపాలనోపయికత్వ తాత్పర్యకం- న త్వన్యథా- అనౌచిత్య ప్రసంగాత్। ప్రాణదానం తు- స్వవిషయేఽపీత్థరత్రేవ తత్స్వామిత్వప్రతిపాదనపరం। హృష్టః- తాదృశ దానస్య మదీయౌదార్యాత్కట్య ప్రతిపాదకత్వా త్సంతోషః। ఇదానీంతనస్యతు- పితృశాసనాది నిమిత్తకతయా తదపేక్ష యాపకర్ష హేతుత్వా త్తదభావ ఇతి భావః॥

తా॥ ఇంతకుముందే భరతునకు రాజ్యాధికారమును గూర్చిన యాశయము తండ్రిగారికిగాని, నీకుగాని, యున్నట్టు నే నెఱింగినచో మాతండ్రిగారు ప్రేరేపింపకున్నను, సీత మున్నగు సమస్తవస్తువులను భరతునకే సమర్పించెడివాడ నని తెలుపుచున్నాడు. "నేను సీతను, రాజ్యమును, ప్రాణములను, ఇష్టములగు ధనములను, సంతసించినవాడనై భరతునకు ఇతరులచే

ప్రేరితుడను గాకుండగనే యిచ్చెదను." ఇచ్చట సీత నిచ్చుట యనగా, ఆతని యాజ్ఞను పాలించుటకందఱనుపయోగించెద నని తెలుపుట. వేఱొక యభిప్రాయమమాత్రము గాదు. సీతను గూడ భరతునకిచ్చెదనన్నచో యనౌచిత్యమే వాటిల్లును. ప్రాణ దానమన్ననో, ఇతరునియందువలె తనయందును నాప్రాణముల విషయమున నధికారమున్నదని తెలుపుటకే. "హృష్టః" అట్టి దానము నా యౌదార్యాతిశయమును ప్రతిపాదించునదిగాన సం తోషము. ఇప్పటిదానము పితృశాసనము మున్నగువానిచే గల్గు నదిగాన దానికంటె నపకర్షకు హేతువుగాన అట్టిది లేదని భావము.

స 19. శ్లో॥ 20. నాహమర్థపరో దేవి లోకమావస్తు ముత్సహే ।
విద్ధి మా మృషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితం॥

వ్యా॥ లోకే హి ప్రాయశో రాజానః అర్థ మేవ ప్రధానీ కృత్య ధర్మ ముపసర్జనతయా సేవంతే ఉహంతు తాదృశో నేత్యాహ- నాహ మితి। తమప్యర్థం లోకారాధనోపయోక్ష్యే- న తు స్వార్థ మిత్యాహ- లోకమితి । ఆవస్తుం- ఆశ్రిత్య వస్తుం- లోకానురంజనా యార్థ ముపయుంజానో వసామీత్యర్థః అప్రా ధాన్యేనా ప్యర్థస్యా వశ్యకత్వే దు స్త్యజమేవ తే రాజ్య మిత్యత ఆహ- విద్ధీతి- మదాశయ పరిజ్ఞానం తవ యత్నవిశేషసాధ్య మితి భావః । ఉస్మత్తో లబ్ధుం వృత్త మాత్రశిత్యేత్థముక్తం- వస్తుతస్తు తదపి మే నాస్తీ త్యాహ-ఋషిభి స్తుల్య మితి- సర్వా త్మనా ధర్మ ఏవ మే మతి ర్నత్వర్థ ఇత్యర్థః । యద్వా-లోకపా

లనస్యార్థమూలకతయాఽంశేనా ప్యర్థపరత్వం- నతు భోగా ద్యర్థం మేఽ స్తీ త్యాహ- అర్థపరః లోకమావస్తు మితి చ। రాజ సామాన్యబుధ్యా మాం వనాయ త్వరయసి- నతు తత్వక్షే త్యాహ విద్ధీతి- సామాన్య జ్ఞానం త్వత్ప్రయత్నేనాపి సర్వసుల భం- విశేషజ్ఞానం తు యత్నసాధ్యమితి భావః। అత స్త్వచ్ఛే దనాయా మదీయాశయానుబంధితయా వనగమనే మదీప్సితే సహజైవ మే ప్రవృత్తిరితి భావః। కించ- అహమః అర్థః- అహంతాదిరూపా వృత్తిః-తస్యాప్యస్మ త్ప్రత్యయవిషయత్వాత్ తత్పరః-తదధీనః। లోకమావస్తుం-లోకం పాలయితుంనోత్సహే॥ కింతు కేవలం తాదృశాధ్యాసాఽనభిభూతం యథా తథా- ధర్మం- లోకానుసరణరూపం- ఆస్థితః ఉత్సహే- తత్తత్కార్యే ష్వితి శేషః। తత్ర దృష్టాంతః- ఋషిభిరితి- యథాఋషయో జ్ఞానినః రాగద్వేషాభావేఽప్యన్యత్ర దయాశాపాదికం లోకవృత్తపాలనాయ కుర్వంతి తద్వదహమపీతి। యద్వా- అహమః- అకార హకార రూప వర్ణద్వయస్య యోఽర్థః- "అకార స్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః। హకారో న్త్యః కలారూపో విమర్శాఖ్యః ప్రకీర్తిత" ఇత్యాది రీత్యా ప్రతిపాది తః యః ప్రకాశవిమర్శోభయరూపః పదార్థః-తత్పరః- తద్భా వనాసక్తః। లోకం- శివశక్తి స్వరూపం- ప్రపంచం। ఆవస్తుం- భావయితు మిత్యర్థః। ఉత్సహే- అనుసందధే। శబ్దార్థోభయ రూపం సకలమపి లోకం శివశక్తిరూపతయా భావయామీ త్యర్థః। నా- నృశబ్దస్య ప్రథమాంతం రూపం- మనుష్యస్స

న్నిత్యర్థః । అతః- మాం కేవలం- ముఖ్యం ధర్మం ఆస్థితం- ఋషిభిస్తుల్యం విద్ధి-ఋషయో హ్యేవమేవ భావయంత స్స్వధర్మం పాలయంతీత్యర్థః । వస్తుతస్తు అహమః అర్థః- సమభాగరూపా పరా-నా-మనుష్యస్సన్ లోకమావస్తు మధ్యాసితు ముత్సహే- పరాస్వరూపోఽహం మనుష్యతయా లోకే ఽవతీర్య చరా మీత్యర్థః । అతః- ఋషిభిస్తుల్యం యథా తథా మాం విద్ధి- జానీహి-ఆర్షదృష్ట్యా పశ్యేత్యర్థః । కేవలం- ముఖ్యం- ధర్మం- శిష్టపాలన దుష్టనిగ్రహరూపం । ఆస్థితం- ప్రాప్తం । అతో మమ వనవాస స్తపస్సాయభూతో దైవవశా త్పితృశాస్యతయా సిద్ధః- ఋషిభి రగస్త్యాదిభి రాకాంక్ష్యతే చేతి భావః । అత్ర యద్వక్తవ్యం తద్వివృత మధస్తా ద్బాలకాండే । అర్థపరో దేవి- ఇత్యత్ర- అర్థపరా- ఉ- ఇతిచ్ఛేదః- సంబోధన ద్యోతనం చ- ఆత్మాన మన్యథా మన్యమానాయా స్తస్యాస్స్వరూపబోధ నాభిముఖీకరణార్థ మిత్యాశయః । అత్రావ్యవహితోక్తార్థద్వయ మపి- "అహం బ్రహ్మాస్మీ"తి వాక్యఘటకస్యాహమః అనుకరణ తాత్పర్య మూలకం తాంత్రికనయే తద్రీత్యైవానుసంధానాం గీకారాదితి జ్ఞేయం॥

(టిప్పణీ) అత్ర అర్థశబ్దస్య ధనప్రయోజనాభిధేయపర తయా యద్వేత్యాది వికల్పభేదేన త్రైవిధ్యం । వస్తుత స్త్వితి గ్రంథేన సమభాగపరతయా చ వ్యాఖ్యానం చ కల్పవల్లికా యాం దృశ్యతే । తత్ర ఆద్యవికల్పత్రయేఽర్థసబ్దస్య ద్వితీయ వర్ణఘటితతయా ఉదితైవ కల్పవల్లీ । సమవాచకత్వపక్షే తు

చతుర్థవర్ణ ఘటితతయా ఏకస్యార్థశబ్దస్య చతుర్థావివరణం న సమ్యగితి విదుషా మాక్షేపః ప్రసక్తీతి కేచిత్। "వబయోర్లడయోర్లళయోశ్శషయోః ఖథయోశ్చ వ్యక్తిభేదేఽపి క్వచిత్క్వచిదర్థసామ్య మనుమేనిరే కవయ ఇతి సమాధిః । చతుర్థవర్ణ ఘటితపాఠ ఏవ సాధీయానిత్యభిమానేన వస్తుతస్త్వితి గ్రంథస్యాశయ ఇతి వా కల్పవల్లికాయాం మూహ్య మితి న దోషః॥

తా॥ లోకమునందు తరుచుగ రాజులు అర్థము (ధనము) నే ప్రధానముగ జేసికొని ధర్మము నప్రధానముగ సేవింతురు. నే నట్టివాడను కానని తెలుపుచున్నాడు. "నాహ దేవి నాహమర్థపరః" ఓ దేవీ! నేను కేవల మర్థప్రధానుడను గాను. ఆ అర్థమును గూడ లోకముకొఱకే ఉపయోగించెదను. స్వార్థముకొఱకు గాదనుటకు "లోకమావస్తు ముత్సహే" యనినాడు. లోకమును రంజింపజేయుటకు అర్థమును వినియోగించుచుందునని యర్థము. అప్రధానముగనైనను అర్థమావశ్యకము గాన రాజ్యమును వీడుట శక్యము గాదందురేమో? "విద్ధి" నా యభిప్రాయమును దెలిసికొనుట నీకు ప్రయత్నవిశేషముచే గాని సాధ్యము గాదని భావము. జన్మవలన లభించిన ప్రవర్తన ననుసరించి యీరీతిగ జెప్పబడినది. వాస్తవమున కదియు నాకు లేదనియే తెలుపుటకై "ఋషిభిస్తుల్య" మనినాడు. సర్వవిధములచేతను ధర్మమందే నాబుద్ధి నెలకొని యున్నది. కాని ధనమందు లేనే లేదని యర్థము.

లేదా, లోకపాలన మర్థమూలకము గాన, లోకపాల నాంశచే నైన యర్థపరత్వము. భోగముకొఱకు గాదనుటకు "అర్థపరః లోకమావస్తుమ్" అనునది.

సామాన్యమయిన క్షత్రియుడ నను బుద్ధిచే నన్ను వనవాసమునకై తొందరపెట్టుచున్నావు. కాని యథార్థము నెఱుగ నైతి వని తెలుపుటకు "విద్ధి" యనునది. సామాన్యజ్ఞానము ప్రయత్నము లేకున్నను, అందరకు సులభముగ లభించును. విశేషజ్ఞానము ప్రయత్నసాధ్య మని భావము. కావున నీప్రేరణ నాకు సంబంధించినదియే గాన నా కభీప్సితమైన వనగమనమున నాకు స్వతస్సిద్ధమయిన ప్రవృత్తియే గలదని భావము.

మఱియు, 'అహమః అర్థః' అహంకారరూపమయిన వృత్తి. అదియు నేను నాది యను జ్ఞానములో విషయముగాన, 'తత్పరః' దాని కధీనుడనై "లోకమావస్తుం" లోకమును పాలించుటకు 'నోత్సహే' ఇచ్ఛగింపను. కేవలము నట్టి యధ్యాసచే తిరస్కరింపబడిన వాడనై "ధర్మం" లోకము ననుసరించుట యనెడి ధర్మమును 'ఆస్థితః' పూనినవాడనై, "ఉత్సహే" ఆ యా కార్యములయం దుత్సాహముగలవాడ నగుచున్నాడను. ఆవిషయమున దృష్టాంతమునకై 'ఋషిభిస్తుల్యం' అనినాడు. జ్ఞానులు రాగద్వేషాదులు లేకున్నను ఇతరులయందు దయ పఱుట, శాప మొసగుట, మున్నగు వానిని లోకపాలనకొఱకెట్లు చేయుదురో నేనుకూడ నట్లే చేయుదును.

లేదా, "అహమర్థః" అకార హకార రూపమైన వర్ణ ద్వయమునకు యేది యర్థమో, అనగా "సమస్త వర్ణములకు ప్రథమమయిన అకారము ప్రకాశరూపమయిన పరమశివస్వ రూపము. అన్త్యమయిన హకారము కళారూపమయిన విమర్శ స్వరూపమని చెప్పబడినది" మున్నగు రీతిచే ప్రతిపాదితమై యే ప్రకాశవిమర్శోభయ రూపమయిన పదార్థము గలదో "తత్పరః" ఆ పదార్థ భావనాసక్తుడను. 'లోకం' శివశక్తిస్వ రూపమయిన ప్రపంచమును, "ఆవస్తుం' భావన చేయుటకొఱకు "ఉత్సహే" అనుసంధానము చేయుచున్నాను. అనగా శబ్దార్థో భయస్వరూపమయిన సమస్తలోకమును శివశక్తిస్వరూప మునగా భావించుచున్నానని యర్థము. 'నా' యనునది 'నృ' యను శబ్దమునకు ప్రథమాంతరూపము. మనుష్యుడ నగుచు యని అర్థము. కావున నన్ను ముఖ్యధర్మమును స్వీకరించిన ఋషితుల్యునిగా నెఱుగుము. ఋషులు నిట్లే భావన చేయుచు తమ ధర్మమును పాలించుచున్నారని యర్థము.

వాస్తవముగ 'అహమః' 'అహం' పదార్థముయొక్క 'అహమః + అర్థః' సమభాగ రూపమయిన పరాస్వరూపము, "నా" మనుష్యుడగుచు, "లోకమావస్తుం" లోకమును అధ్యా సించుటకొఱకు. "ఉత్సహే" ఉత్సహించుచున్నాను. అనగా పరాస్వరూపమయిన నేను మనుష్యుడనై లోకమం దవతరించి సంచరించుచున్నానని యర్థము. "అతః ఋషిభిస్తుల్యాం మాం విద్ధి" కావున ఋషులతో సమముగా నన్నెఱుంగుము. ఋషిదృష్టితో

జూడుమని యర్థము. "కేవలం" ముఖ్యమయిన, "ధర్మం" శిష్టులను పాలించుట, దుష్టులను నిగ్రహించుట రూపమయిన ధర్మమును, 'ఆస్థితం' పొందినవానినిగా ఎరుగుము. కావున నాకు వనవాసము ఆ ధర్మమున కుపాయభూతమై దైవవశమున పితృశాసనముగా సిద్ధించినది. అగస్త్యాదిఋషుల చేతను నిదియే కోరబడుచున్నదని భావము. ఇచ్చట చెప్పవలసిన విషయమంతయు బాలకాండలో వివరింపబడినది.

"అర్థపరో" యనుచోట "అర్థపరా + ఉ' అని పదముల విభాగము. 'ఉ' అనునది సంబోధనార్థద్యోతకము. ఇచ్చట సంబోధనార్థ మనగా తన్నన్యథా భావించుచున్న యామెకు తన స్వరూపమును దెలుపుట కభిముఖముగా నొనరించుకొనుట యని భావము. ఇచ్చట కడపట జెప్పిన రెండర్థములు "అహం బ్రహ్మాస్మి" (నేను పరబ్రహ్మస్వరూపుడను) అను వాక్యమందలి అహం పదార్థానుకరణము నాధారముగా జేసికొని చెప్పబడినది. తాంత్రికసిద్ధాంతమున నట్లే ఐక్యానుసంధాన మంగీకరింపబడుటచే నని తెలియదగినది.

స 19. శ్లో॥ 24. న నూనం మయి కైకేయి కించి దాశంససే గుణం। య ద్రాజాన మవోచ స్త్వం మమేశ్వరతరా సతీ॥

వ్యా॥ మయి గుణం నాశంససే- నకాంక్షసే మాం గుణవంతం నాకరోషీతి యావత్ । యత్ - యస్మా త్కారణాత్ - ఈశ్వరతరా సతీ- సర్వా అపి మమ మాతరః మయీశ్వరా ఏవ- త్వ మేవం కుర్వితి నియోక్తుం పర్యాప్తా ఏవ- తాసాం

సర్వాసామపి మధ్యేత్వ మధికా- మత్పితుః ప్రియతమత్వాత్- "స్థేశభాసపిసకసోవరచ్" ఇతి వరచి తతష్టాపి ఘ రూపేతి ప్రాప్తే నిష్పన్న మిదం రూపం- మాం నియోక్తు మతిశయేన సమర్థాపి రాజాన మవోచః- రాజద్వారాన్యయోజయః యదిత్వమేవ నియోజ్య త్వద్వచనకారితయా మాం గుణవంతం ప్రకటయసి-తన్మేఽనుకూలం స్యాత్। తదభావ ఏవ కేవలం న-కింతు- మాతృవచనాకారితయా రాజ్ఞా నియుక్తః- అన్యథా కిమితి సాక్షాత్స్వయమేవ కైకేయీ నానుశాస్తీ త్యాదినా ప్రవాదేన మాతృశాసనాతిక్రామిత్వ ప్రకటనేన దోష మేవ మయి ప్రథయసీత్యర్థః। కించిది త్యవ్యయం। యద్వా- మయి అగుణం-దోషం- అధర్మ ఇత్యాదా వివ విరోధార్థకోఽత్ర నఞ్- నాశంససే- నాంగీకరోషి- దోషగంధమపి న సహస ఇత్యర్థః। యత్ రాజాన మవోచః- రాజా హి సామ్రాజ్యే మాం నియుంక్తే- తథా ప్రవర్తమానే మయి కోనామగుణః- సర్వోపి సుఖాభిలాషీ సన్ పితృవాక్య మనురుంధే- నతు దుఃఖే నియుక్తః- యద్యంగీకుర్యాత్ సుత స్తదా పూర్వాదివద్గుణవత్త్వేన కీర్త్యేత- అత స్తాదృశం మాం కర్తుం రాజద్వారాన్యథా నియోజితవత్యసి- యద్యసీదృశసంకల్పా త్త్వర్హి సర్వాత్మనా మాం సర్వస్మిన్నపి, కార్యే నియోక్తు మీశ్వరతరాపి త్వం కిమితి తథా నాకరోః। సతాం సంకల్పే ఖలు ప్రతిష్ఠేతి భావః। కించ నను కైకేయి- మయి- ఊనం- అపకృష్టం। గుణం ఆశంససే- ఆలోచయసి। గుణస్యాపకృష్టత్వం నామ అపతాఽలేశ్యపరత్వా

జ్యత్వ ముత్కృష్టత్వం- తద్రాహిత్యం- అనాపదిగ్రాహ్యత్వం-
ఆపదిత్యాజ్యత్వ మితి యావత్ । యత్- యతఃకారణా దీశ్వ
రతరా సతీ మమేశ్వరం రాజాన మప్యాత్మీయ మనోరథవిషయే
నియోజయంతీ సతీ ఉద్బంధన మరణాద్యనిష్టకార్యాన్మఖ్యేన
స్వాశయాభిముఖం కుర్వతీ సతీ యద్యప్యయం మాతృవా
క్యానువర్త్యేవ పరం తు కష్టతమే వనవాసే తు న మదీయాజ్ఞాను
బంధీ । అత స్త్వమేనం చోదయేతి రాజాన మవోచః- రాజా
జ్ఞయా అనిష్టేష్వపి ప్రవృత్తే రసమంజసాదా దృష్టత్వాదితి
భావః । న కేవలం మమ వనవాస స్త్వదభీష్టః । కింతు- మదర్థ
ముపకల్పితేన సకలసంభారేణ భరత పట్టాభిషేక సముచ్చితః-
తాదృశకార్యా నాచరణే పూర్వతనాత్మీయ పట్టాభిషేక కథా
ప్రసంగే భరతాహ్వానవృత్తాంతాప్రసక్త్యా మహానుమోదా
భావ స్త్వయాలోచిత ఇత్యాకూతం । అత ఏవ కించి దూనమితి
గుణవిశేషణం- కైకేయీతి చ సంబుద్ధిః॥

తా॥ "మం యి గుణం నాశంససే" నన్ను గుణవంతునిగా
జేయవైతివి. "యత్" ఏకారణమున, 'ఈశ్వరతరా సతీ' ఉత్తమ
మయిన ప్రభ్వివగుచు; తల్లులందరు నావిషయమున ప్రభ్వాలే.
అనగా నీ వీరీతిగ జేయుమని నియోగించుటకు సమర్థులే. వా
రందరిలో నా తండ్రికి మిక్కిలి ప్రియురాలవు గాన నీవు గొప్ప
దానవని భావము. "ఈశ" అను ధాతువుకంటె "స్థేశభాసపిసక
సోవరచ్" అను సూత్రముచే 'వరచ్' అను ప్రత్యయము చేసి,
దానికంటె "టాప్" అను స్త్రీప్రత్యము చేర్చి, దానికి 'ఘరూప

...' సూత్రముచే హ్రస్వము చేయగా "ఈశ్వరతరా" యను రూపము సిద్ధించును. నన్నాజ్ఞాపించుటకు మిక్కిలి సమర్థురాల వయ్యు "రాజాన మవోచః" రాజుద్వారా నియోగించితివో, నీవే యాజ్ఞాపించి నీ వాక్యమును చేసినవాడ నగుటచే నన్ను గుణవంతునిగా బ్రకటించినచో నది నా కనుకూలముగ నుండెడిది. అట్టిది లేకపోవుట మాత్రమే గాదు. తల్లి వాక్యమును జేయనివాడ నగుటచే దశరథునిచే నియోగింపబడితిని. "లేకున్నచో కైకేయి స్వయముగనే యేల శాసింపదు" అను ప్రవాదచే తల్లి యాజ్ఞను మీరువాడీతడని ప్రకటించుటచే, నాయందు దోషమునే వెల్లడి చేయుచున్నావు. "కించిత్" అనునది అవ్యయము.

లేదా, "మయి అగుణం" నా విషయమున దోషమును. "అగుణం" అను పదము 'అధర్మః' మున్నగు పదములందువలె విరోధార్థకమయిన నఞ్ ప్రత్యయముతో గూడినది. "నాశంససే" అంగీకరింపనిచో; దోషగంధమునైన సహింపనిచో నని యర్థము. "యత్ రాజాన మవోచః" రాజునుగూర్చి ఏది పలికితివో. రాజు నన్ను సామ్రాజ్యమున నియోగించుచున్నాడు. అట్లు ప్రవర్తించినచో నాయం దేమి గుణ ముండును. ప్రతి మనుజుడును సుఖాభిలాషియై పితృవాక్యము ననుసరించును. కాని దుఃఖమున నియోగింపబడినచో పితృవాక్యము ననుసరింపడు. పుత్రు డట్లంగీకరించినచో అప్పుడు పూరువు (చక్రవర్తి) మొదలగువారివలె గుణవంతుడుగ కీర్తింపబడును. కావున

నన్నట్టివానినిగ జేయుటకు రాజుద్వారా చేశోకకీతిని నియోగించితివి. ఇట్టి సంకల్పము లేకున్నచో సర్వవిధముల నన్ను సర్వకార్యములయందు నియోగించుటకు సమర్థురాలవై యుండియు నీ వట్లేల చేయవైతివి. సత్పురుషులకు సంకటము నందే ప్రతిష్ఠ గల్గునని భావము.

"నను కైకేయి" ఓ కైకేయీ ? "మయి ఊనం గుణం ఆశంససే" నాయందపకృష్టగుణము నాలోచించుచున్నావు. గుణముల యపకర్ష యనగా, ఆపత్కాలమునందును విడిచి పెట్టబడకుండుట ఉత్కృష్టత. అట్టిది లేకుండుట యపకర్ష. ఆపత్తు లేనప్పుడు గ్రహింపదగుట, ఆపత్తునందు విడవదగుట యని భావము.

"యత్" ఏకారణమువలన "ఈశ్వరతరాసతీ" నాకు ప్రభువగు రాజును నీ మనోరథవిషయమున నియమించుచు, కట్టిపెట్టుట, మరణము, మున్నగు అనిష్టకార్యముల కనుకూలముగ నీయభిప్రాయమున కుమ్ముఖునిగ జేయుచు "రాజాన మవోచః" ఈ రాముడు మాతృవాక్యము ననుసరించువాడే, కాని మిక్కిలి కష్టమగు వనవాసమున నా యాజ్ఞ ననుసరింపడు. కనుక నీవే యీతని నియోగించుమని రాజునుగూర్చి పలికితివో. రాజాజ్ఞ చే ఇష్టముకాని పనులయందు సమంజసము కానివానియందు ప్రవర్తించుట మన మెరిగినదే యని భావము. కేవలము నేను వనమున కేగుటయే నీ యభీష్టము గాదు. మఱియు నాకొఱకు కల్పిపబడిన సమస్తసంభారములచే భరతుని

పట్టాభిషేకమును కూడియున్నది. అట్టికార్యము జరుగనిచో, పూర్వము నిర్ణయింపబడిన నా పట్టాభిషేకకథల ప్రసంగమున భరతుని పిలుచుట యనెడు వృత్తాంతమునకు ప్రసక్తి లేకుండుటచే నాకు సంతోషము లేకుండుట నీచే నాలోచింపబడినదని గర్భితాభిప్రాయము. కావున "కించిదూనం" అను గుణ విశేషణమును, "కైకేయి" అను సంబోధనయును కూర్పబడినవి.

స 19. శ్లో॥ 32. నచాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశోఽప
కర్షతి। లోకకాంతస్య కాంతత్వాచ్ఛీతరశ్మేరివ క్షపా॥
వ్యా॥ అస్య రామస్య। రాజ్యలక్ష్మీభంగః। మహతీం
అనన్యసాధ్యతయా ఇతరదుర్లభాం లక్ష్మీం- పరోపకృతిప్రావణ్యరూప సత్స్వభావ ప్రయుక్తాం శోభాం। నాపకర్షతి-నలోపయతి "సా లక్ష్మీ రుపకురుతే యయా పరేషా" మితి న్యాయేన సర్వకామనావిషయ రాజ్యలక్ష్మ్యాః తృణప్రాయేణ కైకేయీవశీకరణా ల్లోకోత్తరై వాస్య లక్ష్మీరితి భావః। తత్ర హేతుః। లోకకాంతస్యేతి- రాజ్యస్య కైకేయీ సమర్పణాభావే తస్యా అనిష్టమేవ స్యాత్- ఇదానీంతు అతులకీర్తికారణీభూతస్య తత్పరిత్యాగస్య సర్వలోకాధిపత్య రూపతయా సర్వప్రియత్వమితి భావః। శీతరశ్మేరివ క్షపా- ఇత్యుపమాన నిర్దేశేన ప్రత్యుత రాజ్యలక్ష్మీత్యాగస్యైవాస్య మహాశోభావహత్వ మితి సిద్ధం తస్య దివాతనత్వే కాంతేరేవ హైన్యాత్। విషయపరిత్యాగస్య తద్గ్రహణజన్యసుఖాపేక్ష యోత్కృష్ట సుఖావహ

త్వమితి న తద్భంగోఽస్యాపకర్షాయ- కింతు- మహత్తరగుణా యైవేతి భావః । దయాఘనానాం ప్రవృత్తిః కష్టాయై వేతి ధ్వనిః- అత ఏవ- శీతరశ్మే రితి క్షపేతి చ పదన్యాసః-క్షపయతి లోకప్రవృత్తీరితి క్షపా।

తా। "అస్యరామస్య" ఈరామునకు "రాజ్యనాశః" రాజ్యలక్ష్మియొక్క భంగము, "మహతీం లక్ష్మీం" అనన్యసాధ్యమై యితరులచే దుర్లభమయిన. "లక్ష్మీం" అనగా పరుల కుపకార ప్రవణరూపమయిన సత్స్వభావముతో కూడిన శోభను, "నాప కర్షతి" లోపింపజేయదు. "దేనిచే పరుల కుపకారము చేయ బడునో యదియే లక్ష్మి" అను న్యాయముచే సమస్తకోరికలకు సాధనమైన రాజ్యలక్ష్మిని తృణప్రాయముగ కైకేయికి స్వాధీనము చేయుటచే నీతని లక్ష్మి లోకోత్తర మైనదని భావము. రాజ్యమును కైకేయి కర్పింపనిచో నామె కనిష్టమే కల్గును. ఇప్పుడు గొప్పదగు కీర్తికి కారణభూతమగు ఆరాజ్యమును వద లుట, సర్వలోకముల యాధిపత్యరూపము గాన, అందరకు ప్రియ మైనదియే యని భావము. "శీతరశ్మే రివ క్షపా" చంద్రునకు రాత్రివలె. ఇచ్చట "రాత్రివలె" అను ఉపమానదిర్దేశముచే రాజ్యలక్ష్మిని వదలుటయే యీతనికి మహాశోభావహమని సిద్ధించినది. ఆ చంద్రునికి పగటియందైతే కాంతియే క్షీణించును. విషయములను గ్రహించుటవల్ల గలిగెడి సుఖముకంటె వదలిననే గొప్పదగు సుఖము గలుగును గాన, విషయములు తొలగుట అపకర్షావహము గాదు. మహత్తరమైన గుణమును

సూచ్చునదియే యగును. దయాధీనముల యొక్క ప్రవృత్తి కష్టమునకే యగు నని ధ్వనించుచున్నది. కనుకనే "శీతరశ్మేః" 'క్షుపా' యను పదముల నుపయోగించినారు. 'క్షుపా' యనగా లోకప్రవృత్తులను నశింపజేయునదని భావము.

స 20. శ్లో॥ 36. యది పుత్ర న జాయేథా మమ శోకాయ రాఘవ।
న స్మ దుఃఖ మతో భూయః పశ్యేయ మహ మప్రజాః॥

వ్యా॥ ఇతః పూర్వజన్మని త్వాదృశ పుత్రలాభజన్య సంతోషాయ యద్యప్యహ మతపస్య మితి మన్యే- తత ఏవ త్వం జాతః- పరంతు- శోకాయైవ నాభూ త్త్వదుత్పత్తిః। అంతః పున స్త్వం మమ మాపుత్రో భూః- ఏతాదృశ ప్రయాసాపేక్షా యా ఽప్రజాత్వమేవ వర మిత్యాశయః। యద్వా- పుత్ర మమ జాయేథా యది శోకాయ న- స్యా ఇతి శేషః। మనుష్యాంత రవ జ్జన్మనా పుత్రభూయ వియుజ్యేథా స్తదా లోకసాధార ణ్యేన మమ శోక ఏవ నస్యాత్- త్వంతు న తాదృశ ఇతి మే శోక ఇతి భావః। అతః కారణా దప్రజాత్వమేవ కామయ మానా భూయః పునరపి దుఃఖం న పశ్యేయం- ప్రజావిశ్లేష జన్యదుఃఖానుభవయోగ్యతారహితా భవా మీత్యర్థః। అత్యంత తపఃక్లేశాదినా త్వాం ప్రసూ యైవంవిధదశాపన్నా హం ప్రజాభావ ఏవ శ్రేష్ఠ ఇతి బుద్ధ్యా తథా త్వమేవానుభ వంతీ పున ర్జన్మాంతరే దుఃఖ మేతాదృశం ద్రష్టుం నైవ యోగ్యా భవామీత్యర్థః।

తా॥ ఇంతకు ముందు జన్మమున నీవంటి పుత్రలాభము వలన గలిగెడి సంతోషమునకై నేను తపస్సు చేసితి నని తల చెదను. కావుననే నీవు జన్మించితివి. కాని నీ పుట్టుక శోకము నకే యయినది. కావున నీవు తిరిగి నా పుత్రుడవు గాకుము. ఇట్టి ప్రయాసకంటె సంతానము లేకుండుటయే మేలని భావము.

లేదా, "పుత్రమమ జాయేథాః యది శోకాయనస్యాః" ఇతర మనుష్యునివలె జన్మచే పుత్రుడవై వియోగము నొంది నచో నప్పుడు లోకసామాన్యముగ నాకు శోకమే యుండకుం డెడిని. నీ వట్టివాడవు కాకపోవుటచే నాకు దుఃఖము కలుగు చున్నదని భావము. 'అతః' ఈ కారణమువలన, 'అప్రజాః' సంతానము లేకుండుటను కోరుచున్నదాననై "భూయః దుఃఖం నపశ్యేయం" తిరిగి సంతానవియోగముచే గలిగెడి దుఃఖము ననుభవించుటకు యోగ్యత లేనిదాననై కాగలను. గొప్పదగు తపస్సులను జేసి కష్టముల ననుభవించుటచే నిన్ను కని ఇట్టి యవస్థను బొందిన నేను సంతానము లేకుండుటయే మంచిదను బుద్ధిచే, అట్టి స్థితినే యనుభవించుచు తిరిగి జన్మాంతరమున నిట్టి దుఃఖమును జూచుటకు యోగ్యరాలను కానని యర్థము.

స 20. శ్లో॥ 38 న దృష్టపూర్వం కల్యాణం సుఖం వా పతి
పౌరుషే। అపి పుత్రేఽపి పశ్యేయ మితి రామాస్థితం మయా॥

వ్యా॥ పతి పౌరుషే- పత్యుః పౌరుషం- పురుషభావః- తస్మిన్ సతి- యత్కల్యాణం పట్టమహిషీత్వప్రయుక్తం రాజ్య లక్ష్మీలక్షణం మంగళం సుఖంవా- తదాదరప్రయుక్తం వా న

దృష్టపూర్వం- పూర్వంనదృష్టం- పుత్రే త్వయి తదుభయం భవతీతి సంభావనయా ఆస్థితం- జీవనం ధృతమిత్యర్థః । అన్యథా భర్తు రనిష్టేన సౌభాగ్యేన కిమితీతః పూర్వమేవ జీవనం త్యజేయమితి భావః॥

తా॥ "పతిపౌరుషే" భర్తను పురుషకారము గలిగియుండ "యత్కల్యాణాం" పట్టపురాణి నగుటచే గలిగెడి రాజ్యలక్ష్మీరూప మయిన మంగళముతో కూడిన సుఖముగాని భర్తయొక్క యాదరము గాని, "న దృష్టపూర్వం" పూర్వముందు చూడబడలేదు. 'పుత్రేఽపి' నీవు పుత్రుడ వగుచుండగా "పశ్యేయమితి మయా ఆస్థితం" ఆ రెంటిని జూడవచ్చునని నేనుంటిని. లేకున్న భర్త కిష్టములేని సౌభాగ్యముచే ప్రయోజన మేమని యింతకుముందే జీవితమును విడిచి యుండెడిదాన నని భావము.

స 20. శ్లో॥ 42. అత్యంతం నిగృహీతాస్మి భర్తు ర్నిత్య మతంత్రితా। పరివారేణ కైకేయ్యా స్సమా వా ప్యథవాఽవరా॥

వ్యా॥ కైకేయ్యాః పరివారేణ- నిత్యం- సర్వకాలం- నిగృహీతా భర్తృసంభాషణాది విషయేఽపి నిర్బంధం ప్రాపితా సతీ భర్తురతంత్రితా । తంత్ర ముపకార స్స నవిద్యతే యస్యాస్సా అతంత్రా- తతః "తారకాదిత్వాదితచ్" తదధీనోపకారశూన్యాస్మి "తంత్రం సహాయే ముఖ్యే చ న్యాయాగమ విచారణే" ఇతి వైజయంతీ॥ సంభాషణాదావపి భర్తృసంబంధశూన్యతయా కైకేయీ స్వపరివారద్వారా మాం నిరబధ్నాదిత్యర్థః। ఇదం సర్వం కైకేయ్యా స్స్వవిషయక భర్తృవాల్లభ్య మూల

కమితిభావః । అతోఽహ మితర రాజదారైః సమావా అవరా-న్యూనా వా- త్వమేవాలోచయేతి భావః॥

తా॥ "కైకేయ్యాః పరివారేణ" కైకేయియొక్క పరివారముచే "నిత్యం" సర్వకాలములయందును, "నిగృహీతా" భర్తతో మాటలాడుట మున్నగువాని విషయమున నిర్బంధమును పొందింపబడినదాననై "భర్తురతంత్రితా" భర్తవలన గలుగు ఉపకారము లేనిదాననై. తంత్రమనగా ఉపకారము. అది లేనిదాననై అని "అతంత్రితా" యనుదాని కర్థము. తంత్ర శబ్దమునకు సహాయము, ముఖ్యము, న్యాయము, శాస్త్రము, విచారము నర్థములని వైజయంతియందు చెప్పబడినది. సంభాషణ మున్నగువానియందును కైకేయి తన పరివారముద్వారా నన్ను నిర్బంధించినది. ఇదంతయు కైకేయికి గల భర్తృవాల్లభ్యమూలకమని భావము. దీనిచే నేను "సమావా" రాజభార్యలతో సమానమైనదాననా? 'అవరా' తక్కువదాననా? నీవే ఆలోచింపుమని భావము.

స 21. శ్లో॥ 5. న తం పశ్యామ్యహం లోకే పరోక్షమపి యో నరః।స్వమిత్రోఽపి నిరస్తోఽపి యోఽస్య దోష ముదాహరేత్ ॥

వ్యా॥ నరః- వివేకాదిశూన్యోఽపి-ప్రాకృతోఽపీత్యర్థః-యత్ర కుత్రా ప్యన్యత్ర స్వతుల్యేనాన్యేన వా రామకథాప్రసంగే దోషం ప్రమాదాదిప్రయుక్త మపి దుర్వృత్తం య ఉదాహరేత్ - వదేత్ - తం నరం న పశ్యామి- చారద్వారేతి శేషః। రాజ్ఞో వా రాజపుత్రస్య వా దోషే స తితదుద్ఘాటనేఽన్యేన

ప్రసంగేన కింవా రాజదండనం స్యాదిత్యాలోచనశూన్యః సాధారణోఽపి జనః అన్యదోషం వదం శ్చారద్వారా పరిశీలితోఽపి కశ్చి న్మయా న దృష్ట ఇత్యర్థః। కించ-స్వమిత్రోఽపి-ఆత్మమిత్ర మపి-పుం స్త్వ మార్షం- అస్య దోషముదాహరేత్-నైవం వర్తితవ్యం త్వయా-కిం త్వనేన ప్రకారేణేతి హితోపదేశపరతయా య ఉదాహరేత్। తం చ న పశ్యామి-దోష నివర్తన పూర్వక హితబోధనస్యాపి మిత్రలక్షణత్వాదితి భావః। అత ఏవ యుద్ధకాండే సుగ్రీవం ప్రతి "మద్విధా వా పితుః పుత్రా స్సుహృదో వా భవద్విధా" ఇతి తస్య మిత్రలక్షణ ప్రకటన పరం శ్రీరామస్య వచనం। నిర స్తం - ప్రబలాపరాధవశే నాస్థానా దితఃపూర్వ మేవ అస్మ త్పిత్రాదిభి ర్బహిష్కృతః యః అస్య దోష ముదాహరేత్ - తమపి న పశ్యామి- రామాదన్యస్య స్మత్పిత్రాదే ర్దోష ముదాహరతు నామ- అస్య తు తద భావా దుదాహర్తు మవకాశ ఏవ నాస్తీతి భావః॥

తా॥ 'నరః' వివేకము లేని సామాన్యజనుడును 'అస్య దోషముదాహరేత్' ఎచ్చటను గాని, తనతో సమానుడైన వానితో గాని, ఇతరునితో గాని, రాముని కథాప్రసంగము వచ్చినపుడు ప్రమాదాదికముతో గూడిన చెడునడతను దెలుపునో "తం నరం నపశ్యామి" చారునిముఖముననైన నట్టి మనుజుని చూడబోను. రాజుయొక్క గాని, రాజపుత్రునియొక్కగాని దోషమున్నపుడు దానిని యితరునితో వెలిబుచ్చుటయందు ఏప్రసంగముచే ఏది రాజదండన మగునను ఆలోచన లేని

సామాన్యజనులకును, ఈతని దోషమును తెలుపునట్టివాఁడు చారులద్వారా పరిశీలించినను ఒకఁడును నాకగపడలేదని యర్థము.

మఱియు 'స్వమిత్రోఽపి' ఆత్మమిత్రుఁడును, 'యః అస్య దోషముదాహరేత్' ఈలాగున ప్రవర్తింపవలదు. ఇటులనే ప్రవర్తింపవలెనని హితోపదేశరూపమున దెలుపునో "తంచ న పశ్యామి" అట్టివానిని చూడఁబోను. దోషమును తొలగించి హితవును బోధించుట మిత్రునకు లక్షణము. కావుననే యుద్ధ కాండమున సుగ్రీవునిగూర్చి "తండ్రికి పుత్రులు నావంటివారును, స్నేహితులు నీవంటివారును" అని తన మిత్రుల లక్షణముల ప్రకటించుటకై శ్రీరాముని వచనము తగియున్నది.

"నిరస్తః" ప్రబలమగు అపరాధవశమున ఆస్థానాధికమునుండి మునుగనే తండ్రిచే బహిష్కరింపబడిన 'యః' యెవఁడు "అస్యదోషముదాహరేత్" వీని దోషము నుద్ఘాటించునో "తమపి నపశ్యామి" వానినికూడ చూడఁబోను. రాముని కంటె నితరమైన నా తండ్రి మున్నగువారియొక్క దోషమును జనుఁడుదాహరించుఁ గాక. ఈతని కట్టి దోషములే లేవు గాన, దోషముల నుదాహరించుట కవకాశమే లేదని భావము.

స 21. శ్లో॥ 29. నాస్తి శక్తిః పితు ర్వాక్యం సమతిక్రమితుం మమ। ప్రసాదయే త్వాం శిరసా గంతు మిచ్ఛా మ్యహం వనం॥

వ్యా॥ పితు ర్వాక్యం- తచ్ఛాసనం । సమతిక్రమితుం- అన్యథాకర్తుం । శక్తిః- సామర్థ్యం నాస్తి । స్వేచ్ఛామా యథా

అతిజంఘాలేనాప్య నుల్లంఘ్యా తద్వ త్పాపభీరోర్మను పిత్రు వాక్యమితి భావః। శబ్దైకసమధిగమ్యే పుణ్యపాపరూపే అదృష్టే పురుషప్రవృత్తినివృత్త్యో స్తద్విశ్వాసైకమూలకత్వమితితత్త్వం। తర్హి మద్వాక్యం కిమితి నానుతిష్ఠ సీత్యతఆహ। ప్రసాదయ ఇతి- గంతు మిచ్ఛామీతి చ। అసాధ్యమపి పుత్రవాంఛితం మాతా పూరయితు మభిలష్యతీతి పిత్రపేక్షయా మాతృప్రసాదస్సులభ ఇతి భావః॥

తా॥ "పితుర్వాక్యం" తండ్రిగారి శాసనమును, "సమతి క్రమితుం" వేరొక రీతిని జేయుటకు, "శక్తిర్నాస్తి" సామర్థ్యము లేదు. ఎంత జంఘాబలము గలవానిచే నైన తన నీడ నెట్లు నతి క్రమింపబడుటకు శక్యము గానిదగునో, అట్లే పాపమువలన భయ పడు నాను పితృవాక్య మనుల్లంఘనీయమని భావము. శబ్ద మొక్కదానిచే తెలియదగినట్టియు పుణ్యరూపమయిన అదృష్ట మంను పురుషునియొక్క ప్రవర్తించుట, నివర్తించుట విశ్వాస మూలకములే యగునని తత్త్వము. అట్లయినచో నా వాక్యము నేల విశ్వసింప వందువేమో? పుత్రుని కోరిక అసాధ్యమయి నను తల్లి పూర్తిచేయుటకు అభిలషించును. కావున తండ్రి సౌమనస్యముకంటె తల్లి సౌమనస్యముసులభముగ లభించునని భావము.

స 21. శ్లో॥ 40. ధర్మోహి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠి తం। ధర్మసంశ్రిత మేతచ్చ పితుర్వచన ముత్తమం।

వ్యా॥ కామపరతంత్రతయా స్త్రీవశంవదస్య పితుర్వచనం నానువర్తనీయ మితి లక్ష్మణవాక్యం ఖండయతి॥ ధర్మోహీతి- ధర్మః- యథాదేశకాలం మనుష్యమాత్రేణానుష్ఠేయతయా విహిత స్సుకృతసాధనభూతః ప్రవృత్తివిశేషః లోకే విషయే పరమః- ఐహికాముష్మికోపయోగితయా ఉత్కృష్టః। హీతి- ప్రసిద్ధౌ। అత "సత్యం ధర్మే ప్రతిష్ఠితం" ప్రతిజ్ఞాతార్థనిర్వహణ ప్రవృత్తి రూపం సత్యం- ధర్మపదార్థైకదేశభూత మిత్యర్థః। హస్తి పదన్యాయయా దత్రైవ అంతర్భూత మితి యావత్ । అత ఏవ- ఏతత్ మదీయ వనవాసాద్యభ్యనుజ్ఞారూపం పితుర్వచనం చ ధర్మసంశ్రితం- సత్యరూపత్వేన పూర్వోక్తరీత్యా ధర్మత్వాక్రాంతం।అత ఉత్తమం-ధర్మత్వాత్ పితుర్వచనత్వాచ్చ। శ్రేయోవిశేషార్థినా మవశ్యానుష్ఠేయ మిత్యర్థః। ఏవం చ అస్మత్పితృవచనం ధర్మప్రధానమేవ- నతు కామతంత్రమితి భావః॥

తా॥ కామపరతంత్రుడగుటచే స్త్రీవశంవదుడైన తండ్రియొక్క వాక్యము ఆదరింపతగినది కాదని చెప్పుచు లక్ష్మణుని వాక్యమును ఖండించుచున్నాడు. "ధర్మః" దేశకాలానుసారముగ మనుష్యమాత్రునిచే అనుష్ఠింపదగినదిగా విహితమయినట్టియు, పుణ్యమునకు సాధనమైన ప్రవృత్తివిశేషము ధర్మము. "లోకే" లోకవిషయమున "పరమః" ఇహపరముల కుపయోగించునది గాన ఉత్కృష్టమైనది. 'హి' అనగా ప్రసిద్ధియని యర్థము. కావున "సత్యం ధర్మే ప్రతిష్ఠితం" ధర్మమందు సత్యము ప్రతిష్ఠితమైనది.

ప్రతిజ్ఞ చేయబడిన అర్థముయొక్క నిర్వహించుట రూపమయిన సత్యము, ధర్మపదార్థములలో నొకటని యర్థము. ఏనుగుపాదమం దితరపాదము లణగినట్లు ఈధర్మమందే సత్యమును అంతర్భూత మయినదని భావము.

కనుకనే "ఏతత్" వనవాసాదికమునకు అనుజ్ఞారూప మయిన 'పితుర్వచనంచ' తండ్రిగారి వాక్యమును, "ధర్మసం శ్రితం" సత్యస్వరూప మగుటచే వెనుక చెప్పిన రీతిని, ధర్మమని పించుకొనును. కనుకనే "ఉత్తమం" ధర్మమగుటవలనను, తండ్రి గారి వాక్యమగుటవలనను, శ్రేయోవిశేషమును గోరువారికి తప్పక అనుష్ఠింప దగిన దని యర్థము. దీనిచే మాతండ్రిగారి వాక్యము ధర్మప్రధాన మయినదియే గాని కామపరతంత్రమయి నది గాదని భావము.

స 21. శ్లో 56 ధర్మార్థకామాః ఖలు తాత లోకే ।
సమీక్షితా ధర్మఫలోదయేషు ।
తే తత్ర సర్వేస్స్యు రసంశయం మే ।
భార్యేవ వశ్యాభిమతా సుపుత్రా ॥

వ్యా॥ ధర్మఫలోదయేషు । ధర్మఫలం సుకృతం । తదు త్పన్నేషు అర్థకామేషు । ధర్మార్థకామాః సమీక్షితాః । శాస్త్ర కారైః కార్యకారణభావ సంబద్ధతయా వ్యవహృతాః । సుకృత తత్కార్యరూపత్వాత్ అన్యోన్యసంబద్ధా ఇత్యర్థః । తత్ర త్రిషు ప్రధాన కారణం స్ఫుటయతి। తే తత్ర సర్వేస్స్యు రితి। సర్వేఽపి ధర్మార్థకామాః । తత్ర- ధర్మే సత్యేవ- స్యుః- సంభవంతి ।

మే అసంశయం- సంశయాభావః । ఇతరేషాం త్వస్తు సంశయ ఇతి భావః । తత్ర- సహేతుకం దృష్టాంత మాహ । భార్యా- యథావ త్పాణిగృహీతీ। వశ్యా- యథోక్తకారిణీ । అభిమతా- రూపప్రియభాషణాదినా సుపుత్రా । గుణవత్పుత్రాచ యది యథా సర్వథా అర్థ కామ సాధనద్వారా లోకయో ర్ద్వయో రుపకారిణీ తథా ధర్మోఽపి యథావ దనుష్ఠిత శ్చే త్సర్వోప కారక ఇతి భావః॥

తా॥ "ధర్మఫలోదయేషు" ధర్మఫల మనగా పుణ్యము. దానివలన బుట్టిన అర్థకామములలో "ధర్మార్థకామాః సమీ క్షితాః" శాస్త్రకర్తలచే ధర్మార్థకామములు కార్యకారణభావ ముతో గూడినట్లుగా వ్యవహరింపబడినవి. పుణ్యము తత్ఫలరూ పము గాన పరస్పరము సంబద్ధములని యర్థము. ఆ మూడింటిలో ప్రధానకారణమును దెలుపుచున్నారు. "తే తత్రసర్వేస్స్యుః" ధర్మార్థకామము లన్నియు ధర్మమున్నపుడే సంభవించును. "మే అసంశయం" నాకు సంశయము లేదు. ఇతరులకు సంశయముండు గాక యని భావము. ఆవిషయమున హేతువుతో గూడిన దృష్టాంతమును దెలుపుచున్నారు. 'భార్యా' యథావిధిగా పాణిగ్రహణము చేయబడినట్టియు, 'వశ్యా' చెప్పినట్లు చేయు నదియు, "అభిమతా" రూపముచేతను ప్రియముగ మాటలా డుటచేతను అనురూపమయినట్టియు, 'సుపుత్రా' గుణవంతులగు పుత్రులతో గూడినట్టిదియు నగు స్త్రీ, ఏరీతిగ సర్వవిధముల చేతను అర్థకామములను సాధించుటకు సాధనభూతురాలై

రెండు లోకములను నుపకరించునని యనునో అటులనే ధర్మ మును యథావిధిగ ననుష్ఠింపబడినచో అందరకు నుపకారము కలుగజేయున దగునని భావము.

స 21. శ్లో 57. యస్మింస్తు సర్వేస్స్యు రసన్నివిష్టా ।
ధర్మో యతస్స్యా త్తదుపక్రమేత ।
ద్వేష్యో భవత్యర్థపరో హి లోకే ।
కామాత్మతా ఖల్వపి న ప్రశస్తా॥

వ్యా। నను ధర్మాభావేఽపి అర్థకామ సంపత్తిః తత్రతత్రోపలభ్యత ఏవేత్యత్రాహ। అసన్నివిష్టా- అనుకూల మేకత్ర అమిళితా స్స ర్వేప్యర్థాదయో యస్మి న్నాచరితేస్యుః సంభవేయుః। పృథక్ పృథక్ అన్యత్ర సంతో ప్యేకత్ర స్థలే సుమిళితా భవేయుః। కించ యతః ధర్మస్స్యాత్ - ప్రధానం స్యాత్ - తత్కర్మఉపక్రమేత। బుద్ధిమా నితి శేషః। నను తుల్యన్యాయే నార్థకామోభయపరత్వే అన్యతరపరత్వే వా కిం భిన్నమ్। "ధర్మార్థకామా స్సమమేవ సేవ్యాః యో హ్యేకసక్త స్సనరో జఘన్య" ఇతి న్యాయా దిత్యాశంక్యాహ। ద్వేష్యో భవతీతి- అర్థపరః- అర్థప్రధానః। ప్రాధాన్యేన అర్థ మప్రాధాన్యేన ధర్మం చ య స్సేవేత స ద్వేష్యః- సర్వస్యాప్రీతివిషయో భవతి। తస్మి సతి సమయే రాజ్ఞో మహదనిష్టం జనయేదితి భావః। కామాత్మతా- కామప్రాధాన్యం। అపి స్తుశబ్దార్థకః। న ప్రశస్తా- అర్థప్రధానత్వాపేక్షయా కామప్రాధాన్యం సుతరాం నిషిద్ధం। తస్య సర్వదా హ్యనిష్టావహత్వా దితి భావః।

తా॥ ధర్మము లేకున్నను అర్థకామముల సంపత్తి అచ్చటచ్చట గనబడుచున్న దందురేమో? 'అసన్నివిష్టా' అనుకూలముగ నొకచో గలియని "సర్వే" అర్థాదు లన్నియు "యస్మిం స్తు ఆచరితే స్యుః" ఏది యాచరించిన సంభవించునో, (వేర్వేరుగ నొక్కొకచో నున్నవి ఒకచోట మిళితము లగునో,) "యతః ధర్మః స్యాత్" ఏది చేయుటవలన ధర్మము ప్రధానమగునో, 'తముపక్రమేత' బుద్ధిమంతు డట్టికార్యము నారంభింపవలెను.

తుల్యన్యాయముచే అర్థకామములు రెండింటి నాచరించినను, ఏదియో యొకటి యాచరించినను పోయిన దేమున్నది? "ధర్మార్థకామములు సమముగనే సేవింపవలెను. ఒకదానినే సేవించువాడు నీచుడు" అను న్యాయము ఒకేదానిని సేవించుటను నిషేధించుచున్నది గదా, యందురేమో? "అర్థపరః ద్వేష్యః" ప్రధానముగా నర్థమును, అప్రధానముగా ధర్మమును ఎవడు సేవించునో 'సః ద్వేష్యః' అందరకు అనిష్టముననువిషయ భూతుడగును. అది సమయము వచ్చినపుడు రాజునకు గొప్ప అనర్థమును సమకూర్చునని భావము. "కామాత్మతాపి" కామప్రాధాన్యమన్ననో "నప్రశస్తా" అర్థము ప్రధానముగా గలుగుటకంటె కామము ప్రధానముగా గలుగుట సర్వవిధముల అనిష్టమును కలుగజేయునది గాన మిక్కిలి నిషిద్ధమని భావము.

స 21. శ్లో॥ 63. ప్రసాదయ న్నరవృషభ స్సమాతరం ।
పరాక్రమా జ్జిగమిషు రేవ దండకాన్ ।

అథానుజం భృశ మనుశాస్య దర్శనం ।
చకార తాం హృది జననీం ప్రదక్షిణం॥

వ్యా॥ నరవృషభః- నరశ్రేష్ఠ స్స రామః । మాతరం ప్రసాదయన్- ప్రార్థనయా స్వాభిమతానుకూలాం కుర్వన్ । పరాక్రమా దితి- "ల్యబ్లోపే పంచమీ" పరాక్రమ మాశ్రిత్య దండకాన్ జిగమిషుః । అథ అనుజం- దర్శనం- శాస్త్రం । అనుశాస్య- స్వాభ్యస్త రాజనీతిశాస్త్రానుసారేణ- వివదమానం లక్ష్మణం శాస్త్రసిద్ధాంతబోధనేన సంశిక్ష్య । జననీం హృది ప్రదక్షిణం చకార- కిముక్తోక్తి ప్రత్యుక్తికయా మనోనిగ్రహ ఏవ సర్వార్థసాధక ఇతి మాతృప్రదక్షిణక్రియారూపం వ్రతం మనసి సమకల్పయ దిత్యర్థః॥

తా॥ 'నరవృషభఃసః' మనుజశ్రేష్ఠుడయిన రాముడు "మాతరం" తల్లిని "ప్రసాదయన్" ప్రార్థనచే తన యభిమతమున కనుకూలముగ జేయుచు "పరాక్రమాత్" పరాక్రమము నాశ్రయించి, "దండకాన్ జిగమిషుః" దండకారణ్యమునకు వెడల నిశ్చయించినవా డగుచు, "అథ అనుజం దర్శనమనుశాస్య" పిమ్మట లక్ష్మణుని శాస్త్రసిద్ధాంతముల బోధచే శిక్షించి 'జననీం హృది ప్రదక్షిణం చకార' తల్లిని హృదయమున ప్రదక్షిణము చేసెను. ఉక్తిప్రత్యుక్తులతో ప్రయోజన మేముండును. మనోనిగ్రహ మే సర్వకార్యసాధకమని నిశ్చయించి, తల్లికి ప్రదక్షిణము చేయుట యనెడి వ్రతమును మనమున సంకల్పించెనని యర్థము.

స 22. శ్లో॥ 21. కశ్చి ద్దైవేన సౌమిత్రే యోద్ధు ముత్సహతే పు
మాన్ । యస్య న గ్రహణం కించి త్కర్మణోఽన్యత్ర దృశ్యతే॥

వ్యా॥ ఏతాదృశమపి దైవం తత్సామర్థ్యాజ్ఞానా ద్వశీకర్తుం కశ్చి ద్యతమాన స్సన్ ముహ్యతీత్యాహ । కశ్చిద్ధీరం మన్యః ఉత్సహతే- ఉత్సాహ మాత్రమేవ- న తావతా తస్య కార్యసిద్ధిరితి భావః । తత్కుత ఇత్యత ఆహ । యస్య గ్రహణం - గృహ్యతే అనేనేతి వ్యుత్పత్త్యా నివృత్తి సాధనం। కర్మణోఽన్యత్ర- కర్మాతిరిక్తం కించి న్నదృశ్యతే- దైవం నిరసితుం కర్మైవ ఖలు సాధనం। తచ్చాపి పునర్దైవం సత్ ఫలం నిష్పాదయతి । అతః పునః కర్మ, తతో దైవం। కర్మజన్యాపూర్వస్యైవాత్రత్య దైవపదార్థత్వాత్ ఘట్టకుటీప్రభాతన్యాయేన తన్నివృత్తిః కర్మణా న సిధ్యతీతి భావః । అత్ర దైవస్య కార్యానుమేయ స్వరూపత్వేన పురుషకార నివర్త్యత్వం న సంభవతీత్యాశయక వ్యాఖ్యానం తు న తుష్టికరం । తస్య తన్నివర్త్యత్వాభావే ప్రమాణస్య వా హేతోర్వా అప్రదర్శనేన ప్రకృతార్థాసాధకత్వాత్ ॥

తా॥ దైవ మిట్టినాడయినను, ఆతని సామర్థ్యమును గుర్తెరుంగక ఒక్కొక్క డాదైవమును స్వాధీనము చేసికొనుటకు యత్నించును భ్రాంతుడగు చుండునని తెలుపుచున్నాడు. "హే సౌమిత్రే కశ్చిత్పుమాన్ దైవేన యోద్ధుముత్సహతే" లక్ష్మణా ! ధీరంమన్యుడగు పురుషుడు దైవముతో పోరాడుటకుత్సహించును. ఆతని కుత్సాహమాత్రమేగాని అంతమాత్ర

మున కార్యసిద్ధి లేదని భావము. "యస్యగ్రహణం" ఏ దైవము యొక్క గ్రహణము (గృహ్యతే అనేనేతి గ్రహణం అని వ్యుత్పత్తి. దీనిచే గ్రహింపబడునున్నది గాన గ్రహణ మనబడును. గ్రహించుటకు సాధన మని యర్థము.) 'కర్మణోఽన్యత్ర న దృశ్యతే' కర్మకంటె నితరమైన దేదియు గనబడుట లేదు.

దైవమును నిరసించుటకు కర్మయే సాధనము. అదియును తిరిగి దైవమై ఫలమును బుట్టించును. కావున తిరిగి కర్మ- దానివలన దైవము. ఇచ్చట దైవమన కర్మవలన గలిగెడి అపూర్వమే గాన ఘట్టకుటీప్రభాతన్యాయముచే ఆ దైవ నివృత్తి కర్మచే గలుగదని భావము. ఇక్కడ దైవము కార్యముచే నూహింపదగిన స్వరూపము గలది గాన పురుషకారముచే నివర్తింపజేయుట సంభవింపదను నభిప్రాయము నిచ్చు వ్యాఖ్యానము సంతుష్టిగ లేదు. పురుషకారముచే దైవము నివర్తింపబడక పోవుటలో ప్రమాణమును గాని హేతువును గాని చూపించకుండుటచే నీయర్థమును సాధింపజాలదు.

స 22. శ్లో॥ 22. సుఖదుఃఖే భయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ। యచ్చ కించి త్తథా భూతం నను దైవస్య కర్మ తత్॥

వ్యా॥ నన్వన్వయ వ్యతిరేకాభ్యాం కర్మణ ఏవ తత్తత్ఫలానువిధాయిత్వే కిం దైవేనేత్యత ఆహ। సుఖదుఃఖేతి। యచ్చ కించి దితి తథాఽభూతం- యేన ప్రకారేణ భవిష్యతీతి కర్మారబ్ధం తథా అనిష్పన్నం। పూర్వోక్త సుఖదుఃఖాదికం సర్వం దైవస్య

కర్మే త్యనేన తత్సాన్వయం ఫలం లక్ష్యతే । అతః కర్మాతిరిక్తం దైవ మంగీకార్య మితి భావః॥

తా॥ అన్వయవ్యతిరేకములచే కర్మయే ఆయా ఫలములను విధించు నపుడు దైవము నేల యంగీకరింప వలయు నని యన రాదు. సుఖదుఃఖములు, భయక్రోధములు, లాభాలాభములు, సంసారాసంసారములు, మున్నగునవి 'యచ్చ కించి త్తథాఽభూతం' ఏరీతిగ గావలెనని కర్మ యారంభింపబడినదో, ఆరీతిగ నిష్పన్నము గాకుండుట యేది కలదో, "తత్" పూర్వమున చెప్పబడిన సుఖదుఃఖాదు లన్నియు 'దైవస్య కర్మ' దైవసాధ్యమయిన కర్మఫలమే యని కనుబడుచున్నది. కావున కర్మకంటె నితరమైన దైవము నంగీకరింప వలసినదే యని భావము.

స 22. శ్లో॥ 23. ఋషయో హ్యుగ్రతపసో దైవేనాభి ప్రపీడితాః।
ఉత్సృజ్య నియమాం స్తీవ్రాన్ భ్రశ్యంతే కామమన్యుభిః॥

వ్యా॥ దృష్టాంతేన తదేవ ద్రఢయతి- ఋషయ ఇతి । కామక్రోధాదీన్ జేతుం ముగ్రతపసః అనివార్యనియమా ఋషయోఽపి విశ్వామిత్ర జమదగ్ని ప్రభృతి మహాత్మానః- దైవేన అభిప్రపీడితాః- దైవం ముల్లంఘితు మశక్తా స్సంతః- భ్రశ్యంతే- తాదృశ నియమేభ్యో భ్రష్టా అభవ న్నిత్యర్థః॥

తా॥ దృష్టాంతముచే పైవిషయమునే దృఢపఱుచు చున్నారు. కామక్రోధాదులను జయించుటకొఱకు "ఉగ్రతపసః ఋషయోఽపి" నివారింప శక్యముగాని నియమము గల విశ్వామిత్ర జమదగ్న్యాది మహాత్ములును "దైవేన అభిప్రపీడితాః"

దైవము నుల్లఘించుటకు సమర్థులు కానివారై అట్టి నియమ ములనుండి భ్రష్టులైరి. అటువంటి నియమముతో కూడినవారు భ్రష్టులైరని యర్థము.

స 22 శ్లో॥ 24 అసంకల్పిత మేవేహ యదకస్మాత్ప్రవర్తతే।
నివర్త్యారంభ మారబ్ధం నను దైవస్య కర్మ తత్॥

వ్యా॥ నను నైతావతా దైవసిద్ధిః । కింతు తన్నివారణా నుకూల నియమాభావా దేవ తేషాం భ్రంశః। యథా రోగనివా రణానుగుణ చికిత్సాభావే తదశాంతి రిత్యాశంక్య ఆహ। అసం కల్పిత మేవేతి। అకస్మాత్ - అజ్ఞాత కారణాత్ - అసంకల్పిత మేవ- ఇదం మే భూయా దితి పురుషేణానిష్యమాణ మేవ- యది సం కల్ప స్తదా తత్సిద్ధయే పురుషః ప్రవర్తేత । తదభావేన తదసం భవః। యథా ప్రకృతే భరతస్య మహా నభ్యుదయ ఇతి తాత్ప ర్యం । తదపి కిం దృష్టకారణకం ఉత అదృష్టకారణకం । ఆద్యం తు దుర్వచం। అర్థాత్ ద్వితీయ మేవ అంగీకార్యం। తదేవ దైవం జానీహీతి భావః। తత్రాపి ఆరబ్ధం- ఆరంభం । ఉపక్రాంతం ప్ర యత్నం। నివర్త్య- నిష్ఫలీకృత్య। అతః భవ దుక్తాన్వయ వ్యతిరే కాసిద్ధ్యా పౌరుషం నకారణ మితి బోధ్యం॥

తా॥ ఇంతమాత్రముచే దైవసిద్ధి కాదు. కాని వానిని నివారించుటకు తగిన నియమము లేకుంపుట వలననే వారికి తపోభంగము గలిగినది. రోగ నివారణకు తగిన చికిత్స లేకున్న చో రోగము శాంతింపనటులనే యందు రేమో? యని శంకించి చెప్పుచున్నాడు.

'అకస్మాత్' తెలియని కారణము వలన, 'అసంకల్పిత మేవ' ఇది నాకు కలుగుగాక యని పురుషుడు కోరకుండగనే సంకల్ప మున్నచో దాని సిద్ధికొరకు అతడు యత్నించును గదా! అట్టి సంకల్పమే లేకున్నచో యత్నమే సంభవింపదు. ప్రస్తుతము భరతునకు గొప్ప యభ్యుదయము కలుగుట సంకల్పము లేకుండగనే సిద్ధించుటకు తా కారణ మని భావము. అట్లగుటకు కనబడు కారణము గలదా? లేక కనబడని కారణము గలదా? అన్నచో మొదటిది చెప్ప సర్వాముగానిది. కావున రెండవపక్షమే అంగీకరింపవలయును. అట్టిదానినే దైవ మని తెలిసికొను మని భావము.

అందును "అరబ్ధం ఆరంభం" ఉపక్రమింప బడిన యత్నమును, 'నివర్త్య' విఫలము జేసి, సంకల్పింపనిది ప్రవర్తించుట దైవమనక తప్పదు. కావున నీవు చెప్పిన అన్వయవ్యతిరేకములు సంభవింపవు గాన పౌరుషము చేయ జనదు.

స 22. శ్లో॥ 25. ఏతయా తత్త్వయా బుద్ధ్యా సంస్తభ్యాత్మాన మాత్మనా । వ్యాహతేఽప్యభిషేకే మే పరితాపో నవిద్యతే॥

వ్యా॥ తత్వయా బుధ్యా- అర్శఆద్యజంత స్తత్వశబ్దః । అన్యథా నిత్యనపుంసకత్వేన వనఫలాది శబ్దవత్ విశేష్య నిఘ్నత్వానుపపత్తేః । కిమిత్యనపకారిణాం సహజప్రేమా కైకేయీ ఏవం అకృత- అతో మయా సాగసా భావ్య మితి పరితాపో నాస్తీతి భావః॥

తా॥ ఇట్టి తత్త్వముతో గూడిన బుద్ధిచే నా చేత నన్ను నిరోధించి, నా పట్టాభిషేకము అరికట్టబడినను, నేను పరితాపము నొందను. "తత్త్వయా" అనుపదము "అర్శఆదిభ్యోచ్" అను సూత్రముచే విధింపబడిన "అచ్" ప్రత్యయముతో గూడినది. లేకున్నచో "తత్త్వ" శబ్దము నిత్యనపుంసక మగుటచే విశేష్యనిఘ్నము కాజాలను గాన "తత్త్వయా" అను స్త్రీలింగ మగుట కుదురదు. అపకారము చేయనివారి విషయమున సహజ ప్రేమ గల కైకేయి నా విషయమున నిర్దేల చేసె! కావున నే నామె విషయమున నపరాధముతో గూడిన వాడనై యుందును. కావున నాకు పరితాపము లేదని భావము.

స 22. శ్లో॥ 29. మాస్మ లక్ష్మణ సంతాపం కార్షీర్లక్ష్మ్యా విపర్యయే । రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః॥

వ్యా॥ లక్ష్మ్యాః విపర్యయే- భంగే సంతాపం మాకార్షీః- కింతు సంతోషమేవ ప్రాప్నుహీతి భావః । రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః- । రాజ్యం వా కిముత్తమం వనవాసో వా కిముత్తమ ఇతి విచారణే వనవాస ఏవ మహోదయః- ఆపాతత స్సుఖసాధనత్వేఽపి రాజ్యం దుఃఖోదర్కం- దృష్టదోష బహుళత్వాత్ । వనవాసస్తు సుధియాం మహోదయః- చిత్తశుద్ధి హేతుత్వా దిత్యర్థః। ఇష్టాభాసస్య రాజ్యస్యాపగమేన అత్యంత శ్రేయస్సాధనం వనవాసం కల్పయ ద్దైవం కిమితి వర్ణ్యత ఇతి భావః।

తా॥ ఓ లక్ష్మణా "లక్ష్మ్యాః విపర్యయే" లక్ష్మియొక్క వ్యత్యయమునందు "సంతాపం మాకార్షీః" సంతాపము నొందకుము. సంతోషమునే పొందుమని భావము. "రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః" రాజ్య ముత్త మమా? వనవాస ముత్తమమా? యని విచారించి నపుడు వనవాసముననే గొప్ప యుదయము లభించును. తాత్కాలి కముగ రాజ్యము సుఖహేతు వయినను, ప్రత్యక్షముగ గన్పట్టు యనేక దోషములతో కూడినదిగాన దుఃఖావహమే. వనవా సము చిత్తశుద్ధికి హేతువు గాన సద్బుద్ధి గలవారలకు గొప్ప యభ్యుదయహేతువే. ఇష్టాభాస మయిన రాజ్యము పోవు టచే గొప్పదగు శ్రేయస్సునకు సాధనమగు వనవాసమును గల్పించిన దైవము నేమని వర్ణింపవచ్చు నని భావము.

స 22. శ్లో॥ 30. న లక్ష్మణాస్మి న్ఖలు కర్మవిఘ్నే ।
మాతా యవీయ స్యతిశంకనీయా ।
దైవాభిపన్నా హి వద త్యనిష్టం ।
జానాసి దైవం చ తథా ప్రభావం॥

వ్యా॥ ఇతఃపూర్వ ముక్తం దైవపౌరుషయో ర్భేదం సంగ్రహేణ లక్ష్మణా యోపదిశతి । అనిష్టం- స్వస్యాః ప్రథమ తోఽనిష్టమపి మే వనవాసం- దైవాభిపన్నా- దైవచోదితా సతీ వదతి। పిశాచాద్యావిష్టవత్ । దైవం చ తథా ప్రభావం । దైవం చ అనిష్టేఽపి ప్రవర్తక స్వభావం । అనుభవేన జానాసి కిమితి శేషః । అతః కైకేయీ విషయే న శంకితవ్య మిత్యర్థః॥

తా॥ ఇంతకు ముందు చెప్పబడిన దైవపౌరుషముల భేద మును శ్రీరాముడు సంగ్రహముగ లక్ష్మణున కుపదేశించు చున్నాడు. "లక్ష్మణ! "అస్మిన్ కర్మవిఘ్నే యవీయసీ మాతా నాతిశంకనీయా" లక్ష్మణా! ఇప్పుడు ప్రాప్తమయిన పట్టాభి షేక విఘ్నవిషయమున పినతల్లి శంకింప తగినదిగాదు. "అనిష్టం" తనకు మొదట ఇష్టములేని నా కీవనవాసమును "దైవాభిపన్నా" పిశాచాదులచే ఆవిష్టురాలివలె దైవముచే ప్రేరేపింప బడినదై "వదతి" చెప్పుచున్నది. "దైవంచ తథా ప్రభావం" దైవము అనిష్టమునందును ప్రవర్తింప జేసెడి స్వభావము గలది. 'జానాసి' అనుభవముచే నెరుగుదువా? కావున కైకేయి విషయము శంకింప జనదని భావము.

స 23. శ్లో॥ 1. ఇతి బ్రువతి రామే తు లక్ష్మణోఽధ శ్శిరా ము హుః। శ్రుత్వా మధ్యం జగామేవ మనసా దుఃఖహర్షయోః॥

వ్యా॥ ఇతి- పౌరుషాపేక్షయా దైవస్య ప్రాబల్యబోధన ప్రకారేణ బ్రువతి। వదతీతి- వర్తమాన నిర్దేశేన- తదవ్యవధా నేనైవ। ముహుః- పునః పునః। అధశ్శిరాః- అశూరవదయం భాషత ఇతి లజ్జయా నమ్రశిరాః। శృత్వా- ఆదరేణ తద్వా క్యార్థం గృహీత్వా। దుఃఖహర్షయోః- మహానప్యయం మధర్మే ధర్మభ్రమేణ పంకం వృషభ ఇవ అపథం గత ఇతి దుఃఖం। తదీ య భ్రమ నిరసనా మోపప్యసీతు ముత్సాహః తయో ర్మధ్యం- ఏకతో దుఃఖ మపరత స్తద్భ్రమనిరసనామోత్సాహ ఇత్యుభ యవిధవృత్తిం మనసా జగామేవ స్థిత ఇతి శేషః। పూర్వోక్త

వృత్తిద్వయాక్రాంత మనసః - ఇవేత్యనేన దుఃఖస్య కంచిత్కాల మనుభవేఽపి తన్నిగూహ్య భ్రాతృచిత్తవశీకరణాయ ఉత్సాహ శక్తిమేవ పశ్చాత్ప్రకటీచకారేతి సూచ్యతే। రామస్య ధర్మస్థిర త్వజ్ఞానేన సంతోషః రాజ్యభ్రంశేన దుఃఖమితి వ్యాఖ్యానం న సమ్యక్ । కామాధీనస్య పితు రధార్మికత్వ వ్యవస్థాపనపూర్వ కం। తాదృశే పితృవాక్యకారిణి రామే భ్రాంతత్వస్య స్వయ మనుపద మేవ వక్ష్యమాణత్వాత్। రాజ్యాపేక్షయా వనవాస స్యైవ స్వబుద్ధ్యా శ్రేయ స్త్వం మన్యమానస్య రామస్య వాక్యతి స్తద్దుఃఖనివృత్తేరేవ చోద్యత్వేన పున స్స్వస్యాపూర్వదుఃఖా ప్రసక్తేః । "తాపస పర్వతా" విత్యాదివత్ హర్ష దుఃఖయో రితి వక్తవ్యే దుఃఖహర్షయో రితి వ్యతిరేక నిర్దేశేన తయో రుద యక్రమస్య వక్తవ్యత్వే తదకథనేన తదసామంజస్యాత్ । ఇవే త్యస్య హర్ష స్యాస్థిరత్వసూచకత్వమితి తు న యుక్తం । ద్వన్ద్వ నిర్దిష్టయో రుభయో రపి సామ్యేన ఇవ శబ్దార్థయోగే దుఃఖాం శే ఉత్తరగ్రంథేన లక్ష్మణస్య స్థిరత్వస్యైవ ప్రతీతేః । అతః అస్మ ద్వ్యాఖ్యాన మేవ ఆశ్రయణీయ మిత్యలం । సంభావితో హి యేన కేనచి త్కారణేన అవమానే లజ్జయా సంసది స్థాతుం సంకుచిత స్సన్ త్వరిత మన్యత్ర విలీయతే తద్వదితి ధ్వనిః॥

తా॥ "రామే ఇతిబ్రువతి" శ్రీరాముడు పౌరుషముకంటె దైవమునకే ప్రాముఖ్యము గలదని చెప్పుచుండగా 'లక్ష్మణః' లక్ష్మణుడు, 'ముహుః' తిరిగి తిరిగి, "అధశ్శిరాః" పిరికివానివలె నీతడు మాటలాడుచున్నాడని లజ్జచే వంగిన శిరస్సు గలవాడై

"శ్రుత్వా" ఆదరముతో శ్రీరాముడు చెప్పిన వాక్యముల యర్థమును గ్రహించి, "మధ్యం" దుఃఖహర్షముల మధ్యను, అనగా గొప్పవాడయినను సీతకు అధర్మమందు ధర్మభ్రాంతిచే వృషభము బురదనువలె అపమార్గము నందినాడని దుఃఖము, ఆతని భ్రమను పోగొట్టుటకై ఉపన్యాసము చేయు నుత్సాహమును, ఈరెండిటిమధ్యను, ఒకవైపున దుఃఖమును, వేరొక వైపున శ్రీరాముని భ్రమను పోగొట్టవలెనను నుత్సాహమును, ఈ రీతిగ మనస్సుచే ద్వైవిధ్యమును పొందియున్నాడు. వెనుక చెప్పిన ఉభయవిధ వృత్తులతో నిండిన మనస్సుగలవాడనుటచే కొంతకాలము దుఃఖ మనుభవించినను, దానిని కప్పిపుచ్చి, సోదరుని చిత్తమును వశపఱుచుకొనుటకై పిమ్మట ఉత్సాహశక్తినే ప్రకటించెనని సూచిత మగుచున్నది.

శ్రీరామునకు ధర్మమందు స్థిరపడెనను జ్ఞానముచే సంతోషమును, రాజ్యము కోల్పోవుటచే దుఃఖమును, అని కొందరు చేసిన వ్యాఖ్యానము సరిగాదు. కామపరతంత్రుడగు తండ్రి అధార్మికుడని సమర్థించుచు, అట్టి తండ్రి వాక్యమును పాలించువాడగు రామునియందు భ్రాంతత్వము వెంటనే ఆ వ్యాఖ్యాతచేతనే చెప్పబడుచున్నది. రాజ్యము నపేక్షించుటకంటె వనవాసమునందే శ్రేయస్సు కలదని తన బుద్ధిచే నూహించు శ్రీరాముని వాక్యము వలన నాతని దుఃఖము నివృత్తియే తెలుపవలసియున్నది గాన, ఆతనికి క్రొత్తగ దుఃఖము గలిగిన దనుట సరిపడదుగదా! "తాపసపర్వతౌ" మున్నగు సమాసపదముల

యందువలె, "హర్ష దుఃఖయోః" అని ప్రయోగింప వలసి యుం డగ, "దుఃఖహర్షయోః" అని వ్యతిరేకముగ ప్రయోగించి, ఆ దుఃఖహర్షముల యుత్పత్తిక్రమమును దెలుపవలసి యుండగ అట్లు తెలుప కుండుటచే నది యసమంజసమే యగును. "ఇవ" శబ్దము హర్ష మస్థిరమని సూచించుట కుపయోగించె ననుట యు సరిగాను. ద్వంద్వసమాసములో రెండు పదార్థములకును ప్రాధాన్య ముండును గాన, "ఇవ" శబ్దార్థముతో సంబంధము గలుగునపుడు దుఃఖాంశ విషయమున చెప్పబోవు గ్రంథముచే లక్ష్మణునకు స్థిరత్వమే తోచును. కావున నేను చెప్పిన వ్యాఖ్యానమే ఆశ్రయింప దగినది. తొలుత గౌరవింప బడినవాడు ఏదియో యొక కారణముచే అవమానము పొందినపుడు లజ్జచే సభయం దుండుటకు సంకోచము గలవాడై శీఘ్రముగ వేరొక చోట అణగిపోవునను నర్థము ధ్వనించుచున్నది.

స 24. శ్లో॥ 37. అపీదానీం సకాలస్స్యా ద్వనా త్ప్రత్యాగతం పునః । యత్త్వాం పుత్రకపశ్యేయం జటావల్కలధారిణం॥

వ్యా॥ "గచ్ఛేదానీం మహాబాహో క్షేమేణ పున రాగతః" (స 24 శ్లో 36) ఇతి శ్లోకే చతుర్దశవర్షమిత కాలవియోగే పుత్రస్య స్వాశంసావిషయత్వబోధనం- శబ్దతః మాతు స్స్వస్యా అశ్లీల మితి భంగ్యంతరేణ తత్సూచయతి । యత్ - యదేత్యర్థక మవ్యయం- యస్మిన్ కాలే జటావల్కలధారిణం వనాత్ప్రత్యాగతం త్వాం పశ్యేయం స కాల ఇదానీం స్యాదపి- "కాలస్యసర్వాధారత్వాత్" ఏతత్క్షణ ఏవ తత్క్షణాధారో భవ

త్వితి యోజకోపపత్తిః । ఇదానీ మిత్యధికరణ శక్తి ప్రధానమవ్య యం । యద్వా- ఇదానీ మపి స్యా దితి వా- అస్మి న్పక్షే కాల స్యాఖండత్వాదుపాధి పరిహారేణ ద్వయో రపి కాలయో రేక త్వ మేవా స్త్వితి యోజ్యం। తద్వియోగకాలః యథా మే నేదీయా న్భవే త్తథా సర్వథా శ్రేయోవిశిష్టస్సన్ శీఘ్ర మాగచ్ఛేతి భావః॥

తా॥ "విశాలమగు బాహువులుగల కుమారా! క్షేమ ముచే తిరిగి మరలుచు నిప్పుడు వెడలుము" అను (స 24. శ్లో॥ 36) శ్లోకార్థానుసారముగ పదునాలుగు వత్సరములు పరిమితిగల వియోగమునందు పుత్రుడు తన కోరికయొక్క విషయము దెలు పుట, తల్లియగు తన కమంగళమని వేరొకరీతిని ఆవిషయమును సూచించుచున్నది.

"యత్" అనునది ఎప్పుడని నర్థముగల అవ్యయము. ఏకాలమందు, జటావల్కలములను ధరించి వనమునుండి తిరిగి వచ్చిన నిన్ను చూతునో "స కాలః ఇదానీ మపి స్యాత్" ఆ కాలము ఇప్పుడే యగుగాక. "కాలము సర్వాధారము గాన, ఈక్షణమే ఆక్షణమున కాధార మగుగాక యను నర్థము నుప యోగించుకొనిన సరిపడును. 'ఇదానీం' అనునది అధికరణసం బంధమైన శక్తిని సూచించు అవ్యయము. లేదా, 'ఇదానీమపి స్యాత్' ఇప్పుడును నగునా? ఈపక్షమున కాల మఖండము గాన, 'ఈ' 'ఆ' అను నుపాధులను వదలి రెండుకాలములకు నేకత్వమే యగుగాక యని యోజింపవచ్చును. నీ వియోగకా

లము నాకెట్లు మిక్కిలి దగ్గరదగునో అట్లు నీవు సర్వవిధముల శ్రేయస్సుతో గూడినవాడవై శీఘ్రముగ రమ్మని భావము.

స 26. శ్లో॥ 24. భరతస్య సమీపే తు నాహం కథ్యాః కదాచన । బుద్ధియుక్తాహి పురుషా న సహంతే పర స్తవం॥

వ్యా॥ చిరం వనే వసతి స్వస్మి న్నిత్యపరిచయాభావేన భరతస్య తతః పూర్వతన భక్తిభంగో ద్భావనయా పునః పునః స్వగుణప్రశంసనేన సీతా భరతం రంజయితుం ప్రయతేత । తచ్చ భరతవిషయే అనావశ్యకం । స్వవిషయే త్వదపేక్షయా భరతస్యైవ భక్తి విశేషేణ మద్గుణగ్రహణానుకూలబుద్ధి మత్వా దితి తస్యా గృహైకవసతి తాత్పర్యేణ రామ స్సీతా ముప దిశతి- భరతస్యేతి। సమీపేతు। సమీపేఽపి। నకథ్యాః-నశ్లాఘ్యాః- భరతే శృణ్వతి అన్యోద్దేశేన వా మద్గుణశ్లాఘా న కర్తవ్యా- కిం పున స్సాక్షా ద్భరతం ప్రతి న కథ్య ఇతి భావః। తత్రహేతు మాహ-బుద్ధియుక్తా ఇతి । పర స్తవం- పరకర్తృకాన్యదీయ గుణ శ్లాఘాం। న సహంతే- నాపేక్షంతే । బుద్ధిమతాం హి పరగుణ గ్రహణే పరబోధనాపేక్షా అనావశ్యకీ- స్వయమేవ తద్గ్రహ ణార్హబుద్ధి మత్వాదిత్యర్థః । ప్రయోగభేదేన ధాతో రర్థభేదో వ్యుత్పత్తిసిద్ధః। యథా 'శత్రూన్ సహత' ఇత్యత్ర తత్ప్రయుక్త బాధాధీన వికృతి శూన్యత్వం తద్వశీకరణానుకూల శక్తిమత్వం వా సహధాతో రర్థః। పరశ్రేయ స్సహత ఇత్యత్ర తద్ధర్మికా నిష్ట త్వప్రకారకజ్ఞానాభావః తత్సత్తాధీన క్లేశరాహిత్యం వా అర్థః । అత ఏవ నైషధే "మీయతాం కద మభీప్సిత మేషాం దీయ

తాం కథ మయాచిత మేవ। తం ధిగస్తు కలయ న్నపి వాంఛా మర్థివాగవసరం సహతే యః" అపేక్షత ఇత్యేవాత్ర ధాత్వర్థో యుక్తః॥

తా॥ చిరకాలము వనమందుండగ, తనయందు నిత్యపరిచయము లేకుండుటచే భరతున కంతకు ముందుండు భక్తి నశించునను నూహచే తిరిగి తిరిగి తన గుణప్రశంసచే సీత, భరతుని సంతోషపెట్టుటకు యత్నించును. అట్లు చేయుట భరతుని విషయమున ఆనవసరము. నా విషయమున నీకంటె భరతునకే భక్తివిశేష ముండుటచే నా గుణములను గ్రహించుటకు తగిన బుద్ధి గలదని తెలిపి, ఆమె గృహామునం దుండవలెనను తాత్పర్యముతో శ్రీరాముడు సీత కుపదేశించుచున్నాడు. "భరతస్య సమపేతు" భరతుని సమీపమునను "అహంకదాచన నకత్థ్యః" నే నెప్పుడును శ్లాఘింప తగినవాడను గాను. భరతుడు వినుచుండ ఇతరుల నుద్దేశించియు నా గుణశ్లాఘను చేయవలదు. ప్రత్యక్షముగ భరతునిగూర్చి వలదని చెప్పనేల? తిరిగి అందుకు గారణమును దెలుపుచున్నాడు. "పరస్తవం" పరులు చేయు నితరులయొక్క గుణశ్లాఘను 'బుద్ధియుక్తాః పురుషా న సహన్తే' బుద్ధిమంతులగు పురుషులు అపేక్షింపరు. బుద్ధిమంతుల కితరుల గుణములను గ్రహించుటలో అన్యులు బోధింప నవసరము లేదు. వారు స్వభావముగనే అట్టిబుద్ధి గలవారగుదురు. "సహంతే" యను ధాతువునకు అపేక్షించుట యను నర్థము, ప్రయోగ భేదముచే ధాతువున కర్థభేదము వ్యుత్పత్తిచే సిద్ధించును.

"శత్రువులను సహించుచున్నాడు" అనగా వారు చేయు బాధా దులవలన వికారము లేనివాడగుచున్నాడు. లేదా, వారిని స్వాధీనము చేసికొనుటకు దగిన శక్తి గలుగుట యనియు 'సహ' ధాతువున కర్థము చెప్పినట్లే, ప్రకృతమున నర్థము పొస గును. పరుల శ్రేయస్సును సహించుచున్నాడన, పరుల కని ష్టము కలుగవలెనని జ్ఞానము లేకుండుట. లేదా, వారి యునికిచే క్లేశము నందకుండుట యనిగాని యర్థము. కావుననే నైషధము నందు "వీరి యభీప్సిత మెట్లు గుర్తెఱుగుదును. అడుగకుండగనే యెట్లీయ గల్గుదును. యాచకుని వాంఛితము నెఱిగియు వాని వాగవసరము నెవడపేక్షించునో వానికి నింద యగుగాక" యని చెప్పినట్లు "సహ" ధాతువునకు అపేక్షించు నను నర్థమును గ్రహించుట యుక్తము.

స 26. శ్లో॥ 28. అహం చాపి ప్రతిజ్ఞాం తాం గురోస్సమనుపాల యన్ । వన మద్యైవ యాస్యామి స్థిరా భవ మనస్వినీ॥

వ్యా॥ పితురాజ్ఞా మహమివ మదాజ్ఞాం త్వ మనుపాల యేత్యాహ । స్థిరా - చాపల రహితా । మనస్వినీ- శ్లాఘ్య మనస్కా- భవ।

ఇతి శ్రీమద్రామాయణే అయోధ్యాకాండే హారితస గోత్రోద్భవేన బొమ్మకంటి నృసింహశాస్త్రిణా విరచితాయాం కల్పవల్లికాఖ్యాయాం వ్యాఖ్యాయాం ద్వితీయః కిసలయః॥

తా॥ నేను, తండ్రి యాజ్ఞను బాలించినట్లు నీవు నా యాజ్ఞను మన్నింపుము. "స్థిరా" చాపల్యము లేనిదానవై "మనస్వినీ" కొనియాడదగిన మనస్సుగలదానవు గమ్ము.

ఇట్లు శ్రీహరితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహ
శాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ
కల్పవల్లికా వ్యాఖ్యానమందు ద్వితీయ
కిసలయము సంపూర్ణము.

---

స 27. శ్లో॥ 21. కిమిదం భాషసే రామ వాక్యం లఘుతయా ధ్రువం । త్వయా య దపహాస్యం మే శ్రుత్వా నరవరాత్మజ॥

వ్యా॥ ఇదం వాక్యం "భరతస్య సమీపే తు" ఇత్యారభ్య "అహం గమిష్యామి మహావనం ప్రియే । త్వయా హి వస్తవ్యమిహైవ భామిని । యథా వ్యళీకం కురుషే న కస్యచి త్తథా త్వయా కార్య మిదం వచో మమ" ఇత్యంత త్రయోదశ శ్లోకాత్మకం వాక్యం మదీయగృహవాస యూపైక విధేయసమర్పకత్వే నైకవాక్య మిత్యర్థః । లఘుతయా- స్మృత్యాది విరుద్ధార్థ ప్రతిపాదకత్వేన నిస్సారతయా। ధ్రువం- సద్భి ర్నిశ్చితం। భాషసే కిం నరవరాత్మజ - తత్పుత్రమపి త్వయా నగణిత మిత్యాక్షేపః । యత్ త్వయా- అన్యయా త్వశబ్దోఽన్యవాచీ। శ్రుత్వా- శ్రవణమాత్రేణైవ । మే- మహ్యం- మదుద్దేశేనే త్యర్థః । అపహాస్యం- అపహసితు మర్హ మిత్యర్థః । మామాక్షేప్తు మితి యావత్। "క్రియార్థోపపదస్యే" త్యాదినా చతుర్థీ। భవతీతి శేషః । సీతా భర్తృప్రేమానాస్పదా। అత ఏవ తాం పరిత్యజ్య స్వయమేక ఏవ వనం గంతు మిచ్ఛతి రామ ఇతి సర్వా అపి నార్యో మా మాక్షిపంతి। పత్యనాదరస్య స్త్రీణా మగౌరవావహత్వా దితి భావః॥

తా॥ "ఇదం" "భరతస్య సమీపే" (స 27. శ్లో॥ 24.) అను శ్లోకము మొదలుగ 'అహంగమిష్యామి' (స 26. శ్లో॥ 38.) "నేను మహావనమున కేగెదను. నీ విక్కడనే యుండవలెను. ఎవని వాక్యమునైన నెట్లు విఫలము చేయవో అట్లులనే నా

వాక్యమును మన్నింపుము” అనునంతవఱకు గల పదమూడు శ్లోకముల స్వరూపమయిన వాక్యము నన్నును గృహమం దుండుమను విషయము నొక్కదానినే తెలుపు వాక్యమని యర్థము. “లఘుతయా” స్మృత్యాదులకు విరుద్ధమగు నర్థమును దెలిపెడి దగుటచే సారము లేనిదిగ ‘ధ్రువం’ సత్పురుషులచే నిశ్చయింపబడినది. అట్టి వాక్యమును ‘భాషసే కిం నరవరాత్మజ’ నరశ్రేష్ఠుని పుత్రుడవై యేల పలికితివి. “యత్” ఏ వాక్యము, “త్వయా” ఇతర స్త్రీచేతను. “త్వ” శబ్దము అన్యార్థకము. “శ్రుత్వా” వినినంతనే “అపహాస్యం” పరిహసించుటకు తగినదై యగునో అట్టిదానినని సంబంధము. “సీత భర్త ప్రేమకు స్థాన మగునది కాదు. కావుననే శ్రీరాముడామెను వదలి తా నొక్కడే వనమునకు పో నిచ్ఛగించుచున్నా”డని స్త్రీలాదరు నన్నాక్షేపింతురు. పతి యనాదరణ సేయుట స్త్రీలకు అగౌరవ మును గల్గించునని భావము.

స 30. శ్లో॥ 1. సాంత్వ్యమానా తు రామేణ మైథిలీ జనకా
త్మజా । వనవాస నిమిత్తాయ భర్తార మిద మబ్రవీత్ ॥

వ్యా॥ వనవాసనిమిత్తాయే త్యుభయాన్వయి- వనవాసం నివర్తయితు మితి పూర్వేణ వనవాస మనుమోదయితు మిత్యు త్తరేణాన్వయః । యదేవ వనవాసా న్నివర్తయితుం కారణం తదేవ తదంగీకార కారణ మితి సమాధివిశేషో వ్యజ్యతే । “నిమి త్తపర్యాయప్రయోగే సర్వా సాంప్రాయదర్శనమితి చతుర్థీ”॥

తా॥ "వనవాసనిమిత్తాయ" అనునది రెండింటితో నన్వయించును. వనవాసము మరలించుటకని వెనుకదానితోడను, వనవాసము నంగీకరింపజేయుటకని ముందు వాక్యముతోడను సంబంధించును. ఏది వనవాసమునుండి మరలించుటకు కారణమో, అదియే వనవాసము నంగీకరించుటకును కారణమను సమాధానవిశేషము తోచుచున్నది. 'నిమిత్త' శబ్దముతో గూడినపు డన్నివిభక్తులు నుండును గాన "వనవాసనిమిత్తాయ" అను చతుర్థి పొసగును.

స 30. శ్లో॥ 2. సా త ముత్తమసంవిగ్నా సీతా విపులవక్షసం।
ప్రణయా చ్చాభిమానాచ్చ పరిచిక్షేప రాఘవం॥

వ్యా॥ ఉత్తమసం- ఉత్కృష్టతమో గుణయుక్తం- తద్గుణప్రయుక్తః- అనిష్టహేతుత్వేఽపి తదనాదరేణ స్వచికీర్షితస్యావశ్యనిర్వహణ నిశ్చయరూపో యోఽభినివేశః తద్యుక్తమిత్యర్థః। ప్రణయాత్- ప్రేమ్ణః। అభిమానాచ్చ- స్వీయపత్యనుసరణవ్రతరూపేష్టభంగో భవతీ త్యభిమానాచ్చ। విపులవక్షసం- బాహ్యశత్రుజయే యథా ఽంతశ్శత్రుజయేఽపి ధీరహృదయ మితి యావత్। రాఘవం- సత్కులప్రసూతమిత్యర్థః। ఏతచ్చ స్వీయాభిజాత్యాతిశయ సూచనద్వారా భర్తృచిత్త రంజనాభిప్రాయకం। పరిచిక్షేప- నిరాచకార। ఆభిజాత్యస్యోచిత ధర్మనిర్వహణైక పరత్వాదిరూప సుచరిత ప్రతిపాదనముఖేన భర్తారం ప్రీతివిశేషావిష్కరణపూర్వకం లఘూచకారేతి భావః॥

తా॥ "ఉత్తమసం" గొప్ప తమోగుణముతో గూడిన. తమోగుణముతో గూడినవాడై అనిష్టమునకు కారణమైన దానిని గూడ లెక్కింపక, తాను చేయదలచినదానిని తప్పక నిర్వహింపవలెనను నిశ్చయరూపమయిన పట్టుదలతో గూడిన వాడని యర్థము. 'ప్రణయాత్' ప్రేమతో. "అభిమానాచ్చ" త న్ననుసరించి (వనమునకు) వెళ్లుట యనెడు యిష్టరూపమయిన వ్రతము భంగము జరుగునని యభిమానముచే. "విపులవక్షసం" విశాలహృదయము గలిగిన బాహ్యశత్రువులనువలె, అంత శ్శత్రువులను జయించుటయందును ధీరహృదయు డనుట. "రాఘవం" రఘుకులమందు పుట్టిన. ఈ విశేషణము తన సత్కుల ప్రసూనతను దెలుపుచు భర్తృచిత్తమును రంజింప జేయుచున్నదను నభిప్రాయమును సూచించును. 'తం' ఆ శ్రీరాముని 'సా' ఆసీత "పరిచిక్షేప" నిరాకరించెను. సత్కులప్రసూనతకు దగునట్లుగ ధర్మమును నిర్వహించుట మున్నగు సుచరిత ములను ప్రతిపాదించుచు, భర్తపై ప్రీతివిశేషమును బ్రకటించుచు నాతని చులకన జేసెనని భావము.

స 30. శ్లో॥ 3. కిం త్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః । రామజామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం॥

వ్యా॥ వైదేహః- తద్దేశ చక్రవర్తీ । మిథిలాధిపః- సర్వదేశ ప్రసిద్ధనగరాభిజనస్సన్-శ్రవణమాత్రేణైవ తత్ప్రభుతయా సర్వవిదితః । మేపితా- మత్పోషకః । పురుషవిగ్రహం- పురుషస్య ఉత్తమపురుషస్య సకలసాముద్రికలక్షణయుక్తో యో

విగ్రహః- ఆకృతిః- తద్విశిష్టం- తాదృశం। త్వా జామాతరం- మద్ధర్మిక జాయాత్వనిర్వాహకం- జాయాం మానయతి- పూజయతీత్యర్థే జాయాభీష్టసాధకం। ప్రాప్య- నిర్ధనో మహానిధిమివ దైవవశా ల్లబ్ధ్వా । స్త్రియం- మాం కి మనున్యత- కిమ స్యావికృత ముదర్కం భవే దిత్యాలోచితవా న్కిం-నాలోచయు తైవేత్యర్థః । విదేహచక్రవర్తీత్యాదినా జగత్ప్రసిద్ధ కీర్తి విశిష్ట పోషణమాత్రేణైవ పితృత్వ వ్యపదేశే జనక స్స్వప్రతిజ్ఞాతార్థ నిర్వాహణసమర్థస్యాపి వరస్య చిరమప్యలాభేనాపమశోభిత స్తన్నివృత్తిం ప్రతీక్షమాణ స్స్వపుణ్యప్రభావా ద్దర్శనమాత్రే ణైవాభిరామం సకలపురుషలక్షణయుక్తం త్వాం మత్పతిత్వ సాధకం లబ్ధ్వా తావతా కృతార్థం మన్యమాన స్త్స్త్రియా మమ భావ్యనర్థనివారణోపాయం నాలోచితవాన్- అత స్త్వ మేవ మదీయ యావదభీష్టసిద్ధి మాపాదయేతి భావః । యద్వా- దంపత్యో రన్యతరలక్షణానాం తదుభయఫలదాయిత్వనిశ్చయేన తదీయ శుభలక్షణఫలం మమాపి స్యాదితి స్త్రియం మాం పృథ జ్ఞాలోచితవా నితి భావః । అథవా- ఏతాదృశం పతిం లబ్ధవత్యా అస్యాః కి న్నామ దుర్లభ మితి మదీయ భావ్యనర్థనివృత్త్యాలోచనాయా ఏవావసరో నాభూ దితి భావః । అత స్సర్వథా త్వ మేవ శరణం మమేతి ప్రణయోక్తి స్సూచ్యతే । అన్యథా చ- పురుషవిగ్రహం- కామజేతృత్వేన- పురుషత్వాభిమానా దతిధీరం మన్యమానే నేశ్వరేణ విగ్రహః- విరుద్ధాభినివేశ స్తదభిమానం పరిహరామీత్యేవం రూపో యస్య- అత

ఏవ స్త్రీయం-స్త్రీరూపధారిణం- త్వాం జామాతరం ప్రాప్య-వై దేహ త్వాది గుణయుక్తో మే పితా అమన్యత కిం- న తు తతః పూర్వం । ఈశ్వరస్యైవ మత్పితురపి దేహాది భ్రమశూన్యత్వేన మహానహ మిత్యభిమానం నిరస్య స్వేష్టసిధ్యనంతరం "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" ఇతి స్వప్రతిజ్ఞానుసారేణ స్వమహత్వ ప్రబోధ మకార్షీః కి మిత్యర్థః । అత్రో మామప్యేవ వంచయితు మిచ్ఛసి కి మితి భావః । "ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వ భూతానా" మిత్యాదినా సర్వేశ్వరత్వేన ప్రసిద్ధం మహాపురుషమపి తదభిమాన నివృత్తిపూర్వకం మోహయత స్తవ, మిథిలాధిపత్వాది పరిచ్ఛిన్న ప్రాభవోపేతః మమ పితా కియా నితి భావః । ఏతేన సర్వాభిమాననివృత్త్యా శరణాగతి రేవ భగవ త్ప్రసాద హేతు రితి సూచ్యతే । యద్వా- వై దేహః- తద్దేశప్రభుస్సన్- మిథిలాధిపః- రాజధానీవిశేషనివాసీ- మేపితా- పోషకః- పురుష విగ్రహం- పురుషస్య "సహస్రశీర్షాపురుషః" ఇత్యాది శ్రుత్యుక్త విరాట్పురుషస్య విగ్రహఇ- ఆకారః యస్య- తం- త్వాం- ప్రాప్య "ఆప్నోతేర్గత్యర్థత్వా" దతిథిత్వేన జ్ఞాత్వేత్యర్థః । రాం- రమతే సర్వత్ర ఆవరణశక్త్యాది రూపేణేతి-తాదృశీం రమతే-రాణాదికో డప్రత్యయః- పంచదశీమంత్రభాష్యే- 'క'శబ్దస్య 'కమ్' ధాతు ప్రకృతిక 'డ' ప్రత్యయాంతత్వం- నిరుచ్యబ్రహ్మపరత్వవ్యవస్థాపనాత్ -బీజకోశే "రమ్" ఇత్యస్య దీప్త్యర్థకత్వేన అగ్నిదేవతాకత్వమ ప్యనన్వయేన రీత్యా వ్యాఖ్యాతం । అజాం- అయోనిజాం

స్త్రియం మా మిత్యర్థః । ఆతరం- నదీతరణ సాధనం ద్రవ్యం । అమన్యత కిం- అతిథిమర్యాదయా స్వీయ రాజ్యాదిగౌరవవశేన మత్పితా మాం అయోనిజా మపి తాత్కాలిక పూజాద్రవ్య త్వేన తవార్పితవాన్ కిం। న తథా- కింతు నైరంతర్యేణ తదీ యయావత్సుఖదుఃఖాదిభాగితయా నిశ్చిత్య సర్వకాలానపాయి ద్రవ్యతయైన అర్పితవా నితి భావః। వస్తుతస్తు। విగ్రహమాత్రేణ పురుషదవభాసమానం త్వాం జామాతరం ప్రాప్య। స్త్రియం- త్రిపురసుందరీం- అమన్యత కిం? వైదేహః దేహాద్యభిమాన శూన్యతయా మాయానియంతాపి (మిథిలాధిపశబ్దేనసిద్ధః) మే పితా త్వన్మూలప్రకృతిం త్రిపురసుందరీం నాజానాదేవేత్యర్థః । అత ఏవ "అశేషజనమోహినీ" మిత్యాదినా తద్ధ్యానక్రమ ఉపాసకానా మితి భావః॥

తా॥ "వైదేహః' విదేహ దేశములకు చక్రవర్తి. 'మిథి లాధిపః' సర్వదేశములయందు ప్రసిద్ధినందిన మిథిల యను పట్టణ మభిజనము (పూర్వులుండు ప్రదేశము) గా గలవాడు. జనకు డన్నంతనే మిథిలాధిపు డని యందఱిచే నెఱుగబడువా డని భావము. "మే పితా" నాకు పోషకుడగు జనకుడు "పురుషవిగ్రహం" పురుషునకుండవలసిన సకలసాముద్రిక లక్ష ణములతో నిండిన యాకారముగల "త్వాం" నిన్నును "జామాతరం" నా జాయాత్వమును నిర్వహించువానినిగ. "జామాతృ" శబ్దమునకు "జాయాం" భార్యను "మానయతీ" పూజించువాడు అను నర్థము. స్వీకరించిన భార్య యభీష్టమును

సాధించువాడని భావము. "ప్రాప్య" ధనహీనుడు మహానిధిని వలె పొంది "స్త్రియం మాం కిమమన్యత" స్త్రీయగు నన్నును గూర్చి ఆలోచించినాడా యేమి? ఈమె భావిఫలము వికృతముగ పరిణమించునేమో యని యాలోచించినాడా? ఆలోచించ లేదనియే యర్థము. "విదేహచక్రవర్తి" మున్నగువిశేషగుణములచే జగత్ప్రసిద్ధమైన కీర్తితో గూడి పోషణమాత్రముననే తండ్రి యనెడి వ్యవహారము గలిగిన జనకుడు తాను ప్రతిజ్ఞ చేసిన విషయమును (శివధనుర్భంగము) సమర్థింపగలిగిన వరుని చిరకాలమునకు లభింపకపోవుటచే, అపయశస్సువలన భీతిజెందినవాడై, దానిని మరలించుకొనుటకు నిరీక్షించుచు, తన పుణ్యప్రభావముచే, చూచినంతమాత్రముననే మనోహరమైన స్వరూపుడవును, సమస్తమైన పురుషలక్షణములతో గూడిన వాడవు నగు నిన్ను నాకు భర్తగా సిద్ధింపచేసికొని అంతమాత్రముననే కృతకృత్యుడనని భావించి, స్త్రీ యగు నాకు రాబోవు అనర్థములను నివారించుట కుపాయము నాలోచింపడయ్యె. కావున నీవే నా యభీష్టముల నన్నిటిని సమకూర్పుమని భావము.

లేదా, దంపతులలో నొకరు లక్షణవంతులైనను, శుభలక్షణము లిద్దరకు ఫలము నీయగలవను నమ్మకముతో, భర్త శుభలక్షణముల ఫలము నాకును కలుగునని స్త్రీనైన నన్నును గూర్చి (జనకుడు) వేఱుగ నాలోచింప లేదని భావము.

లేదా, ఇట్టి భర్తను బొందిన యీమెకు దుర్లభమైన దేమున్నదని నాకు వాటిల్లెడు అనర్థముల నివారించవలెనను ఆలోచనకు అవసరమే లేకపోయె నని భావము.

కావున సర్వవిధముల నీవే నాకు శరణమని ప్రణయోక్తి సూచింపబడుచున్నది.

మఱియొకవిధమునను:—

"పురుషవిగ్రహం" పురుషునితో విరోధము గలవాడు. మన్మథుని జయించుటచే తన్ను మహాధీరునిగా దలచుచున్న ఈశ్వరునితో "నీ యభిమానమును పరిహరింతు" నని విరుద్ధమైన పట్టుదలతోఁగూడిన రూపముగలవాడు. కావుననే 'స్త్రియం' స్త్రీరూపమును (జగన్మోహినీరూపమును) ధరించిన "త్వాం జామాతరం ప్రాప్య" నిన్నల్లునిగా బొంది, వై దేహత్వాది గుణములతో గూడిన నా తండ్రి "అమన్యతకిం" తలచినాడా యేమి? ఈశ్వరునివలె నా తండ్రియును, దేహాదులయందలి భ్రాంతి లేనివాడు గావున, "నేను గొప్పవాడ" నను నభిమానమును వదలి, తన యిష్టము సిద్ధించిన పిమ్మట "సత్త్వరజస్తమోగుణాత్మకమైన యీ నా మాయ నతిక్రమింప శక్యము గాదు" అని భగవద్గీతలో శ్రీకృష్ణభగవానులు ప్రతిజ్ఞ చేసిన రీతిని తన మహత్త్వమును చాటినాడా యేమి? యని అర్థము. కావున నీవు నన్నును నట్లే వంచించుట కిచ్చగించుచుంటివా యేమి? యని భావము.

"సర్వవిద్యల కధిష్ఠాన స్వరూపుడు, సర్వభూతములకు నియంత" మున్నగు వాక్యములచే, సర్వేశ్వరు డని ప్రశస్తి వడసిన మహాపురుషునిఁగూడ, ఆ యభిమానము మరలునట్లు మోహింపజేసిన నీవు, మిథిలాధిపత్యము మున్నగు పరిమితమైన

ప్రాభవముతో గూడిన నాతండ్రిని మోహింపజేయుట యెంత టిది యని భావము. దీనిచే సర్వాభిమానములను వదలి, నిన్ను శరణు జొచ్చుటయే నీ యనుగ్రహపాత్రతకు హేతువని సూచిత మగుచున్నది.

లేదా, 'వైదేహః' విదేహదేశమున కధిపతియగును, 'మిథిలాధిపః' రాజధానియైన మిథిలాపట్టణ నివాసియగు 'మేపితా' నన్ను బోషించిన జనకుడు 'పురుషవిగ్రహం' 'సహస్రశిరములు గలవాడు పురుషుడు' మున్నగు వాక్యములచే శ్రుతులయందు జెప్పబడిన విరాట్పురుషుని యాకారముగల "త్వాంప్రాప్య" నిన్ను బొంది, అనగా నిన్ను దెలిసికొని. "ఆప్" అను ధాతువు గత్యర్థకము గాన, గత్యర్థక ధాతువులు జ్ఞానార్థ కములుగూడ నగును గాన, 'ప్రాప్య' అనగా తెలిసికొని, యను నర్థ మిచ్చుట గ్రహింపనగును. "రామజామ్" "రామ్" అంతటను ఆవరణాదిశక్తిరూపమున రమించునదియు, "అజాం" అయోని జయు, "స్త్రియం" స్త్రీయ నగు, 'మాం' నన్ను "ఆతరం" నదిని దాటుటకు సాధనమైన ద్రవ్యమునుగా "అమన్యతకిం" తలచెనా యేమి? 'రామ్' అనునది 'రమ్' ధాతువుకంటె ఉణాది సూత్రము చే 'డ' ప్రత్యయము చేయగా సిద్ధించునది. పంచదశీమంత్రభాష్యమునందు 'క' శబ్దమును "కమ్" ధాతువు కంటె "డ" ప్రత్యచేయగా సిద్ధించిన రూపమును గ్రహించి, పరబ్రహ్మపరముగ నర్థమును వ్యవస్థ చేసినారు. గాన నిక్కడను అట్టిశబ్దముగనే గ్రహించునది. ఇటులనే బీజకోశమునందు 'రమ్'

అను ధాతువునకు దీప్తియను నర్థమును గ్రహించి, అగ్ని దేవతాక మగుటయు నీరీతిగనే వ్యాఖ్యానము చేయబడినది. అతిథిమర్యాద చేతను, తనకుండెడి రాజ్యాదిగౌరవవశమునను, అయోనిజ నగు నన్ను, తాత్కాలికమగు పూజాద్రవ్యమునుగ నర్పించినాడా యేమి? అట్లుకాదు- నిరంతరము నీకు గల్గెడి సమస్త సుఖసుఖ ములలో భాగము నందదగిన దానినిగా నిశ్చయించి, సర్వకాల ములయందు వెడబాయని ద్రవ్యమునుగానే యర్పించెనని భావము.

వాస్తవముగ ఆకారమాత్రముచే పురుషునివలె గన్పట్టు నట్టి నిన్ను అల్లునిగ బొంది, త్రిపురసుందరీ స్వరూపముగ దలచినాడా? 'వైదేహః' యనుటచే, దేహాద్యభిమానరూ న్యుడై మాయను జయించిన వాడయినను, మిథిలాధిపుడని ప్రసిద్ధిజెందిన నా తండ్రి నీ మూలప్రకృతియగు త్రిపురసుందరీ స్వరూపము నెరుగనేలేదు. కావుననే, 'సమస్తజనులను మోహింపజేయునది' యను క్రమమున ఉపాసకు లామెను ధ్యానింతు రని భావము.

స 30. శ్లో॥ 4. అనృతం బత లోకోఽయమజ్ఞానాద్యద్ధి వక్ష్యతి।
తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే॥

వ్యా॥ త్వద్భాగ్యే నైవ త్వాం వనం నేతుం మమ బుద్ధి ర్నాసీ దితి జానీహి ఇత్యత్రాహ । అజ్ఞానాత్ - వస్తుగత తత్త్వ జ్ఞానాభావాత్ - తపతి దివాకర ఇవ- గ్రీష్మ మధ్యాహ్నభా స్కర ఇవ । రామే పరం సుస్సహం తేజః నాస్తి । కింతు- కాలాంతరీయ సూర్యతేజ ఏవ సాధారణ క్షత్రియత్వాత్ । అన్య

థా వనం గచ్ఛేః భార్యాం కథం జిహ్యా దితి సాధారణో జనః వక్ష్యతి యది। తవైకస్యైవ వనగమనే ఈదృశప్రవాదో భవిష్యతి యది । త దనృతం- అవిద్యమానస్వరూపబోధనపరం లోకవచనం। బత- మమ ఖేదావహ మిత్యర్థః। వనం గతస్య తవ తద్విషయస్యాస్య లోకాపవాదస్య శ్రుతిగోచరత్వాభావేన ఖేదానావహత్వేఽపి గృహస్థితాయా మమ నిరంతరజనశ్రుతేరైన్యత్యే నాత్యంతఖేదావహత్వ మిత్యర్థః। యశస్వినాం లోకాపవాదభీతిః "సంభావితస్య చా కీర్తి ర్మరణా దతిరిచ్యత" ఇతి న్యాయే నావశ్యకీతి భావః । ఏవంచ ఈదృశమసహ ఖేదానుభవాపేక్షయా గృహస్థితాయా మమ త్వనుక్త వనగమనక్లేశానుభవ ఏవ లఘీయా నితి సీతయా సూచ్యత ఇతి లబ్ధం॥

తా। నీ భాగ్యముచేతనే నిన్ను వనమునకు దీసికొని పోవుటకు నాకు బుద్ధి కలుగలేదని తెలిసికొను మనుచున్నాను. "అజ్ఞానాత్" వస్తువునందలి యథార్థజ్ఞానము లేక పోవుటచే, "తపతి దివాకరఇవ" గ్రీష్మర్తువున మధ్యందిన సూర్యునివలె. 'నామేపరం దుస్సహం తేజః నాస్తి'' రాముని యందు సహింప శక్యముగాని తేజస్సు లేదు. సాధారణక్షత్రియుడు గాన కాలాంతరమం దుండు సూర్యుని తేజస్సు మాత్రమేగలదు. అట్లు కానిచో, వనమున కేగుచు భార్య నెట్లు వదలునని, "సాధారణోజనః వక్ష్యతి యది'' సాధారణమైన జనుడు పలికినచో, నీ వొక్కడవే వనమునకు వెడలిన నిట్టి ప్రవాదము గలిగినచో,

"తదనృతం" లేని స్వరూపమును బోధించు నాలోకవాక్యము "బత" నాకు ఖేదావహమే యగునని యర్థము.

వనమున కేగిన నీకు, ఆ వనవాసమునుగూర్చిన లోకమందలి యీ యపవాదము వినబడదు గాన ఖేదమును గలిగింపకున్నను, ఇంటనున్న నాకు జను లనుకొనెడు మాటలు వినుట తప్పదు గాన, నా ప్రసంగములు మిక్కిలి ఖేదావహములే యగునని యర్థము.

"గౌరవముతో గూడినవానికి అపకీర్తి మరణముకంటె నధికఖేదావహ మగును" అను సూక్తిచొప్పున యశస్కాములకు లోకాపవాదవలన భీతి యుండక తప్పదు. గృహమున నుండి, ఇట్టి దుస్సహమైన ఖేదము ననుభవించుట కంటె నీవు చెప్పిన గతిని వనమునందు కలిగెడి క్లేశము ననుభవించుటయే సీతకు మిక్కిలి చులకన యని సూచింపబడు చున్నది.

స 30. శ్లో॥ 5. కింహికృత్వావిషణ్ణస్త్వం కుతోవాభయమస్తితే।
యత్పరిత్యక్తుకామ స్త్వం మామనన్యపరాయణాం॥

వ్యా॥ మత్పరిత్యాగే వక్ష్యమాణయో ర్ద్వయో రన్యతరం కారణం స్యాత్ - తత్రాద్యం- మత్సన్నిధానే (త్వయా) మన స్సంకల్పితస్య నియమస్య భంగో భవే దితి విషాదః। ద్వితీయంతు- ప్రబలతమా దన్యస్మా న్మద్రక్షా । భయం వేతి సాధిక్షేపం పృచ్ఛతి॥ కిం హి కృత్వా- మనసీతి శేషః । వనవాస దీక్షిత స్త్వం నియమం సంకల్పితవా నసి- కిం । కుతశ్చి ద్వా భయం కిమితి । అన్యథా అనన్యపరాయణాం- త్వదేకాశ్రయాం-

కథం పరిత్యక్తుకామ స్స్యాః సతా మధర్మోయం యత్సర్వథా స్వాశ్రితస్య పరిత్యాగ ఇతి శరణాగతరక్షణాదిదృఢవ్రతస్య తవ కిము వక్తవ్య మితి భావః । యద్వా "స్మితపూర్వాభిభాషీచే" త్యాది సంతత ప్రసాదయుక్తస్య తవేదానీం విషాద ప్రసంగః మహత్తరాకార్యకరణహేతుక ఇతి వా భావః॥

తా॥ నన్ను విడచుటకు నీరెండే కారణములు కావచ్చును. అందొకటి నా సన్నిధానమున నీవు మనమున సంకల్పించిన నియమమునకు భంగము వాటిల్లుట. రెండవది మిక్కిలి ప్రబలమైన యితరులనుండి నన్ను రక్షింపవలెనను భయము. వీనిని బురస్కరించుకొనియే నన్ను విడనాడ గోరుచుంటివా? యని సీత సాధిక్షేపముగ నడుగుచున్నది.

"కిం హి కృత్వా" ఏమి మనస్సునం దుంచుకొని, అనగా వనవాసదీక్షితుడవైన నీవు నియమమును సంకల్పించితివా? దేనినుండియే నా భయమా? లేకున్నచో, "అనన్యపరాయణాం" నిన్నే నమ్ముకొని యున్న నన్ను "కథం పరిత్యక్తు కామస్స్యాః" ఎట్లు విడిచిపెట్టుట కిచ్చగింతువు. సర్వవిధముల తమ్ము నాశ్రయించినవారిని విడచుట సత్పురుషుల కధర్మ మనునప్పుడు శరణాగతరక్షణము ముఖ్యగువానిని వ్రతములుగ ధరించిన నీ విషయమున వేరే చెప్పనేల?

లేదా, "శ్రీరాముడు చిరునవ్వు ముందు గన్పట్టునట్లు మాటాడువాడు" మున్నగు పద్ధతుల నెల్లపుడు ప్రసన్నతతో

గూడిన నీకు ఇప్పుడు దుఃఖప్రసంగము గోష్పదగు అకార్యకరణ మునకు గారణమని భావము.

స 30. శ్లో॥ 6. ద్యుమత్సేనసుతం వీర సత్యవంత మనువ్రతాం ।
సావిత్రీ మివ మాం విద్ధి త్వ మాత్మవశవర్తినీం॥

వ్యా॥ పితృసేవారూప ధర్మప్రవణస్య తవ క్వాప్యనిష్ట మేవ న సంభవతి । తదపి సతీధర్మ వ్రతాచరణశీలాయా మమ సహ గమనం శ్రేయోఽతి శయావహ మేవ జానీహీత్యభి ప్రేత్యాహ । ద్యుమత్సేనసుత మిత్యాది- సావిత్రీ హి స్వపతిం సత్యవంతం నారదముఖా దత్యల్పాయుషం నిశ్చిత్య తద్దోష శాంత్యై వనం గతం తం స్వయమ ప్యనుగమ్య దీర్ఘాయుషం చకారేతి భారతకథాత్రానుసంధేయా॥

తా॥ పితృసేవారూపమయిన ధర్మమునందు నిమగ్నుడ వైన నీ కెక్కడను అనిష్టమే సంభవించదు. అందును, పతివ్రతా ధర్మమును పాలించ వలెనను స్వభావము గల నేనుకూడ వచ్చుట మిక్కిలి శ్రేయస్సునే కలుగజేయునని సీత తెలుపుచున్నది. ద్యుమత్సేనపుత్రుడగు సత్యవంతు ననుసరించుటయే వ్రతము గా గల సావిత్రినివలె నన్ను నీకు వశవర్తినిగా భావింపుము. సావిత్రి నారదునివలన తన భర్త అల్పాయుర్దాయువంతుడని విని తెలిసికొని, ఆ దోషమును మరలింపజేయుటకై అతడు వనమునకు వెడలినపుడు తానును వెంబడించి, దీర్ఘాయుర్దాయ వంతునిగా జేసె నను కథ యిక్కడ కూర్చుకొన దగినది.

స 30. శ్లో॥ 9. యస్య పథ్యం చరామార్థ యస్య చార్థేఽవరుధ్యసే। త్వం తస్య భవవశ్యశ్చ విధేయశ్చ సదానఘ।

వ్యా॥ యస్య సుకృతస్య- స్వీయ పితృవాక్య ప్రతిపాలన సాధ్యస్య। అర్థే ప్రయోజనే విషయే। పథ్యం-హితం। అర్థ-బ్రవీషి। యస్యార్థే చ అవరుధ్యసే- నియమ్యసే। శాస్త్రేణేతి శేషః। తస్య- సుకృతఫలస్య తత్ప్రమాణభూతశాస్త్రస్య చ। వశ్యః- వశం గతః తత్ర శ్రద్ధాళుః। విధేయశ్చ- తదుక్తమార్గానుబంధీ చ సదా భవ- తత్ర ప్రమాదం మాకార్షీ రిత్యర్థః। తాదృశ ఫలాభిషంగబోధకశాస్త్రానువిధాయిత్వం మమ సర్వ దేష్టమేవ. అతస్త్వాం కౌసల్యాదివ త్వేష్ణా వనవాసాన్న నియచ్ఛామి। ధర్మప్రవృత్తి ప్రతిబంధస్య నింద్యత్వా దితి భావః। యస్య యదా యో ధర్మః తదాచరణేన చ యత్సుకృతం తత్సాధ్యం చ యత్ఫలం తత్ప్రమాణతయా చ శాస్త్రం యది ష్టం తత్సర్వం సతా గ్రాహ్యమేవం- స తు, తత్కాలావచ్ఛిన్న క్లేశ మాలోచ్య నిషేధ్య మత స్తత్ప్రవృత్తి ర్మే సమ్మతై వేత్యాకూతం। పరంతు- తాదృశేన త్వయా మత్ప్రవృత్తి రపి న నివార్యే త్యాహ॥

తా॥ "యస్య అర్థే పథ్యమార్థ" నీ తండ్రి వాక్యమును పరిపాలించుట యనెడి యే ప్రయోజనవిషయమై ప్రియమును బలికితివో, "యస్యార్థే నియమ్యసే" దేనికొఱకై శాస్త్రముచే నియమింపబడు చుంటివో, "తస్య" ఆ పుణ్యఫలమునకు, దానికి ప్రమాణమైన శాస్త్రమునకు "వశః" వశ్యుడవై, అనగా నందు

శ్రద్ధాళుడవై 'విధేశ్చ' అందు చెప్పబడిన మార్గమునను సంబం ధించిన వాడవై "సదాభవ" ఎల్లపుడును కమ్ము. ఆవిషయమున ప్రమాదమును నందకుమని యర్థము.

అట్టి ఫలప్రాప్తిని బోధించు శాస్త్రము ననుసరించుట నాకు సర్వవిధముల నిష్టమే. కావుననే కౌసల్య మున్నగువారి వలె నిన్ను వనవాసమునుండి నిరోధించుట లేదు. ధర్మప్రవర్త నకు ప్రతిబంధమును కలుగజేయుట నింద్యమని భావము. ఎవని కేసమయమున నేది ధర్మమో, దాని నాచరించుటచే నే పుణ్యము గలుగునో, అట్టి పుణ్యముచే సాధింపదగిన ఫల మేది కలదో, దానికి ప్రమాణభూతమైన శాస్త్ర మేది యుండునో, అది యంతయు, సత్పురుషులకు మన్నింపదగినదియే. ఆకాలము నకు తటస్థించిన క్లేశముల నాలోచించి నిషేధించుట తగదు. కావున నీ ప్రవృత్తి నాకు సమ్మతమే యని సీత యభిప్రాయము. అట్టి నీవు నా ప్రవృత్తినిగూడ నివారింపకూడదని తెలుపు చున్నది.

స 30. శ్లో॥ 10. సమామనాదాయ వనం న త్వం ప్రస్థాతు మర్హసి । తపో వా యదివారణ్యం స్వర్గో వా మేసహ త్వయా॥

వ్యా॥ సః - శాస్త్రప్రామాణ్యధియా వనవాసైక నిర్భర స్త్వం । మాం మనాదాయ- త్యక్త్వా । ప్రస్థాతుం నార్హసి- నాధికరోషి. । మదీయధర్మప్రవృత్తివిఘాతుకస్య మద్వినాభూత స్య చ వనగమనే అధికార ఏవ నాస్తి- తద్విఘాతస్య పత్నీసాహి త్యాభావస్య చ తత్ప్రతిబంధకత్వా దిత్యర్థః । ననుపస్తునామ

త్వదుక్తరీత్యా మమ ధర్మప్రవృత్త్యా వనధికారః- పరంతు త్వయి కరుణయా తత్పరిత్యాగః। "మైత్రీ కరుణా ముదితా ఉపేక్షే"తి ధర్మచతుష్టయస్య సత్స్వభావా దిత్యత ఆహ । తపోవేత్యాది । తపః- అనశనాదిపుణ్యకార్యం । అరణ్యం- తద్వాసప్రయుక్త క్లేశః । త్వయా సహ- స్థితాయా ఇతి శేషః । స్వర్గో వా- స్వర్గ ఏవ విజాతీయ సుఖాతిశయ ఏవ- న తు కించిదపి పీడావహం। అతో మద్విషయే కరుణాయా అనవకాశ ఇతి భావః । యత్తు "యస్య పథ్యం చే"తి శ్లోకస్య మాతరం శుశ్రూషస్వేతి యదుక్తం తత్ర పరిహారమాహేతి ప్రతీక మాదాయ యస్యేత్యస్య మాతృజనస్యే త్యర్థపరత్వకల్పనద్వారా తత్సంబంధి హితాచరణాదికం మమ న సమ్మతం- కింతు త్వమేవ తదనుతిష్ఠ- అహం తు త్వా మనుగచ్ఛామీత్యాద్యాశయకత్వబోధనం తత్పక్షే అవరుధ్యసే ఇత్యస్య నివారయసే ఇత్యర్థవర్ణనం చ- యద్వేతి వికల్పాంతరేణ యస్యేత్యస్య మమేత్యర్థపరత్వకల్పనం- పక్షాంతరే భరతస్యేత్యర్థపరత్వకల్పనం చ- తత్సర్వ మయుక్తం। ఆద్యకల్పే భర్తృసాహిత్యస్య సతీధర్మత్వేఽపి తదుక్తవిషయానాదరబోధనస్య సతీధర్మత్వాభావాత్ । అన్యథా గృహైకవసతే రపి పత్యు రిష్టస్య స్వమాతృశుశ్రూషాదే రపి తత్సంబంధ నైయత్యప్రతిపాదనద్వారా సతీభిః పరిహార్యత్వాపత్తేః। ఉత్తరవికల్పద్వయే తు, స్వవిషయే వా, భరతవిషయే వా, స్వభర్తృవిధేయత్వాది బోధనం, తు తస్యా స్సుతరా మనుచితం। "విషం భుంక్ష్వే"త్యా"ది వాక్యవ దర్థాంతర నిషేధపర మేవే

దం వాక్యం- నతు స్వార్థవిధితాత్పర్యక మతో నోక్తదోష ఇతి వాచ్యం। దృష్టాంతే శత్రుగృహభోజనాదే స్సర్వావిష్టత్వ(ధా వ్యేన "మాచాస్య గృహే భుఞ్జ్థాః" ఇతి వాక్యశేషసా మర్థ్యా త్తన్నిషేధతాత్పర్యకల్పనస్య ఆవశ్యకత్వేఽపి ప్రకృతే శ్వశ్రూ శుశ్రూషాదే స్సతీమాత్రధర్మత్వేన నిశ్చితస్య పత్యభ్య నుజ్ఞాభావేఽపి స్త్రీమాత్రకర్తవ్యస్య నిషేధతాత్పర్యకల్పనా యా అసామంజస్యాత్ । అవరుధ్యసే ఇత్యస్య నివారయసే క్లిశ్యసీతిచ కర్తృప్రత్యయాంతప్రతిపదోపాదానంతు న సమ్యక్। రుధధాతో రనూపసృష్టస్యైవ కామార్థే "అనోరుధకామే" ఇతి గణసూత్రేణ శ్యన్విధానేనాస్య రూపస్య కర్తృప్రత్యయేఽ సాధుత్వాత్ । దివాదే ర్గణభేదే నాకృతిగణత్వేఽపి తదఘటిత స్యైవ శిష్టప్రయుక్త స్యాన్యథా వక్తు మశక్యస్య తద్గణే గ్రహణ స్యౌచిత్యా దిత్యలం।

తా॥ "సః" శాస్త్రమందలి ప్రామాణ్యబుద్ధిచే వనవా సమునందే నిర్భరుడవైన నీవు, "మామనాదాయ" నన్ను వదలి 'ప్రస్థాతుం నార్హసి' ప్రయాణము చేయతగవు. నా ధర్మప్రవృ త్తికి విఘాతకరముగ నన్ను వదలిన నీకు వనమున కేగుట కధి కారమేలేదు. ధర్మవిఘాతమును, భార్య దగ్గర లేకుండుటయును, వనగమనమునకు ప్రతిబంధకమని భావము.

నీవు చెప్పినరీతిని ధర్మప్రవృత్తియందు నా కధికారము లేకపోవుగాక. నీయందలి కరుణచేత దానిని విడిచెదను. "మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష" మున్నగు వాక్యములచే

ధర్మవతుష్టయము సత్స్వభావ మగునందువేమో ? 'తపోవా' భక్షింపనుండుట యున్నగు పుణ్యకార్యమును, "అరణ్యం" అరణ్యమందు వసించుటవలని క్లేశము, 'త్వయాసహ' నీతో కూడియున్న నాకు, 'స్వర్గోవా' స్వర్గమే. విలక్షణమైన సుఖాతి శయమునకు సాధనమే. ఏమాత్రమ యినను బాధను కలిగించు నది కాదు. కావున నావిషయమున కరుణ కవకాశమే లేదని భావము.

కొందఱు "యస్యాపథ్యంచ" (స 30. శ్లో॥ 9.) అను శ్లోకమునకు తల్లిని శుశ్రూష జేయుచుండుమని చెప్పినదానికి పరిహారమును దెలుపుచున్నదని ప్రతీకమును గ్రహించి, 'యస్య' అను పదమునకు "మాతృజనమునకు" అను నర్థమును కల్పించి, "వారికి సంబంధించిన హితవు నాచరించుట నాకు సమ్మతము గాదు. కావున నది నీవే చేయుము. నేను నిన్నునే అనుసరించె ద" నను నభిప్రాయమును వర్ణించి, ఆ పక్షమున "అవరుధ్యసే" అను పదమునకు "నివారించెదవు" అను నర్థమును చెప్పి, పక్షాం తరమున "యస్య" అను పదమునకు "నాకు" అను నర్థమును కల్పించి, వేఱొక పక్షమున 'భరతునకు' అను నర్థమును గల్పించి, సమన్వయము చేసిరి. ఇది యంతయు యుక్తముగ లేదు.

మొదటిపక్షమున భర్తదగ్గర నుండుట పతివ్రతకు ధర్మమే యైనను, భర్త చెప్పిన విషయము నాచరింప కుండుట మాత్రము సతీధర్మము కానేరదు. లేకున్నచో ఇంట నున్నను భర్త కభిమతమైన మాతృశుశ్రూషాదికమున గూడ ఆతని

సాన్నిధ్య మెల్లప్పుడు కావలసియుండును గాన, పతివ్రతలు పరిహ రింపవలసి వచ్చును. తరువాతి రెండుపక్షములందును తన విష యమునగాని భరతుని విషయమునగాని తన భర్తకు విధేయ తను బోధించుట ఆమెకు మిక్కిలి యనుచితమే యగును. "విషమును భుజింపుము" మున్నగు వాక్యములవలె, 'ఇతర పదార్థములను తినకుము' అని చెప్పుటయం దెట్టి తాత్పర్యము గలదో, అటులనే యీ వాక్యములును అర్థాంతరముల బోధించు నవి గాన దోష ముండ దనరాదు. దృష్టాంత వాక్యమునకు "ఈతని గృహమందన్నమాత్రము భుజింపకుము'' అను వాక్యము నకు శేషముండుటచే మఱియొక అర్థమును కల్పించుట ఆవశ్యక మయినను ప్రకృతమున పతివ్రతామాత్రమునకు ధర్మమని నిశ్చయింపబడినట్టియు, భర్త యభ్యనుజ్ఞ లేకున్నను స్త్రీ మాత్రమునకు చేయదగినదియు నగు అత్తమామల శుశ్రూష మున్నగుదానికి అర్థాంతరమును గల్పించుట సమంజసము కానేరదు.

'అవరుధ్యసే' అను క్రియకు "నివారించుచున్నావు" "క్లేశపెట్టుచున్నావు" అని కర్తృత్వమును తెలుపుట సరిగాదు. "అనోరుధకామే" అను గణసూత్రముచే నిచట 'శ్యన్' ప్రత్య యమును విధించుటచే నీ రూపమునకు కర్తృప్రత్యయమును జేసినచో అసాధుత్వమే సిద్ధించును. దివాదిగణమునకు మతభేద ముచే ఆకృతిగణత్వము నంగీకరించినను, ఆ గణమునకు చెంద నిదే శిష్టులచే ప్రయోగింపబడినది గాన, వేరొకరీతిని సమర్థింప

శక్యముగాని యీ ధాతువు నాగణమందు గ్రహించుటయే యుచితము.

స 30. శ్లో॥ 29. యత్సృష్టాసి మయా సార్థం వనవాసాయ మైథిలి। న విహాతుం మయా శక్యా కీర్తి రాత్మవతా యథా।

వ్యా॥ ఏతావతా సందర్భేణ త్వ మపి మయా సహ వనవాసాయ సృష్టా- దైవేన నిర్మితాసీ త్యేవా వగమ్యతే। యత్- యస్మాత్కారణాత్ । అతః మయా త్వం విహాతుం న శక్యా- జిహాసు రప్యహం న జహ్యామ్- దైవసంకల్పస్య దుర్వారత్వా దితి భావః । ఆత్మవతా- ధీరచిత్తేన పురుషేణ కీర్తి ర్యథా । ధీరచిత్తో హి ప్రాణభంగేఽపి సత్పథమేవానుసరతి- నతు కాపథం- అత స్తస్య శ్లాఘైవ ఫలతి । అత ఏవ తపోదాన శాంత్యాదినా విశ్వామిత్ర దధీచి ప్రభృతయో యశఃకాయా ఏవా వతస్థిర ఇతి తాత్పర్యం॥

తా॥ ఇంతకు ముందు చెప్పిన సందర్భముచే "యత్ త్వమపి మయాసార్థం వనవాసాయ సృష్టాసి" ఏ కారణమున నీవును నాతో వనమున కేగుటకే సృజింపబడితివో "అతః మయా త్వం విహాతుం శక్యా" ఈ కారణముచే నిన్ను నేవిడిచి పెట్టుటకు శక్యము గాదు. దైవసంకల్ప మనివార్యము గాన విడచి వెళ్ళవలె నను నిచ్ఛ యున్నను నిన్ను నే విడువనని భావము. "ఆత్మవతా కీర్తి ర్యథా" ధీరుడగు పురుషునిచే కీర్తి యెట్లు విడువబడదో యటులనే. ధీరచిత్తుడు ప్రాణాపాయము వాటిల్లినను సన్మార్గమునే యనుసరించును. చెడుమార్గము

నాశ్రయింపడు. కావున నాతనికి శ్లాఘయే ఫలించును. కావుననే తపోదానశాంత్యాదుల బాలించుటచే విశ్వామిత్ర దధీచ్యాదులు కీర్తికాయులై నిలిచియున్నారని భావము.

స 30. శ్లో॥ 31. న ఖల్వహం న గచ్ఛేయం వనం జనకనందిని।
వచనం తన్నయతి మాం పితుస్సత్యోపబృంహితం॥

వ్యా॥ పూర్వశ్లోకే శిష్టధర్మస్య పత్నీసహగమనస్య వానప్రస్థైః పూర్వైరపి కృతత్వేన స్వస్యాప్యపరిత్యాజ్యతోక్త్యా తథాత్వే కాలాంతరేఽపి ధర్మః పాల్యతాం నేదానీమిత్యాక్షేపస్స్యాదితి తన్నివారణాయాహ- నఖల్వహమితి। యద్యయం వనవాసస్స్వేచ్ఛాకల్పితస్స్యాత్తదాఽకాలకృతత్వేన ధర్మత్వం నస్యాత్ - కింతు స్వసత్యపాలనార్థం పిత్రావిహితత్వేన ధర్మోత్తరోఽయం వనవాసో నాతిక్రమణీయః। అత ఏవ 'నఖ' ద్వయప్రయోగ ఇతి భావః॥

తా॥ వెనుకటి శ్లోకమునందు భార్యతోగూడ వనమునకు వెడలుట యనెడి శిష్టుల ధర్మమువలె వానప్రస్థాశ్రమును స్వీకరించిన తన పెద్దలును ఆచరించినదియే గావున, తానుగూడ విడువకూడదనియే తెలుపబడినది. అపక్షమున మఱియొక సమయము గాదను ఆక్షేపమున కీశ్లోకమున సమాధాన మిచ్చుచున్నాడు.

ఈ వనవాసము స్వేచ్ఛాకల్పిత మగుచో అకాలమందాచరింపబడిన దగుటచే ధర్మ మనిపించుకొనను. కాని యిది

తన సత్యమును బాలించుటకు తండ్రిచే విధింపబడినది గాన నీ వనవాసము సర్వోత్తమధర్మము గాన అతిక్రమింప తగనిది. కావుననే "న న" యని రెండు నిషేధార్థక శబ్దములను ప్రయో గించినాడు.

స 34. శ్లో॥ 40. ప్రాప్స్యామి యానద్య గుణా న్కో మే శ్వస్తాన్ ప్రదాస్యతి। అపక్రమణ మేవాత స్సర్వకామై రహం వృణే॥

వ్యా॥ అద్య- అస్మిన్కాలే। యాన్గుణాన్- సర్వాదరణహేతుభూతాన్ సౌశీల్య పితృవవశ్యత్వాదీన్। ప్రాప్స్యామి- లభేయ। తా న్గుణాన్। శ్వః- భవదాజ్ఞయా భోగవాంఛయాఽద్య స్థిత్వా శ్వో గమనోద్యుక్తస్య కః ప్రదాస్యతి- కస్సంపాదయిష్యతి। అతః కారణా త్సర్వకామైః సర్వభోగై స్సహ- సహయుక్త ఇతి తృతీయా- అత్రత్య సకలవస్తువిషయక వాంఛావిశిష్ట ఇత్యర్థః। అపక్రమణ మేవ- పురా ద్బహి ర్గమనమేవ। మయా సహ మదీయ కామా అపి- సర్వవిషయాన్ పరిత్యజంత్విత్యర్థః। వృణే- ప్రార్థయే। నతు త్వదాజ్ఞాతిక్రమణం కుర్యామితి తాత్పర్యం। సకలజన ప్రీతివిషయీభూత రాజ్యపరిత్యాగపూర్వక త్వదీయ సత్యవ్రతపరిపాలనా ర్థ లు మమ గుణాతిశయః। యది త్వదాజ్ఞానురోధేన మమ పున ర్భోగతృష్ణాస్యాత్తదా కో నామ మాం గుణవంతం బ్రూయాత్। కింతు పితృనిర్బంధా ద్వనం గతోఽయం నతు భోగతృష్ణానిరసనపూర్వక సత్యవ్రతపాలనేహా యేతి యశోహాని రేవ భవేదితి భావః। "ఇమం సరాష్ట్రా సజనా ధనధాన్య సమాకులా" ఇత్యాది

స్వర్గాంతసందర్భేణ నేదం మదీయం రాజ్యం కిం. త్వదీయ మితి బుద్ధ్యా త్యక్తే రాజ్యే భోగలేశేఽప్యధికారో మే నాస్తీ త్యాకూతం॥

తా॥ "అద్య" ఈకాలమున 'యాన్ గుణాన్' సర్వాదర ణను హేతుభూతమయిన సౌశీల్యము పితృవశ్యత్వము మున్నగు గుణములను "లభేయ" పొందుదునో 'శ్వః' నీ యాజ్ఞ చే భోగేచ్ఛయందు తగిలి నేనుండి రేపు వెడల నిచ్ఛయించిన నాకు "కః ప్రదాస్యతి" ఎవ డాగుణములను సంపాదింపగలడు? "అతః" ఈ కారణమువలన, "సర్వకామైః సహ" ఇక్కడనుం డిడి సమస్తవస్తువిషయకమైన వాంఛలతో గూడిన వాడనై "అప్రకపణమేవ" పట్టణమునుండి బయిటికి వెడలుటనే, నాతో గూడ నా కోరికలును సమస్తవిషయములను విడిచిపెట్టుగాక యని యర్థము. "వృణే' ప్రార్థింతును. నీ యాజ్ఞ నతిక్రమింప నని భావము.

సమస్తజనులకు ప్రీతివిషయమైన రాజ్యమును వదలి నీ సత్యవ్రతమును పాలించుట వలననే నాకు గుణాతిశయము. నీ యాజ్ఞానుసారముగ నాకు తిరిగి భోగముల యందు తృష్ణ గలిగినచో నన్నెవడు గుణవంతుడని పేర్కొనును ? మఱియు తండ్రి నిర్బంధముచే సీతకు వనమున కేగినాడు గాని, భోగ తృష్ణను వదలి సత్యవ్రతమును పాలింపవలె నను నిచ్ఛ గాదని యశోహానియే గలుగునని భావము. "ఇమాంస రాష్ట్రా" యను నీసర్గ చివరనున్న శ్లోకసందర్భముచే "ఇది నా రాజ్యము కాదు;

ఇతరులదే" యను బుద్ధిచే విడువబడిన రాజ్యమునందలి భోగ లేశమైనను నాకధికారము లేదని భావగర్భితమైన యభిప్రాయము.

స 40. శ్లో॥ 5. సృష్ట స్త్వం వనవాసాయ స్వనురక్త సుహృజ్జనే। రామే ప్రమాదం మాకార్షీః పుత్ర భ్రాతరి గచ్ఛతి।

వ్యా॥ సృష్ట స్త్వం- సహజానురాగేణ భ్రాతర మనుగచ్ఛతి త్వయి మయా కిమపి న వక్తవ్య మస్తి। కింతు- రామే భ్రాతరి గచ్ఛతి- సీతాం విహాయ తద్భారం త్వయి విన్యస్య అన్యత్ర యాతేసతీ త్యర్థః। ప్రమాదం మాకార్షీః- సీతారక్షణే జాగరూకో భవే త్యర్థః- తత్సహితస్య తు తవ ప్రమాదావసర ఏవ నాస్తీతి భావః। యద్వా- త్వం వనవాసాయ సృష్టః- నిర్మితః- అన్యథా త్వదేకప్రాణస్య రామస్య కుతో వనవాసప్రసక్తి రితి భావః। కింతు సుహృజ్జనే- అత్రత్యే మాదృశాదౌ। స్వనురక్త స్సన్- ఉత్కంఠిత స్సన్। గచ్ఛతి రామే- వనవాసవ్రతనిర్వహణైకపరతయా తదాసక్తే రామే। ప్రమాదం మాకార్షీః- తదుత్సాహభంగం మాకుర్వి త్యర్థః- అనుయాతు స్తవ సుహృజ్జనోత్కంఠాయా స్తదుత్సాహభంగ హేతుత్వా దితి భావః॥

తా॥ సహజానురాగముతో సోదరు ననుసరించి వెడలుచున్న నీ విషయమున నే జెప్పవలసిన దేదియు లేదు. "రామే భ్రాతరి గచ్ఛతి" నీ సోదరుడగు శ్రీరాముడు సీతను వదలి, ఆ భారమును నీయందుంచి మఱియొక చోటికి వెడలునపుడు,

"ప్రమాదం మాకార్షీః" ప్రమాదము నందకుము. సీతను రక్షించుటయందు జాగరూకుడవు కమ్ము. ఆతనితో గూడి యున్నపుడు నీకు ప్రమాదమే లేదని భావము.

లేదా, "త్వం వనవాసాయ సృష్టః" నీవు వనమందు నివసించుటకు నిర్మింపబడినాడవు. లేకున్న నీవే ప్రాణముగాగల రామునకు వనవాసప్రసక్తి యేల? అని భావము. "సుహృజ్జనే" ఇచ్చట నున్న మావంటివారి విషయమున "స్వనురక్తః" ఉత్కంఠతో గూడినవాడవై "గచ్ఛతి రామే" వనవాసమును ముఖ్యముగ నిర్వహింపవలెనను పట్టుదలతో అంచాసక్తుడైన రాముని విషయమున 'ప్రమాదం మాకార్షీః' ఉత్సాహభంగమును జేయకుము. అనుసరించి వెడలుట నీకు గల సుహృజ్జనుల యందలి ఉత్కంఠ ఆతని యుత్సాహమును భగ్నముచేయునని భావము.

స 40. శ్లో॥ 9. రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజాం।
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖం॥

వ్యా॥ యద్యపి త్వం భ్రాతృసేవాకుతూహలేన సహ ప్రస్థితః- తథాపి తే కించి ద్వక్తవ్య మస్తీ త్యాహ । రామం- దశరథం- సాక్షా త్పితరం విద్ధి- ఉపాస్వేత్యర్థః । ఏవం జనకాత్మజాం (సీతాం) మాం విద్ధి- మాతర ముపాస్వేత్యర్థః । పితృసేవాయా అన్యత్-న తప ఇతి నిశ్చయేన సర్వ మపి పరిత్యజ్య వనవాసదీక్షితం భ్రాతర మనుయాతు స్తవ త ద్దంపత్యో స్సాక్షా త్పితృభావన యోపాసనం కాదత్రా పూర్ణఫల మేవ

జనయతి_ నతు భ్రాత్రపేక్షయా న్యూన మితి భావః। ఏవం వర్తమాన స్త్వం అటవీం అరణ్యం అయోధ్యాం స్వపితృవాస స్థానం విద్ధి- భావయేత్యర్థః। అతో యథాసుఖం యావ త్సుఖ మైహిక మాముష్మికం వాఽపేక్షితం త దనతిరేకేణైవ విశిష్ట స్సన్ గచ్ఛేత్యర్థః। అత ఏవ ప్రతివాక్యం విద్ధీతి క్రియాపదోప న్యాసః। శేష మన్య ద్వ్యాఖ్యాంతరా ద్గ్రాహ్యం॥

తా॥ ఆలోచింపగా నీవు సోదరుని సేవింపవలెనను కుతూహలముతో కూడ బయలుదేరితివి. అయినను నీకు కొంత దిగ చెప్పునది గలదు. "రామం దశరథం విద్ధి" శ్రీరాముని ప్రత్యక్షముగ తండ్రినిగ దెలిసికొనుము. తండ్రిని వలె నుపా సింపు మని యర్థము. పితృసేవకంటె వేరొక తపస్సు లేదను నిశ్చయముతో సమస్తమును వదలి, వనవాసదీక్షితుడైన సోదరు ననుసరించి వెడలునట్టి నీకు, ఆ దంపతులను ప్రత్యక్ష ముగ పితృభావనతో నుపాసించుట సంపూర్ణ ఫలమునే కలుగ జేయును. సోదరాపేక్షచే తక్కువ గాదని భావము.

ఇట్లుండు నీవు "అటవీం" అరణ్యమును 'అయోధ్యాం' నీ పితృస్థానముగా "విద్ధి" తెలిసికొనుము. భావనచేయుమని యర్థము. ఈ కారణము వలన 'యథాసుఖం గచ్ఛ' ఐహికము లేక ఆముష్మికము నగు నేయేఫల మపేక్షితమో, అద్దానితో గూడిన వాడవై వెడలుమూ యని యర్థము. కావుననే ప్రతి పదముతోను "విద్ధి" యను క్రియాపదమును జేర్చి యుపన్య సించినాడు. మిగిలిన యర్థవిశేషము లన్నియు నితర వ్యాఖ్యాన ములనుండి సేకరించునది.

స 41. శ్లో॥ 19. అనర్థిన స్సుతా స్త్రీణాం భర్తారో భ్రాతర స్తథా । సర్వే సర్వం పరిత్యజ్య రామమేవాన్వచింతయన్॥

వ్యా॥ సుతాః భర్తారః భ్రాతరః- మాతృ పత్నీ సోదరీ భావ మాపన్నానాం స్త్రీణాం అనర్థినః- తద్విషయక ప్రేమ భావశూన్యా అభవన్ । కిం బహునా । సర్వే జనాః సర్వం- స్వస్వ సంబంధం- పరిత్యజ్య । రామ మేవ అన్వచింతయన్- పూర్వోక్త స్వమాత్రాది విషయక సకలప్రేమాస్పదతయా అతర్కయన్- స్వీయమాత్రాదిసంబంధవిశేషప్రయుక్త తత్త త్కార్యాణాం తత్తదశక్త్యాలుప్తానా మపి సర్వేషా మానుకూ ల్యేన పరిపూరకే శ్రీరామ ఏవానుగతచింతాయుక్తా స్సర్వే ఽపి బభూవు రితి భావః॥

తా॥ "సుతాః, భర్తారః, భ్రాతరః" పుత్రులు, భర్తలు, సోదరులును "స్త్రీణాం" తల్లులు, భార్యలు, తోబుట్టువులు నగు స్త్రీలకు "అనర్థినః" తత్తద్విషయకమైన ప్రేమలేనివా రయిరి. పెక్కు మాటలు చెప్పనేల? "సర్వేసర్వం పరిత్యజ్య రామమేవాన్వచిన్తయన్" జనులందరు సమస్తసంబంధములను వదలుకొని- అనగా వెనుక చెప్పిన తమ తల్లులు మున్నగువారు ప్రేమాస్పదముగ శ్రీరామునే తలచిరి.

తమ సంబంధులయిన తల్లి మున్నగువారు చేయు కార్య ములు వారివారి యశక్తిచే లోపించినను సమస్తము న్నగు వానిని అనుకూలముగ పూరించు శ్రీరామునియందే అనుగత మైన చింతతో కూడినవారై అందరు నయిరని భావము.

స 42. శ్లో॥ 5. తాం నయేన చ సంపన్నో ధర్మేణ వినయేన చ।
ఉవాచ రాజా కైకేయీం సమీక్ష్య వ్యధితేంద్రియః॥

వ్యా॥ నయేన- దండనీత్యా । ధర్మేణ- పారత్రికోపయోగిధర్మమార్గేణ- వినయేవ- విషయసంకోచేన చ । సంపన్నః- యుక్తః । కైకేయీం సమీక్ష్య- సమ్యక్ పరిశీల్య । వ్యధితేంద్రియః- కిమి త్యేతాదృశదుర్మతే రంగసౌష్ఠవం- గుణరూపయో ర్వ్యభిచారా దితి సంక్షుభితమనస్కః ఇత్యర్థః । ఉవాచ॥

తా॥ "నయేన" దండనీతితోడను 'ధర్మేణ' పరలోకము నుపయోగించెడి ధర్మమార్గముతోడను "వినయేన" విషయములయందలి నివగింపుతోడను, 'సంపన్నః' కూడిన దశరథుడు 'కైకేయీం సమీక్ష్య' కైకేయిని బాగుగ పరిశీలించి, 'వ్యధితేంద్రియః' ఇట్టి దుర్బుద్ధికీ యంగసౌష్ఠవ మేల ? గుణరూపము లొక్కచో నుండవు గదా ? అని క్షోభ నొందిన మనస్సు గలవాడై "ఉవాచ" పలికెను.

స 42. శ్లో॥ 6. కైకేయి మామకాంగాని ।
స్ప్రాక్షీ స్త్వం దుష్టచారిణీ ।
న హి త్వాం ద్రష్టు మిచ్ఛామి ।
న భార్యా న చ బాంధవీ॥

స 42. శ్లో॥ 7. యే చ త్వా మనుజీవంతి నాహం తేషాం న తే మమ । కేవలార్థపరాం హి త్వాం త్యక్తధర్మాం త్యజామ్యహం॥

వ్యా॥ అనేన శ్లోకద్వయేన దుష్టాయాః కైకేయ్యా స్తత్సంబంధేన రాజ్ఞో మాన్యతయా సంస్థానే స్థితానా మన్యే షాం చ స్వానుగ్రాహ్యత్వాభావప్రకటనద్వారా ఽనాదర బోధనేన దండనీతే రుపయోగః ప్రదర్శితః॥

తా॥ ఈ రెండు శ్లోకములచేతను, దుష్టురాలగు కైకే యియు, ఆమె సంబంధముచే రాజును, ఆతనికి మాన్యులైన సంస్థానమునందున్న ఇతరప్రజలును, తన కనుగ్రహింపదగిన వారు కారని ప్రకటించుచు, వారియం దనాదరణను ప్రకటిం చుటచే దశరథుడు దండనీతి నుపయోగించుట ప్రదర్శింపబడినది.

స 42. శ్లో॥ 8. అగ్నిహోత్రం యచ్చ తే పాణి మగ్నిం పర్యణయం చ యత్ । అనుజానామి త త్సర్వ మస్మి న్లోకే పరత్ర చ॥

వ్యా॥ త్వదీయ పాణిగ్రహణసంస్కారాంగతయా, అగ్ని పరిచర్యాదికం యచ్చ, యచ్చ తత్కాలవిశేషే. దేవబ్రాహ్మ ణాది సత్కారాదికం చ త త్సర్వ మస్మిన్లోకే, ఫలత్వే త్యను జానామి- అనుమోదే । కృతస్య సంకల్పపూర్వకస్య కర్మణోఽ వశ్యం . వ్యవహారవిశేషప్రయోజకతయా ఇహలోకే సుఖవిశే షాధాయకతయా చ పరత్ర చార్థసత్వేనిమమేన తద్విషయే ఽనుమోదమాత్రం లభేయేతి భావః । అనేన ధర్మః ప్రద ర్శితః॥

తా॥ నీ సంబంధమయిన పాణిగ్రహణసంస్కారము నకు అంగముగ ఏ అగ్న్యుపాసన మున్నగునదియు, ఆయా కాలవిశేషమునందు ఏ యే దేవబ్రాహ్మణ సత్కారాదికమును

నాచే జేయబడినదో "తత్సర్వం అస్మిన్ లోకే ఫలత్విత్యనుజా నామి" ఈ లోకమునందే ఫలించుగాక యని యనుమోదించు చున్నాడను. సంకల్పపూర్వకముగ చేయబడిన కర్మ తప్పక వ్యవహారవిషయమున విశేషప్రయోజక మగును గాన, ఈ లోకమున సుఖవిశేషమును కలుగజేయు నదియును, పరలోక మున ప్రయోజనముతో గూడినదియు నగును. ఆ విషయమున అనుమోదమాత్రమునే పొందును నని భావము. దీనిచే ధర్మము ప్రదర్శింపబడినది.

స 42. శ్లో॥ 9. భరతశ్చే త్ప్రతీతస్స్యా ద్రాజ్యం ప్రాప్యైద మవ్యయం। యన్మే సదద్యా త్పిత్రర్థం మాం మాత ద్దత్తమాగమత్॥

వ్యా॥ ఇదం అవ్యయం- అఖండభోగాస్పదతయా పరం పరాయాతం। రాజ్యం ప్రాప్య- భరతః ప్రతీతస్సంతుష్ట స్స్యా చ్చేత్- అన్యాయ్యమ పీదం రాజ్యం। ప్రేమ్ణా మజ్జ నన్యా మహ్య మూర్జితమితి విషయలోల శ్చేత్। తదా, త ద్దత్తం పిత్రర్థం- పితృదేవతాప్రీతయే। మే- మహ్యాం। మాగ మత్- మోపతిష్ఠతాం। యద్యన్యాయ్య మేత ద్విషప్రాయం రాజ్య మితి మత్వా జహ్యాత్। తదా త్వద్గర్భమాత్రసంభవేఽపి త్వ ద్బుద్ధిదోషాసం బద్ధత్వేన తేన దత్తం మా ముపతిష్ఠతా మేవే త్యాశయః। ఏతేన స్వసంప్రదానక భరతకర్తృకపిండోదకాదిదా నస్య విషయభేదేన సోపస్థానోక్త్యా వినయపదార్థః ప్రదర్శితః॥

తా॥ "ఇదం" ఈ "అవ్యయం" అఖండభోగాస్పదమై పరంపరగా వచ్చిన, 'రాజ్యం ప్రాప్య' రాజ్యమును పొంది,

"భరతః ప్రతీతస్సంతుష్టస్స్యాచ్చేత్" భరతుడు సంతసించినచో అన్యాయ్యప్రాప్త మయినను నీ రాజ్యము ప్రేమచే నా తల్లి నాకొఱకై సంపాదించినదని విషయలోలు డైనచో, 'తదా' అప్పుడు, 'తద్దత్తం' వానిచే నీయబడినది 'పితృర్థం' పితృదేవతా ప్రీతికొఱకు 'మహ్యం మాగమత్' నన్ను పొందకుండుగాక.

అన్యాయమైన యీ రాజ్యము విషప్రాయమని తలచి వదలవేసినచో నీ గర్భమున జన్మించినను నీ బుద్ధిదోష మాత నికి సంక్రమించనందున ఆత డిచ్చినది నన్ను పొందుగాక యని యభిప్రాయము. దీనిచే తనకొఱకు భరతు డిచ్చిన పిండదానాది కము విషయభేదముచే తన్ను బొందునని తెలిపినాడు గాన వినయపదార్థ మిందు ప్రదర్శింపబడినది.

స 42. శ్లో॥ 34. రామం మే ను గతా దృష్టి రద్యాపి న నివ ర్తతే। నత్వాం పశ్యామి కౌసల్యే సాధు మాం పాణినా స్పృశ॥

వ్యా॥ మే దృష్టిః రామం గతాను- గతాకి మిత్యర్థః। అత ఏవ- అద్యాపి న నివర్తతే- అహం తు తేన సాకం గంతు మనీశ స్సన్- నివృత్త స్తస్మా న్మదపేక్షయా దృష్టే రేవ తస్మి న్ప్రీతిమాతిశయ ఇతి భావః। ద్రష్టవ్యాభావే దృశాకి మిత్యత ఆహ। నత్వా మితి। సాక్షా త్త్వద్దర్శనాభావేఽపి త న్మాతు స్త వాపి రూపగ్రహణాభావ ఏవ మే న్యూనతేతి భావః। తథాపి తన్న్యూనతాం పరిహరేత్యాహ- సాధ్వితి। పాణినా- వివాహ కాలే యః పాణి స్తే గృహీతో మయా తేనేత్యర్థః। సాధు-

సమ్యక్ । మదీయోఽయం దైవవశా దన్యథా జాతః న తు స్వబుద్ధ్యేతి సమీచీనం యథా తథా మాం స్పృశ।

తా॥ "మేదృష్టిః" నా దృష్టి "రామం గతాను" రాముని బొందినదై యేమి? కావుననే "అద్యాపి న నివర్తతే", ఇప్పటికిని మఱలుట లేదు. నేను వానితోఁగూడ వెడలుట కసమర్థుడ నగుచు మరలితిని. కావున నాకంటె నా దృష్టికే రాముని యందు ప్రేమాతిశయము మెండుగ గలదని భావము. చూడ దగినది లేనప్పుడు చూపెందుల కని వగచుచున్నాడు. 'నత్వాం పశ్యామి' నిన్ను జూచుట లేదు. ప్రత్యక్షముగ నాతని జూడ కున్నను ఆతని తల్లివగు నిన్నును జూడలేకుండుటకు రూపగ్రహణము లేకుండుటే నాకు న్యూనత యని భావము. అయినను ఆ కొఱత నుపరిహరించు మనుచున్నాడు. "సాధ్వి" ఓ పతివ్రతా! "పాణినా" వివాహ కాలమున నేనేపాణిని (హస్తమును) గ్రహించితినో ఆ పాణితో "సాధు" యోగ్యముగ అనగా నా సంబంధమైన యీతడు దైవవశమున వేరొక రీతిగ మారి నాడు; స్వబుద్ధిచేతను మాత్రము గాదని తెలుసునట్లుగ "మాం స్పృశ" నన్ను స్పృశింపుము.

స 44. శ్లో॥ ।. విలపంతీం తథా తాం తు కౌసల్యాం ప్రమదో త్తమాం।ఇదం ధర్మే స్థితా ధర్మ్యం సుమిత్రా వాక్య మబ్రవీత్॥

వ్యా॥ "దరిద్రో య స్త్వసంతుష్టః కృపణో యోఽజి తేంద్రియః" ఇతి న్యాయే నేంద్రియవికారాభిహతస్య శోచ్యత్వే శాస్త్రప్రసిద్ధే త ద్వ్యతిరేకేణ తదభిభవేన స్వాతంత్ర్యం పురుషోత్త

మం రామం సుతత్వాభిమానేన శోచంతీం కౌసల్యాం మాత్మ దృష్టాంతేన సాంత్వయతి। విలపంతీ మిత్యాది సర్గావసానాంతం॥

తా॥ "సంతుష్టి లేని దరిద్రుడు, జితేంద్రియుడు గాని కృపణుడు" అను న్యాయముచే, ఇంద్రియవికారములచే నణగ ద్రొక్కబడినవానివిషయమున దుఃఖింప దగుట శాస్త్రసిద్ధమై యుండగా, దానికి వ్యతిరేకముగ ఇంద్రియ వికారములను పరిభ వించి స్వతంత్రుడయిన పురుషోత్తముడగు శ్రీరాముని గూర్చి పుత్రుడను నభిమానముచే దుఃఖించుచున్న కౌసల్యను సుమిత్ర ఆత్మదృష్టాంతముచే ఊరడించుచున్నది. ఈశ్లోకము మొదలు సర్గాంత శ్లోకమువరకు (నీవిషయమే చెప్పబడినది.)

స 44. శ్లో॥ 5. వర్తతే చోత్తమాం వృత్తిం లక్ష్మణోఽస్మిన్ స దానఘః। దయావాన్ సర్వభూతేషు లాభ స్తస్య మహాత్మనః॥

వ్యా॥ అస్తునామ పుత్ర స్తావతా పిత్రోః కిం సాఫ ల్యం । న కింతు తదీయగుణగరిమ్ణైవ । తచ్చ తవైవ నాన్యస్యా స్తస్య శిష్టాచరితపథానువర్తిత్వా దిత్యుక్త్వా తదుత్తమత్వం లక్ష్మణస్యా ప్యుపకారక మభూ దిత్యాహ । వర్తతే చోత్తమా మితి । స్వభావతః కోపనోఽపి లక్ష్మణ స్సర్వభూతేషు దయా వాన్- సర్వగుణోత్కృష్ట భూతదయారూపగుణాశ్రయ స్సన్ అస్మిన్ మహాత్మని శ్రీరామే । ఉత్తమాం వృత్తిం- ఐకాంతిక ప్రపత్త్యా సదావృత్తిం- జీవికాం । వర్తత ఇతి యత్ - కరో తీతి యత్। సః అస్య- లక్ష్మణస్య । మహాత్మనః లాభః- మహా

త్మనః త్వ త్వత్రాత్ - శ్రీరామచంద్రాత్ సంప్రాప్తో లాభః - తద్ధేతుకో లాభః మహాపదప్రాప్తి రితి యావత్ । ఇదం చ మహాఫలం తదీయమాహాత్మ్యమూలక మేవేతి కిం తస్య వర్ణ్యతే మహత్త్వ మితి సంతోషకాలే ప్రాప్తే కిం శోకేనేతి తాత్పర్యం। యదా- ధర్మైకాయత్తతయా వనం ప్రస్థితేఽస్మిన్ శ్రీరామే- సర్వభూతేషు దయావాన్- వానప్రస్థోచితభూతదయాప్రధాన స్సన్ । వృత్తిం- వ్యాపారం । ఉత్తమాం- అకల్మషాం సద్భ్రాతృసేవాద్వారా । వర్తతే- వర్తయతీతి యత్ । సః- అస్య మహాత్మనః శ్రీరామస్య లాభః । శ్రీరామపట్టాభిషేకవిఘాతుక మాతాపితృహననోద్యుక్త మపి లక్ష్మణం సత్పథే ప్రవర్తయత స్త్వత్పుత్ర స్యారణ్యేఽపి కిం ప్రతికూల మితి జ్ఞాత్వా శోకం జహీ త్యర్థః । ఏకాకీ యది స గచ్ఛే త్తదా స్యా న్నామ తే విక్లతిః- సర్వాత్మనా తదాశ్రయే స్వపరిచారకే లక్ష్మణే సతి కిం తస్య ఛిన్న మితి సమాహితా భవేతి భావః॥

తా। పుత్రుడు కలుగుగాక. అంతమాత్రమున తలిదండ్రుల కేమి సాఫల్యము. లేదు. పుత్రుల గుణగరిమచేతనే సాఫల్యము సిద్ధించును. అదియు నీకే తటస్థించినది. ఇతరులకు లేదు. శ్రీరాముడు శిష్టులచే నాచరింపబడు మార్గము ననువర్తించువాడు గాన, ఆతని యుత్తమత్వము లక్ష్మణునకు కూడ నుపకరించిన దని సుమిత్ర తెలుపుచున్నది.

స్వభావముచే కోపముగలవా డయినను లక్ష్మణుడు "సర్వభూతేషు దయావాన్" సమస్త ప్రాణులయందు దయగల వాడు. సర్వగుణములలో యుత్కృష్టమైన భూతదయ యనెడి గుణము నాశ్రయించినవాడై, "అస్మిన్" మహాత్ముడగు నీ శ్రీరాముని విషయమున, "ఉత్తమాంవృత్తిం'' ఎడబాయని భక్తితో నెల్లపుడు జీవికను "వర్తతే ఇతి యత్" చేయుచున్నా డనుట యేది గలదో 'సః' అది "అస్య" ఈ లక్ష్మణునకు, "మహాత్మనః లాభః" మహాత్ముడు నీ పుత్రుడు నగు శ్రీరామ చంద్రునివలన గలిగిన లాభము. ఇది లక్ష్మణునకు మహాపద ప్రాప్తియే. ఈ మహాఫలము ఆ శ్రీరాముని మాహాత్మ్య మూలముననే గాన నాతని మహత్వ మేమని వర్ణింపవచ్చును. కావున సంతోషసమయమున దుఃఖాపనేల యని తాత్పర్యము.

లేదా, ధరైకబుద్ధితో శ్రీరాముడు వనమునకు వెడలగా, "సర్వభూతేషు దయావాన్" వానప్రస్థులకు తగిన భూత దయ ప్రధానముగా గలవాడై, "వృత్తిం'' వ్యాపారమును, "ఉత్తమాం'' యోగ్యమగు భ్రాతృసేవ మూలమున కల్మష రహితమునుగ "వర్తతే" జరుపుచుంటి వనుట యేది గలదో 'సః' అది "అస్య మహాత్మనః లాభః'' శ్రీరామచంద్రునివలని లాభము. శ్రీరామచంద్రుని పట్టాభిషేకమునకు విఘాత నొనర్చిన తల్లిదండ్రులను చంపుట కుద్యుక్తుడైన లక్ష్మణునిగూడ సన్మార్గమందు ప్రవర్తింపజేయు నీ పుత్రునకు అరణ్యమందును ప్రతికూలమగున దేముండును. అని తెలిసికొని శోకమును

వదలుము. ఆత డొంటరిగా వెడలినచో నీకు వికార ముండు గాక. సర్వవిధముల నాతని నాశ్రయించి పరిచర్య చేయు లక్ష్మణు డుండ ఆతనికి లోప మేమి యని సమాధానము పడు మని భావము.

స 44. శ్లో॥ 6. అరణ్యవాసే య ద్దుఃఖం జానతీ వై సుఖో చితా। అనుగచ్ఛతి వైదేహీ ధర్మాత్మానం తవాత్మజం॥

వ్యా॥ న కేవలం లక్ష్మణానుగమన మేవ త్వ త్తుష్టి కారణం- కింతు- సీతాసాన్నిధ్య మపి పరమకారణ మిత్యాహ। అరణ్యవాస ఇతి। బాధజ్ఞానేఽపి సుఖం వైషయికం త్యక్త్వా ధర్మాత్మానం తవాత్మజ మనుగచ్ఛతి ఖలు సీతా- ఇతఃపరం కిం సుఖం పురుషస్య య దనుకూలభార్యాసంబంధస్య నైయత్య మిత్యతోపి తస్య న కించిదపి న్యూన మితి మత్వా సుఖం తిష్ఠే త్యర్థః। పత్న్యా స్స్వభర్తృసేవావ్రతపరిపాలనం- న కేవలం తస్యా ఏవ గుణోత్కర్షః। అపి తు, పతిసంబంధిమాహాత్మ్యస్యా ప్యుత్కర్ష హేతుః। అత స్త్వత్పుత్రస్య మాహాత్మ్యం సర్వవశీ కరణకారణం- అత ఏవ 'అనుగచ్ఛతీ'త్యాది ఇతి భావః॥

తా॥ కేవలము లక్ష్మణు డనుసరించి వెడలుటయే సంతోష కారణము గాదు. సీత దగ్గర నుండుటయును ముఖ్యకారణమే యని తెలుపుచున్నది. "వైదేహీ ధర్మా త్మానం తవాత్మజ మనుగచ్ఛతి" అరణ్యమున బాధలు గలుగునని తెలిసియుండియు విషయసుఖములను వదలి సీతాదేవి ధర్మాత్ముడగు నీ పుత్రుని వెంబడించి పోవుచు

న్నది. పురుషున కనుకూలమగు భార్య మెల్లపు డెటబాయ కుండ నుండుటకంటె వేఱొక సుఖ మేమి కలదు. ఇటుల తలంచియు నాతని కేమియు కొఱత లేదని నిశ్చయించి సుఖముతో నుండుమని యర్థము. భార్య భర్తను సేవించుట యనెడి వ్రతమును పాలించుట కేవలము ఆమెకే గుణోత్కర్ష హేతువు గాదు. పతియొక్క మాహాత్మ్య మభివృద్ధి నొందుట కును హేతు వగును. కావున నీ పుత్రుని మాహాత్మ్యము అందఱను వశీకరింపజేయుటకు కారణ మైనది. కావుననే సీత వెంబడించుచున్న దని భావము.

స 44. శ్లో॥ 7. కీర్తిభూతాం పతాకాం యో లోకే భ్రమయతి
ప్రభుః। ధర్మసత్యవ్రతధనః కిం న ప్రాప్త స్తవాత్మజః॥

వ్యా॥ స న్వస్తునామ ధార్మికత్వం రామస్య । తథాపి సర్వసుఖహేతుభూతధనాభావేన దుర్వారం దుఃఖ మిత్యను శోచా మిత్యత ఆహ-కీర్తిభూతా మితి । ధర్మసత్యవ్రతధనః- ధర్మః- ఉచితప్రవృత్తిః- సత్యం- ప్రతిజ్ఞాతార్థ నిర్వహణపరత్వం। వ్రతం- శరణాగతరక్షణాది- తద్రూపధనయుక్తో రామః । లోకే- సర్వలోకేష్వపి । కీర్తిభూతాం- కీర్తిరూపాం పతాకాం । భ్రమయతి సంచారయతి । ప్రభుః- సర్వేశ్వరః । స కిం న ప్రాప్తః తస్య కిం నాస్తి । అతినశ్వరధనాపేక్షయా సర్వలోకవ్యాపకధర్మసత్యవ్రతధనాధీనకీర్తియుక్తస్య తస్యావిద్యమానం న కిమపీత్యర్థః । అత్యల్పకాలావస్థాయి రాజ్యలిప్సా

పేక్షయా శాశ్వతికకీర్తి ప్రయోజకధర్మాదిధనలిప్సా అతిశ్రేయ సీతి భావః॥

తా॥ శ్రీరామునియందు ధార్మికత్వ ముండుగాక. కాని సమస్త సుఖములకు కారణభూతమైన ధనము లేకున్నచో దుఃఖము తప్పదని చింతించుచుంటి నందువేమో! అట్లు కాదు. "ధర్మసత్యవ్రతధనః" ఉచితప్రవృత్తి, (తగునట్లుగ ప్రవర్తించుట) ప్రతిజ్ఞ చేసిన కార్యమును నిర్వహించుట, శరణాగతరక్షణాదికమును ధనముగా గలిగిన శ్రీరాముడు "లోకే" సమస్తలోకములయందు "కీర్తిభూతాం పతాకాం" కీర్తి రూపమయిన పతాకము (జండా) ను "భ్రమయతి" ఎగురవేయు చున్నాడు. 'ప్రభుః' సర్వేశ్వరుడగు 'సః కిం నప్రాప్తః' ఆతని కేమి లేదు. అతి నశ్వరమైన ధనము నపేక్షించి, సమస్తలోకములయందు వ్యాపించునట్టి ధర్మ సత్యవ్రతము లనెడి ధనమువలన గలుగు కీర్తితో గూడిన యాతనికి లేని దేమియు లేదని యర్థము. మిక్కిలి స్వల్పకాల ముండు రాజ్యము నపేక్షించుటకంటె, శాశ్వతమైన కీర్తిని గలుగజేయు ధర్మాది ధనము నపేక్షించుటయే శ్రేయస్కర మని భావము.

స 50. శ్లో॥ 36. యథాయోధ్యా।

తథేఽయం తే రామ కిం కరవాణి తే।

ఈదృశం హి మహాబాహో కః।

ప్రాప్స్య త్యతిథిం ప్రియం॥

వ్యా॥ కిం కరవాణి- త్వ త్ప్రీతయే, కి ముపకల్ప యామి । న న్వస్మిన్ కుగ్రామే కిం సాధ్య మిత్యత ఆహా । అయోధ్యా యథా తే అనుకూలా అభవత్ తథేయమపీతి- అపరిచ్ఛిన్న సమృద్ధే స్తవ అయోధ్యానామ కాచి న్నగరీ యథా వాసాద్యనుకూలా భవత్, తథేయ మల్పీయసీ మ న్నివాసభూమి రపి । వస్తుతస్తు త్వ దర్హా కాచి దపి వసతి ర్నాస్తి। ప్రకృతే చ త్వ ద్వాసత్వా న్నాస్య కుగ్రామత్వ మితి భావః । యద్వా- లోకే హి వస్తున స్సంతోష హేతుత్వం తదీయత్వాభిమానేన । నతు సమృద్ధ్యతిశయేన । అన్యథా ఉత్తరోత్తర మృద్ధీనాం న్యూనాధికభావాపన్నత్వేన కస్యాపి ప్రియత్వం న స్యాత్। అతో "యథాఽయోధ్యా తథేయం తే" ఇతి । కించ- అస్యాపి జనపదస్య త్వత్పాల్యత్వేన వయమ ప్య త్రత్యా స్త్వత్కింకరా ఇత్యాహ "యథాఽయోధ్యా తథే యంతే" ఇతి । అథవా- అసమృద్ధో ప్యయం జనః త్వ దను గ్రహా త్సమృద్ధ ఏవేతి మయి న్యూనత్వం న సంభావ్య మిత్యా శయే నాహ । యథేత్యాది । వస్తుతస్తు- మదపేక్షయా సర్వో త్తమః కోపి నాస్తీ త్యాహ । ఈదృశం- పితృప్రతిజ్ఞానిర్వాహా ర్థం సామ్రాజ్య మపి, హిత్వాఽరణ్యం గంతు ముద్యుక్తత్వేన ధర్మైకస్వరూప మఖిలమాన్యతయా సర్వాదరపాత్రం అతిథిం । త్వత్రాపి । ప్రియం- మమైవ కేవలం న- కింతు- సర్వస్యాపి ప్రియం । కః ప్రాప్స్యతి- మత్తోఽన్యః । అత స్సోత్కంఠస్య

మమాసాధ్యస్య కస్యాపృథావా త్త్వదభీష్టసంపాదనాయ మా మనుజానీహీతి భావః॥

తా॥ "కిం కరవాణి'' నీ ప్రీతికొఱకేమి సంపాదింతును. ఈ కుగ్రామమున ఏమి సాధ్యమగు నందువేమో? "అయోధ్యా యథా" అయోధ్య నీకెట్లనుకూల మాయెనో, "తథేయమపి" అటులనే ఈ గ్రామమును అనుకూల మగును. పరిమితి లేని సమృద్ధి గల నీకు అయోధ్య యనెడి ఒక పట్టణ మెట్లు నివాసాదుల కనుకూల మాయెనో అటులనే మిక్కిలి అల్పమగు నా నివాసస్థానమును అగును. నా స్వత్వమునకైతే, నీకు తగిన వసతి యేదియును లేదు. ప్రకృతమున నీవు నివసించుటచే నిది కుగ్రామమే కాదని భావము.

లేదా, లోకమునం దేవస్తువైనను సంతోషమును గలిగించు నన్నచో ఆవస్తువునందలి యభిమానముచేతనే గాని, దాని యందలి పరిపూర్ణతచే గాదు. అట్లు గానిచో, వస్తువు లోకదానికంటె నొకటి న్యూనాధిక భావముల నొందియుండును గాన ఏదియును ప్రియము కానేరదు. కావుననే "నీ కయోధ్య యెట్టిదో ఇదియు నట్టిదే" యనినాడు.

మఱియు నీదేశమును నీచేతనే పాలింప దగినది గాన, ఇక్కడ నున్న మేమును నీ కింకరులమే అని తెలుపుటకై "యథాయోధ్యాతథేయ" మనినాడు.

లేదా, ఈజనుడు సమృద్ధి లేనివాడయ్యెను, నీ యను గ్రహమువలన సమృద్ధితో గూడినవాడే కావున నాయందు

మ్యానత (కొఱత) ఊహింప తగినది గాదని తెలుపుటకై "యథా..." ఇత్యాదికము ననినాడు.

వాస్తవముగనైతే, నాకంటె సర్వోత్తము డెవడును లేడని తెలుపుచున్నాడు. "ఈదృశం" తండ్రి ప్రతిజ్ఞను నిర్వహించుటకు సామ్రాజ్యమును గూడ వదలి అరణ్యమునకు వెడలుట కుద్యుక్తుడ వగుటచే, ధర్మైకస్వరూపుడు, అందరకు మాన్యుడు, సర్వాదరములకు పాత్రుడు నగు "అతిథిం" అతిథిని, "ప్రియం" నాకే గాక లోకమంతటికిని ప్రియమైనవానిని "కఃప్రాప్స్యతి" నాకంటె నితరు డెవడు పొందగలడు. కావున అందరిలో నుత్కృష్టుడనగు నాకసాధ్య మెద్దియు లేదు గాన నీ యభీష్టమును సంపాదించుటకు నాకనుజ్ఞ నిమ్మని భావము.

స 50. శ్లో॥ 42. దిష్ట్యా త్వాం గుహపశ్యామి అరోగం సహ బాంధవైః। అపి తే కుశలం రాష్ట్రే మిత్రేషు చ ధనేషు చ॥

వ్యా॥ కిమేభి ర్భక్ష్యాదిపదార్థై స్సర్వసాధారణైః- ఇద మేకమేవ మే సంతోషాయ పర్యాప్త మిత్యాహ। దిష్ట్యా- మదృష్టభాగ్యేన। బాంధవై స్సహ- అరోగం- ఆధివ్యాధిరూప రోగవర్జితం। త్వాం పశ్యామి- సర్వదా యావత్పరివారేణ మృగయోపజీవిన స్తే సబంధుకస్య క్రూరమృగసంపాతజన్యవ్రణ కిణాదిపీడాపరిహారేణారోగ్యస్థితి స్సర్వకామేభ్యోపి మమ ప్రీతి ముత్పాదయామాసేతి భావః। ఇదం చ ప్రాథమికం మిత్రస్య కామ్యం- ద్వితీయంతు తదీయరాజ్యమిత్రబాంధవాదీనామాను కూల్య మాప్సిత మితి పృచ్ఛతి। "అపి తే కుశలం రాష్ట్రే" ఇత్యాది॥

తా॥ అందఱకు సాధారణమైన యీ భక్ష్యాది పదార్థములతో నా కేమి ప్రయోజనము. నా సంతోషమున కిదియే చాలు నని శ్రీరాముడు గుహునకు దెలుపుచున్నాడు.

"దిష్ట్యా" నా భాగ్యవశమున "బాంధవైస్సహ" బంధువర్గముతో గూడ, "అరోగం" ఆధివ్యాధు లనెడు రోగములు లేని "త్వాం పశ్యామి" నిన్ను జూచుచున్నాను. సర్వకాలముల యందు సమస్త పరివారముతో గూడి వేటచే కాలము గడిపెడి నీకు వ్రణకిణాదుల వలన బాధ లేకుండ ఆరోగ్యము సమకూడి యుండుట, సమస్త కోరికలకంటెను నా కధికమగు ప్రీతిని గలిగించె నని భావము.

మిత్రునకు మొట్టమొదట కోరదగిన దిదియే. రెండవది వాని రాజ్యము మిత్రులు బంధువులు అనుకూలముగ నున్నారా యని తెలిసికొనుట. కావున దాని నడుగుచున్నాడు. ఓ గుహా! నీ రాష్ట్రమునందును, మిత్రులు బంధువులు మున్నగువారు క్షేమమేనా ?

స 50. శ్లో॥ 43. యత్త్విదం భవతా కించి త్ప్రీత్యా సమభికల్పితం । సర్వం త దనుజానామి న హి వర్తే ప్రతిగ్రహే॥

వ్యా॥ ఇదం- పరిదృశ్యమానం । యత్ - కించిత్ - పరిచ్ఛిన్నం యథా తథా । ప్రీత్యా- మత్తుష్టిం కరోత్వితి ప్రేమ్ణా। సమభికల్పితం- దేశకాలాదిసంగత్యా అభికల్పితం । అప్రార్థితోపనతతయా అత్యంతమచ్యుతయా చ సమర్పితం । తత్ - పరిచ్ఛిన్నం వస్తుజాతం । సర్వం- అపరిచ్ఛిన్నం । అనుజానామి- అను

మోదే । దేశకాలపాత్రాదిజ్ఞానపూర్వకం ప్రీత్యా దత్తస్య సర్వథా ఽపరిచ్ఛిన్నత్వస్మరణా దితి భావః । కింతు- ప్రతి గ్రహే- నవర్తే జాత్యా ప్రకృతధర్మేణ చ మే ప్రతిగ్రహాజీవ నం నిషిద్ధ మిత్యేతావదేవ బోధయామీత్యర్థః । దానప్రతి గ్రహఫలం న పురుషవ్యాపారతంత్రం । కింతు- తదీయ కామ నాతంత్రం "కామో దాతా కామః ప్రతిగ్రహీతా" ఇతి శ్రుతేః । అతో యాదృశకామనయా త్వ మదదాస్తాదృశ కామ సిద్ధే ర్మదీయామోదే నైవ నిర్వాహేణ బాహ్యప్రతిగ్రహా భావా త్త్వ మన్యథావృత్తిం మయి మా కృథా ఇతి భావః । ఉత్తరశ్లోకార్థ స్సర్వత్రైవ హేతుతయా యోజ్యః "కుశచీరాజి నధరం ఫలమూలాశినం చ మాం । విద్ధి ప్రణిహితం ధర్మే తాపసం వనగోచరం" ఇత్యేత దుత్తరశ్లోకః । అనుజానా మీ త్యస్య ప్రతిదదా మీత్యర్థకత్వం తు "న హి వర్తే ప్రతిగ్రహే" ఇత్యనేన వ్యాహత మితి బోధ్యం । మమ సమ్య క్కృత మిత్య నుజానా మీతి వ్యాఖ్యానం త్వధ్యాహారగౌరవదూషిత మితి మంతవ్యం॥

తా॥ "ఇదం యత్" ఈ కనబడున దేది? "కించిత్" పరిచ్ఛిన్న మగునట్లుగా "ప్రీత్యా" నాకు సంతోషమును కలి గించుగాక యని ప్రేమచే "సమభికల్పితం" దేశకాలాది సంబం ధముచే కల్పింపబడినదో; అనగా ప్రార్థింపకుండగనే ప్రాప్త మయినదిగను, మిక్కిలి రుచ్యముగను, సమర్పింపబడినదో 'తత్' పరిమితమైన ఆ వస్తుసమూహమును, "సర్వం" అపరిమితమైన

దానినిగ "అనుజానామి" అనుమోదించుచున్నాను. దేశకాలాది ప్రాత్రజ్ఞానముతో ప్రీతిపూర్వకముగ నీయబడినది స్వల్ప మయినను అపరిమిత మగునని పెద్దలు తెలుపుచురు గాన అని భావము. "కింతు ప్రతిగ్రహే నవర్తే' కాని ప్రతిగ్రహమున (దానమిచ్చిన దానిని గ్రహించుట) దగుల్కొనను. జాతిచేతను ప్రస్తుత ధర్మముచేతను నాకు ప్రతిగ్రహముచే జీవించుట నిషిద్ధము గాన నింతమాత్రముననే అంగీకరించుచున్నాను.

దానప్రతిగ్రహముల ఫలము పురుషవ్యాపారాధీనము గాదు. అది కామనాధీనము. "కామమే ఇచ్చునదియు, కామమే ప్రతిగ్రహించునదియును" అను శ్రుతివచనము నీవిషయమునే తెలుపుచున్నది. కావున నీ వేకోరికచే నిచ్చితివో అట్టి కోరిక సిద్ధించుట నా యనుమోదముననే నిర్వహించినది గాన, బాహ్య ప్రతిగ్రహము లేదని నీవు నన్యథా భావింపకుమని భావము. ఆకారణముచేతనే తరువాత శ్లోకమందలి యర్థ మిచ్చుట కూర్చుకొనునది. "కుశలు నారచీరలు చర్మములను ధరించి కందమూల ఫలములను భక్షించు నన్నును ధర్మమందే కాగ్రత గల వనవాసియగు తాపసునిగా దెలియుము" అనునది తరువాతి శ్లోకమున కర్థము. "అనుజానామి" అను పదమునకు తిరిగి యిచ్చుచున్నా నని యర్థము. "నహివర్తే ప్రతిగ్రహే" అను వాక్యముచేతనే చెప్పబడినది గాన నట్లు చెప్పుట తగదు. "నాకు యోగ్యముగ జేయబడిన దని అంగీకరించుచున్నా" నని చెప్పబడిన వ్యాఖ్యానము పదాధ్యాహారములతో గూడినదగుటచే దూష్యమని తెలియదగినది.

52. శ్లో॥ 16. నాతిక్రాంత మిదం లోకే పురుషే ణేహ కేన చిత్ । తవ సభ్రాతృభార్యస్య వాసః ప్రాకృతవ ద్వనే॥

వ్యా॥ సభ్రాతృభార్యస్య ప్రాకృతవత్ । అనాధస్యేవ। నే వాస ఇతి యత్ - ఇదం- ఏతాదృశ మహాకష్టం। కేనాపి పురుషేణ- ఇహలోకే వసతా । నాతిక్రాంతం- నానుభూతం। యుష్మాకం త్రయాణా మేవ కేవలం న వనేవాసః । కింతు-సర్వేఽపీహత్యాహ। నరా వనే స్థితా ఇతి నిశ్చిన్విత్యర్థః। సర్వజంతుదుఃఖమూలకం త్వదీయం వనవాసం కి మిత్యంగీకరోషీతి నైష్ఠుర్యోద్ఘాటనపూర్వకం నివర్తనోపాయం యాచత ఇత్యాకూతం॥

తా॥ "సభ్రాతృభార్యస్య" సోదరుని తోడను భార్య తోడను గూడిన నీకు "ప్రాకృతవత్" అనాధునివలె 'వనేవాస ఇతి యత్' వనమందు నివసించుట యేది కలదో 'ఇదం' ఇట్టి మహాకష్టము "ఇహ కేనచిదపి పురుషేణ" ఈ లోకమునందు నివసించెడి యే పురుషుని చేతను "నాతిక్రాంతం" అనుభవింప బడలేదు. కేవలము మీా ముగ్గురకే యీా వనవాసము కాదు. ఇక్కడ నుండెడి నరు లందరును వనమందున్నవా రనియే నిశ్చయింపుము. సమస్త జంతువులకు దుఃఖమును గలుగజేయునట్టి సంబంధమైన వనవాసము నెట్లంగీకరించుచుంటి వని నిష్ఠురముగ మాటలాడుచు, మరలెడి ఉపాయమును ప్రార్థించుచున్నా డని అభిప్రాయము.

స 52. శ్లో॥ 17. న మన్యే బ్రహ్మచర్యేఽస్తి స్వధీతే వా ఫలోదయః। మార్దవార్జవయో ర్వాపి త్వాం చే ద్వ్యసన మాగతం॥

వ్యా॥ వనవాసదుఃఖం తవ కించి దపి నాస్తి। కిం త్వస్మాక మేవేత్యాహ। త్వాం వ్యసనమాగతం చే త్ప్రాప్తం చేత్- బ్రహ్మచర్యాదికం త్వదీయం నిష్ఫల మేవ స్యా దతస్తదేకానుబంధిని త్వయి వ్యసనాభావ స్తర్క్యత ఇత్యర్థః॥

తా॥ వనవాసదుఃఖము నీ కేమియు లేదు. మాకే కలదని తెలుపుచున్నాడు. 'త్వాం వ్యసన మాగతంచేత్' నీవు దుఃఖమును పొందినట్లైతే నీ బ్రహ్మచర్యాదికము నిష్ఫలమే యగును. కావున నట్టి బ్రహ్మచర్య మొక్కదానితో గూడిన నీయందు దుఃఖములు లేకుండుట ఊహింపబడు చున్నదని యర్థము.

స 52. శ్లో॥ 18. సహ రాఘవ వైదేహ్యా భ్రాత్రా చైవ వనే వసన్ ! త్వం గతిం ప్రాప్స్యసే వీర త్రీన్ లోకాంస్తు జయన్నివ॥

వ్యా॥ వ్యసనాభావ మేవ సహేతుకం ద్రఢయతి- సహేతి। అత్యాప్త భ్రాతృభార్యాసంబంధేన వనే వసన్- సుఖే నైవ వనవాసం గమయన్। త్రిలోకాన్ జయన్నివ। "లక్షణ హేత్వోః క్రియాయాః" ఇతి హేత్వర్థే శతృప్రత్యయః। తజ్జయ రూపఫలాయ గతిం ప్రాప్స్యసే- ఉత్తమమార్గం ప్రాప్తు మిచ్ఛసీవ। వీరేతి సాభిప్రాయనం బోధనం। య దస్మదాదివ దత్యల్ప మేవ భౌమం రాజ్య మపేక్షసే తర్హ్యే తల్లోకోత్కర్ష ఏవస్యాత్ త్వం తు వీరత్వేన త్రిలోకవిజయాపేక్షయా పితృ

శాసనపరిపాలనరూపప్రశస్తమార్గాశ్రయేణ సుఖ మేవ వనే
వత్స్యసి । నహి ఫలాభిలాషిణ స్తత్సాధనప్రవృత్తిర్వ్యసనాయ-
ప్రత్యుతసుఖాయైవ' అన్యథా ప్రవృత్తి రేవ న సంభవతీతిభావః॥

తా॥ వ్యసనములు లేకుండుటనే సహేతుకముగ దృఢ
పఱుచుచున్నాడు. 'రాఘవ' శ్రీరామచంద్రా! "వైదేహ్యా
భ్రాత్రాచ సహ వనే వసన్" అత్యాప్తులయిన సోదరభార్యల
సంబంధముచే సుఖముగ వనవాసమును జేయుచు, "త్రిలోకాన్
జయన్నివ" మూడులోకములను జయించుచున్నవాడవువలె,
"గతింప్రాప్స్యసే" ఆ జయరూపమయిన ఫలముకొరకు ఉత్తమ
మార్గమును పొందుట కిచ్ఛగించుచున్న వాడవువలె నున్నావు.
"వీర" అనునది అభిప్రాయముతో గూడిన సంబోధనము. మా
వలె స్వల్పమైన భూమండలరాజ్యము నపేక్షించినచో ఈ
లోకమునందే కీర్త్యుత్కర్ష ముండును. నీవు వీరుడవు గాన,
త్రిలోకవిజయముకంటె ప్రశస్తమైన పితృశాసనపరిపాలనముచే
సుఖముగ వసింప గలవు. ఫలమును గోరువానికి దానిని సాధిం
చుటకైన ప్రవృత్తి దుఃఖమునకు గాదు. ఆలోచింపగ సుఖము
నకే యగును. లేకున్నచో ప్రవృత్తియే గలుగదని భావము.

స 52. శ్లో॥ 19. వయం ఖలు హతా రామ యే త్వయా ప్యుపవం
చితాః। కైకేయ్యా వశ మేష్యామః పాపాయా దుఃఖభాగినః॥

వ్యా॥ వయం ఖలు- వయమేవ- న తు త్వం । దుఃఖ
భాగినః- దుఃఖభజనైక శీలాః । తత్ర హేతు మాహ- కైకే
య్యా ఇతి । ఉత్తమేన త్వయా రాజన్వత్యాం పృథివ్యాం

సుఖం వత్స్యామ ఇతి సంకల్పమాత్రమేవ- న తు క్రియానిర్వృతి రస్మాక మభూ దిత్యర్థః। అపి శబ్దేన త్వ త్పిత్రా దశరథేన ఇతఃపూర్వమేవ వంచితా ఇతి లభ్యతే। దశరథ ఇవ త్వమ ప్యస్మా న్పరిత్యాజ్యాత్మోత్కర్ష మేవ కామయమానో వనం గతవా నసీతి దుఃఖప్రకటనం। త్వదీయ సంబంధవిఘటనేన దశరథః। త్వం తు పితృవాక్యపాలన సహాగమననిషేధాభ్యాం చాస్మా న వంచయ ఇతి భావః॥

తా॥ 'వయంఖలు" మేమే- నీవు కాదు. 'దుఃఖభాగినః' దుఃఖము నొందుటయే ముఖ్యమైన స్వభావముగా గలవారము. అందులకు కారణము "కైకేయ్యా వశమేష్యామః" కైకేయి వశము నొందుటయే. ఉత్తముడ వగు నీవు యోగ్యమయిన ప్రభువుగాగల భూమియందు సుఖముగ నుండెద మని మాకు సంకల్పమాత్రమే గాని క్రియానిష్పత్తి జరుగ లేదని యర్థము. "అపి" శబ్దముచే నీ తండ్రి యైన దశరథునిచే ఇంతకు పూర్వమే వంచింపబడినా మను నర్థము లభించుచున్నది. దశరథునివలె నీవును మమ్ములను వంచించి నీ యుత్కర్షనే కోరుచున్న వాడవై వనమునకు వెడలినావని దుఃఖమును ప్రకటించుట నీ సంబంధమును విఘటన చేయుటచే దశరథుడును, పితృవాక్యమును పాలించుటను గూడ వచ్చుటను నిషేధించుటచే నీవును, మమ్మును వంచించినావని భావము.

స 53. శ్లో॥ 21. మాస్మ సీమంతినీ కాచి జ్జనయే త్పుత్ర మీదృశం। సౌమిత్రే యోఽహ మంబాయా దద్మిశోక మనంతకం॥

వ్యా॥ స్వనిమిత్తం శోచంతీం మాతరం కౌసల్యా మను
ంవధానో భగవాన్ (శ్రీరామః పిత్రో) స్సంతోష హేతు రేవ
- పుత్ర స్సఫలో నాన్య ఇతి బోధయితుం పితరా వనుశోచతి
పంచాశత్సర్గే । తత్రేయ మపి కాచి ద్భంగీ మాస్మ సీచుంతి
తి । సౌమిత్రే ఇత్యనేన లక్ష్మణస్య స్వమాతృవిషయే సంతో
ాధాయకత్వేన ప్రశంసాం వ్యనక్తి । అత ఏవ త్వాం త్వన్మాతా
సుమిత్రా "గచ్ఛ తాత యథాసుఖ" మి త్యూచు దత్పాక్॥

తా॥ తన్నుగూర్చి దుఃఖించుచున్న తల్లియగు కౌసల్య
మనయించుచు భగవంతుడైన శ్రీరామచంద్రుడు, తల్లిదం
డ్రుల సంతోషమునకు కారణమైనవాడే పుత్రుడు, ఇతరుడు
కాడని తెలుపుటకై ఏబదిమూడవ సర్గలో తల్లిదండ్రుల గూర్చి
దుఃఖించుచున్నాడు. అందలి యొకరీతి యీశ్లోకమున దెలుప
బడినది. "సౌమిత్రే" సుమిత్రానందనా! యనుటచే లక్ష్మ
ణుడు తన తల్లికి సంతోషమును గూర్చువాడు గాన నాతని
ప్రశంస వ్యక్త మగుచున్నది. కావుననే నిన్ను నీతల్లి "కుమా
రా! యథాసుఖమున (వనమునకు) వెడలు" మని యింతకు
ముందు పలికియున్నది.

53. శ్లో॥ 22. మన్యే ప్రీతివిశిష్టా సా మత్తో లక్ష్మణశారికా ।
యస్యా స్త ద్ఛ్రూయతే వాక్యం శుక పాదమ రే ర్దశ॥

వ్యా॥ శారికా మత్తః మదపేక్షయా । ప్రీతివిశిష్టా-
ంబాయా మితి శేషః । తత్ర హేతుః । అరేః- హింస్ర
మా ఽస్మ జ్జాతీయానాం- సర్వేషాం దుర్నిమిత్తకసూచక

తయా చ। శత్రోః "బిడాలస్య పాదం దశ" ఇతి వాక్యం యస్యాః శ్రూయతే- పోషణమాత్రేణ మాతృవిరోధిసాధారణ్యేన గూఢార్థక మంబాహితాభిలాషేణ నిత్యం శారికయోచ్యమానం అంబా శృణోతి- తావన్మాత్రమ ప్యకుర్వాణస్య ప్రత్యుత తదప్రియ మేవ కుర్వతో మమ కిం నామ దుష్కరం పాప మితి భావః। యద్వా- అరేః- మాతృహితాకరణేన తద్వారాస్మాకం సర్వేషాం శత్రోః శ్రీరామస్య। పాదం- దశేత్యర్థకం మద్గతినివర్తనాభిప్రాయకం। శుకపాదమరేర్దశేతి యస్యా స్సంబంధి శ్రూయతే। అద్యాపి తదర్థానుసంధానబలేన దూరస్థే నాపి మయా శ్రూయత ఇవ। అత స్సా శారికా మత్తః మయి। ప్రీతివిశిష్టేతి- ప్రీతియుక్తేతి। మన్యే। అన్యథా మాతేవ మద్వనవాసనివర్తనాశయకం వాక్యం కిమితి సా బ్రూయా దితి భావః। అథవా- మత్తః- మయి। అప్రీతివిశిష్టా- ద్వేషయుక్తా। ఇతి మన్యే। కుతః। అరేః- మాతృవాక్యాకరణేన। శత్రోః పాదం దశ। అన్యథా అస్య గతినిరోధో నస్యా దిత్యాశయేన పూర్వోక్తవాక్యం శుకంప్రతి నబ్రూయాదితి వాభావః॥

తా॥ లక్ష్మణా "శారికా" చిలుక "మత్తః" నాకంటె "ప్రీతివిశిష్టా" తల్లియందు ప్రేమతో గూడినది. అందుకు కారణమేమన "అరేః" మావంటివారికి ఘాతుకమగుటచేతను, అందరకు అపశకునమును దెలుపున దగుటచేతను శత్రువైన పిల్లియొక్క "పాదందశ" పాదమును విరుగగొట్టుము "ఇతివాక్యం యస్యాః శ్రూయతే" అను వాక్యము ఏ చిలుకవలన వినుచు

న్నదో; పోషణమాత్రముచే తల్లికి విరోధియగుటలో సమాన మగుటచేతను గూఢార్థము వ్యక్తమగునట్లుగ తల్లికి హితవును గోరు నభిలాషచే ఎల్లపుడు చిలుక చెప్పెడు దానిని తల్లి విను చున్నది. అంతమాత్రమునైనను చేయనట్టియు, తిరిగి ఆమెకు అనిష్టమునే చేయుచున్న నాకు చేయ శక్యముగాని పాప మేమున్నదని భావము.

లేదా, "అరేః" తల్లికి హితమును చేయకపోవుట మూల మున మాకందరకు శత్రువైన శ్రీరామునియొక్క "పాదందశ" పాదమును హింసించుము. అనర్థము గలిగి నన్నును వెడలవల దను నభిప్రాయమును దెలుపు "శుకపాదమరేర్దశ" అను వాక్యము ఏ శుకమువలన వినబడుచున్నదో, అట్టివాక్య మిప్పటి కిని ఆ యర్థానుసంధానము చేయుచుండుటచే దూరమం దున్నను నాచే వినబడుచున్నది వలె నున్నది. కావున నాచిలుక "మత్తఃప్రీతి విశిష్టా" నాయందు ప్రీతిగలదని "మన్యే" తలచు చున్నాను. లేకున్నచో, తల్లివలె నాచిలుకయు నన్ను వెడల వలదను నభిప్రాయముతో గూడిన వాక్యము నేల పలుకును.

లేదా, "మత్తః" నాయందు "అప్రీతివిశిష్టా" ద్వేష ముతో గూడినదని "మన్యే" తలచెదను. "అరేః" తల్లి వాక్య మును చేయకుండుటచే శత్రువైనవాని "పాదందశ" పాదమును హింసింపుము. లేకున్న సీతని గమనము నిరోధింప బడదను నభి ప్రాయముతో శుకమును గూర్చి వెనుకజెప్పిన వాక్యమును పలుకు చుండెడి దని భావము.

స 59. శ్లో॥ 4. విషయే తే మహారాజ రామ వ్యసనకర్శితాః।
అపివృక్షాః పరిమ్లానా స్సపుష్పాంకురకోరకాః॥

వ్యా॥ సపుష్పాంకురకోరకాః- పుష్పితా అపి- అంకురితా అపి- కోరకితా అపి । తే విషయే- స్థితాః- త్వద్దేశస్థితాః వృక్షాః । పరిమ్లానాః- సర్వాత్మనా ఛిన్నమూలా ఇవ క్షీణా బభూవు రిత్యర్థః- త్వదాజ్ఞావశా దత్యంతదోహదసంపన్నా అపి, రామవ్యసనకర్శితా స్తద్వియోగజన్యక్లేశేన హతా దశనిహతా ఇవాక్షయా న్నితి భావః । శ్రీరామవనవాసప్రయోజకస్య త్వాదృశస్య కునృపస్య దేశే స్థిత్యా రజస్వలాదిసంపర్కదోషేణ లతావిశేషా ఇవ కోమలభావశూన్యా అభవ న్నితి వా భావః। కించ- సత్యపాలనార్థం పుత్రవియోగదుఃఖ మపి సోఢ్వా ధర్మానువర్తిన స్తవాపి దేశే స్థితా వృక్షాః రామవిశ్లేషజన్యదుఃఖప్రయుక్తనిస్సారభావాస్సంతః । పరిమ్లానా ఇతి- స్థావరాణామపి స్వవిషయే ప్రేమభావ ముత్పాదయత స్తస్య గుణగరిమా కీదృశ ఇతి వర్ణ్యత ఇతి భావః॥

తా॥ "సపుష్పాంకురకోరకాః" పుష్పించినవియు, చిగిర్చినవియు, మొగ్గ తుడిమినవియు నైనను "తేవిషయేస్థితాః వృక్షాః" నీదేశమందున్న వృక్షములు, "పరిమ్లానాః" పూర్తిగ ఛేదింపబడిన మూలము గలవి వలె క్షీణించిన వని యర్థము. నీ యాజ్ఞవలన దోహదముతో గూడిన వయినను 'రామవ్యసకర్శితాః' శ్రీరాముని వియోగమువలన గలిగిన క్లేశముచే హఠాత్తుగ పిడుగు పడినట్లుగ క్షీణించిన వని భావము. శ్రీరా

ముడు వనవాసమున కేగుటకు ప్రేరకుడవైన నీవంటి దుష్టప్ర భువుయొక్క దేశమం దుండుటచే, రజస్వలలైన స్త్రీల సంపర్క ముచే లతావిశేషములువలె, కోమలభావము లేనివైనవని భావము.

మఱియు, సత్యపాలనమునకై పుత్రుని వియోగము వలన గలిగెడి దుఃఖమునుగూడ సహించి, ధర్మమును పాలించెడి నీ దేశమునందును ఉన్నవృక్షములు, రాముని వియోగముచే గలిగిన దుఃఖముచే సారహీనములై వాడిపోయినవి. కావున స్థావరములకుగూడ తన విషయమున ప్రేమభావమును గలిగించెడి శ్రీరాముని గుణమహత్త్వ మెట్టిదని వర్ణింప వచ్చు నని భావము.

స 63. శ్లో॥ 7. గురులాఘవ మర్థానా మారంభే కర్మణాం ఫలం।
దోషం వా యో న జానాతి స బాల ఇతి హోచ్యతే॥

వ్యా॥ కర్మణామారంభే- లౌకికానాం వైదికానాం వా క్రియాణా మారంభకాలే। అర్థానాం తత్ప్రవృత్తివిష యాణాం। గురులాఘవం స్వకృత్యసాధ్యత్వాసాధ్యత్వే ఫలం- తత్త్రక్రియాప్రయుక్తం ప్రవృత్త్యుద్దేశ్యం। దోషం వా- పరి ణామకాలే అనర్థకారీ। యో న జానాతి స బాలః- మూర్ఖః ఇతి ఉచ్యతే। హ- హేతి ప్రసిద్ధౌ। చోదనామాత్రేణ ప్రాజ్ఞః కార్యమాత్రే న ప్రవర్తేత- కింతు తచ్చోద్యస్య స్వకృతిసాధ్య త్వం తత్ఫలస్య పరిణామదశాయా మనిష్టానావహత్వం ప్రథ మతో నిశ్చిత్యై వేత్యర్థః। గురులాఘవ మిత్యత్ర గురుపదం

గురుత్వపరం- తత ఉభయో "ర్విప్రతిషిద్ధం చానధికరణవాచీ" త్యనేన సాక్షికో ద్వంద్వైకవద్భావః॥

తా॥ "కర్మణామారంభే'' లౌకికము లైనట్టిగాని, వైదికము లైనట్టిగాని క్రియల నారంభించు సమయమున 'అర్థానాం' ఆ కర్మల ప్రవృత్తివిషయముల యొక్క- 'గురులాఘవం' తన ప్రయత్నమునకు సాధ్యమగుట కాకపోవుటలును, "ఫలం" ఆ క్రియలను గురించిన ప్రవృత్త్యుద్దేశమును, "దోషం" ఫలకాలమున అనర్థమును గలుగజేయు దోషమునుగాని "యో నజానాతి" ఎవడెఱుగడో "సః బాలః ఇతిహోచ్యతే" ఆతడే మూర్ఖుడని చెప్పబడుచున్నాడు.

ప్రాజ్ఞుడు చోదన (ప్రేరణ) కలిగినంతనే ప్రతి కార్యము నందును ప్రవర్తింపగూడదు. ఆ కార్యము ఎంతవఱకు తన యత్నమునకు సాధ్యమో, దానివలన గలుగు ఫలము పరిణామ దశయందు అనిష్టమును గలుగజేయునా, యను విషయములను బాగుగ నిశ్చయించుకొనియే ప్రవర్తింపవలె నని యర్థము. "గురులాఘవం" అనుచోట "గురు" పదమునకు "గురుత్వ" మను నర్థము గ్రహింపదగును. పిమ్మట "విప్రతిషిద్ధం" ఇత్యాది సూత్రముచే ద్వంద్వసమాసమున వైకల్పికమయిన ఏకవద్భావము.

స 85. శ్లో॥ 2. ఊర్జితగ ఖలు తే కామః కృతో మమ గురోస్సఖే। యో మేత్వ మీదృశీం సేనా మేకోఽభ్యర్చితు మిచ్ఛసి॥

వ్యా॥ మమ గురోః శ్రీరామస్య సఖే । త్వయా కృతః కామః సంకల్పః-। ఊర్జితః- ఉదారః । తత్సఖిత్వే న తవైతాదృశ మౌదార్యం యుక్తమే వేతి భావః। యద్వా- ఈదృశీం మహతీం మమ సేనాం ఏకః ధనాదిసహాయశూన్యః త్వ మభ్యర్చితు మిచ్ఛసీతి యత్- హే సఖే అయం కామః మమ గురోః కృతః- సపరివారస్య మమ తచ్ఛేషత్వాదేవేతి భావః । అతః ఊర్జితః॥

తా॥ "మమగురోఃసఖే" నా అన్నగారగు శ్రీరాముని చెలికాడా! "తేకామః" నీచే జేయబడిన సంకల్పము 'ఊర్జితః' ఉదారమయినది. వానికి స్నేహితుడ వగుటచే నీ కిట్టి యౌదార్యము తగినదే యని భావము.

లేదా, "ఈదృశీం మహతీంసేనాం" ఇట్టి గొప్ప సేనను "ఏకః" ధనాది సహాయము లేనివాడ వయ్యును, 'త్వమభ్యర్థితు మిచ్ఛసీతి యత్' నీవు పూజించుట కిచ్ఛగించుట యేది కలదో, "హేసఖే" ఓ చెలికాడా! "అయంకామః" ఈ సంకల్పము "మమగురోఃకృతః" నా అన్నగారికి చేయబడినది. పరివారముతో గూడిన నేనును వారికి శేషభూతుడనే గాన వారికి చేసినట్లే అని భావము. కావుననే "ఊర్జితః" గొప్పది.

స 85. శ్లో॥ 9. మాభూ త్సకాలో యత్కష్టం నమాం శంకితు మర్హసి। రాఘవ స్సహి మే భ్రాతా జ్యేష్ఠః పితృసమో మతః॥

వ్యా॥ యత్- యదా । కష్టం ప్రతి- రామస్య వనవాసకల్పనరూప పాపం ప్రతి । మాం శంకితుం- కారణత్వేన

తర్కితుం। నార్హసి- సకాలః మాభూత్కిమితి కాకుః। భవిష్యత్యేవేతి యోజనా। యాదృశకాలే త్వాదృశానా మీదృశశంకానివృత్తిస్స్యాత్సకాల ఏవత్వాం సమాధత్తే। కిమిదానీం మదీయోత్తరేణేతి భావః। సర్వాత్మనా పూజ్యస్య మద్భ్రాతుర్వనవాసే యథాకాల ఏవ కారణం। తథా తద్విషయే మదపవాదనివృత్తావపి కాల ఏవ కారణ మితి తాత్పర్యం। తత్కాలపర్యంతం సంశయాత్మతా మమ కష్టా- అతో వాచా మమయోత్తరమా వేదయేత్యత ఆహ। రాఘవ ఇత్యాది బ్రవీమి తే ఇత్యేతదంతం। అథవా- యత్కష్టం- యత్కాలప్రయుక్తం పాపం- మాం శంకితుం నార్హసి- మయ్యారోపయితుం నశక్నోషి। సకాలో మాభూత్కిమితి కాకుః। కాలప్రయుక్తస్య శ్రీరామ వనవాసస్య మయి హేతుత్వ మజ్ఞానా త్కల్పయసీతి భావః। అత్రార్థే మత్ప్రవృత్తిరేవ తే ప్రమాణ మిత్యాహ- రాఘవ ఇత్యాది॥

తా॥ 'యత్' ఏ సమయమున 'కష్టంప్రతి' రామునకు వనవాసము కల్పించుట యనెడి పాపమునుగూర్చి "మాంశంకితుం" నన్ను కారణముగా తలుచుటకు "నార్హసి" తగవో, "సకాలఃమాభూత్కిం" అట్టికాలము లేనుగదా? కలుగుననియోజన. ఏకాలమున మీవంటివారల కిట్టి శంకానివృత్తి కలుగునో అట్టి కాలమే నిన్ను సమాధాన పరుచును గాన నిప్పుడు నా సమాధానముతో నేమి ప్రయోజన మని భావము. సర్వవిధములచే పూజ్యుడైన నా సోదరుని వనవాసమందు కాల

యట్లు కారణమో, అటులనే ఆవిషయమున నా యపవాదము
గలుగుటయందును కాలమే కారణమని తాత్పర్యము. ఆ
కాలమువరకు సంశయముతో గూడియుండుట నాకు కష్టము.
కావున వాక్కుచే నాకు సమాధానము దెలుపుమని "రాఘవ"
యనునది మొదలు "బ్రవీమి" అనునంతవరకు నుండెడి వాక్య
ములచే చెప్పుచున్నాడు.

లేదా, 'యత్ కష్టం' కాలముచే ప్రయుక్తమైన పాపమేది
గలదో 'మాం శంకితుం నార్హసి' దానిని నాయం దారోపింప
గవు. "స కాలో మాభూత్ కిం" ఆకాలముండదా ? కాలముచే
యమింపబడిన శ్రీరాముని వనవాసమును నాయం దారో
పించుచున్నావని భావము. ఈవిషయమున నా ప్రవృత్తియే
ప్రమాణమనుటకు "రాఘవః" ఇత్యాదికమును నిరూపించినాడు.

88. శ్లో॥ 10. అశ్రద్ధేయ మిదం లోకే న సత్యం ప్రతిభాతి
మా। ముహ్యతే ఖలు మే భావ స్స్వప్నోయ మితి మే మతిః॥

వ్యా॥ రామస్య భూశయనాది కష్టదర్శనేన వ్యథితమ
నాః భరతో వికల్పయతి। ఇదం రామస్య భూశయనాదికం
లోకే అశ్రద్ధేయం- కస్యాపి విశ్వాసానర్హ మిత్యర్థః। వస్తుతస్తు
ఇదం మాం సత్యం న ప్రతిభాతి- మమైవ సత్యతయా న ప్రతి
భాతీత్యర్థః। సాక్షా త్పశ్యతో మమ కి మనేన వికల్పేన!
ముహ్యతే ఖలు మే భావః- కుతశ్చి త్కారణా న్మమ చిత్త
మోహ ఏవేద్ధం సంపన్న ఇతి। నాయం మోహః- కింతు
స్వప్న ఏవాయం ఇత్యాదినా॥

తా॥ శ్రీరామునియొక్క భూమియందు నిద్రించుట మున్నగు కష్టములను జూచి వ్యథనొందిన చిత్తముగల భరతుడు పరిపరివిధముల వితర్కించుచున్నాడు.

'ఇదం' ఈ శ్రీరాముని భూశయనాదికము, "లోకే అశ్రద్ధేయం" లోకమందు విశ్వసింప తగనిది. ఎవనికిని విశ్వసింప తగినది కాదని యర్థము. వాస్తవమునకు 'ఇదం మా సత్యం న ప్రతిభాతి' ఇది నాకే సత్యముగా గన్పట్టుట లేదని యర్థము. ప్రత్యక్షముగ చూచుచున్న నాకీ వికల్పముతో నేమి ప్రయోజనము? "ముహ్యతే ఖలు మే భావః" ఒకానొక కారణమువలన నా చిత్తమునకు గలిగిన మోహమే ఇట్లు సంభవించినది. "నాయం మోహః" ఇది మోహము గాదు. "స్వప్నోఽయమితి మే మతిః" ఇది స్వప్నమనియే నా యభిప్రాయము.

స 105. శ్లో॥ 4. సాంత్వితా మామికా మాతా దత్తం రాజ్యమిదం మమ। తద్దామితవై వాహం భుంక్ష్వ రాజ్యమకంటకం॥

వ్యా॥ లోకే హి స్వప్రవృత్తిప్రతిబంధే స్వమాతరమేవ న మానయతి ప్రాయశః పుత్రః- కిముత సపత్నీమాతరం- త్వం తు మామికామపి మద్వృద్ధినిమిత్తవ్యాపారామపి కైకేయీమసాంత్వయః తదభీష్టసంపాదనాయాయతిష్ఠా ఇత్యాహ- సాంత్వితా మామికా మాతేతి। అస్మత్పిత్రాదిభిరనాదృతాఽపి సుధియా త్వయా సంమ్మానితేత్యర్థః। న కేవలం మన్మాతృసాంత్వనమేవ తదాజ్ఞాపరిపాలనేన- కింతు యావదపి రాజ్యం

మదధీనీకృతం త్వయేత్యాహ- దత్తం రాజ్య మిదం మ మేతి ।
న్యాయత స్త్వదీయ మపి రాజ్యం మదీయజననీకామపూర్త్యే
కరణత్రయేనాపి మహ్య మర్పితం త్వయా- మయాతు నాంగీ
కృతం । అత స్తదీయప్రతిబంధకశాంత్యై తవై వేదం రాజ్యం
పున స్త్వ మంగీకృత్య మన్మాతృహాపశత్రుసంపర్కాభావా
దనావిలం పాలయేత్యాహ- తద్దదామీత్యాది॥

ఇతి శ్రీమద్రామాయణే అయోధ్యాకాండే హారితస
గోత్రోద్భవేన బొమ్మకంటి నృసింహశాస్త్రిణా
విరచితాయాం కల్పవల్లికాఖ్యాయాం
వ్యాఖ్యాయాం తృతీయః కిసలయః॥

---

తా॥ లోకమందు తండ్రిగ పుత్రుడు తన ప్రవర్తనకు ప్రతిబంధకము కలిగినపుడు తన తల్లినే గౌరవింపడు. సవతితల్లిని గౌరవింపడని చెప్పనేల? నీ వన్ననో నా వృద్ధికొఱకే ప్రయత్నించుచున్న నాతల్లియగు కైకను ఓదార్చినావు. ఆమె యభీష్టమును సంపాదించుటకు ప్రయత్నించితి వని చెప్పుచున్నాడు. "సాంత్వితా మామికామాతా" మాతండ్రి మున్నగువారిచే ఆదరింపబడకున్నను సద్బుద్ధి గల నీచే నాతల్లి ఆదరింప బడినది. ఆమె యాజ్ఞను పరిపాలించుటచే నా తల్లి నోదార్చుట మాత్రమే కాదు. రాజ్యము నంతను నా యధీనము చేసినావనియు దెలుపు చున్నాడు. "దత్తం రాజ్యమిదంమమ" న్యాయమునను రాజ్యము నీదైనను, నా తల్లికోరికను పూర్తిచేయుటకు త్రికరణశుద్ధిగ నా కర్పించినావు. నేనుమాత్ర మంగీకరింపలేను. కావున ఆమెప్రతిబంధము శాంతించినది; గాన నీదగు రాజ్యమును తిరిగి నీ వంగీకరించి, నా తల్లి యను శత్రుసంపర్కము లేకుండుటవలన నిష్కలంకముగ రాజ్యమును పాలింపుమని భరతుడు ప్రార్థించుచున్నాడు. "తద్దదామి..." మున్నగు వాక్యముల కిదియే యభిప్రాయము.

ఇట్లు శ్రీహరితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహ
శాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ
కల్పవల్లికా వ్యాఖ్యానమందు తృతీయ
కిసలయము సంపూర్ణము.

---

శ్రీరామస్య స్వీయాభిషేకప్రసంగే పితురంతికే స్వీయసహజాను
రాగపాత్రే భరతే ఆదరపూర్వకం తదాహ్వానకథాప్రసంగా
భావేన తస్య సచ్చారిత్రవిషయే కేషాంచి త్సందేహో
భవతీతి తన్నిర్ణయార్థ మయం ఘట్ట ఆరభ్యతే।

తథాహి- స్వీయపట్టాభిషేకప్రసంగే దశరథేన ప్రస్తూ
యమానే భరతే సహజానురాగో రామ స్తదాహ్వానప్రసంగం
కిమితి నాకృత । కించ- "సుహృద శ్చాప్రమత్తా స్త్వాం రక్షం
త్వద్య సమంతతః । భవంతి బహువిఘ్నాని కార్యాణ్యేవం
విధాని హి। విప్రోషిత శ్చ భరతో యావదేవ పురాదితః ।
తావదే వాభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ। కామం
ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతస్థితః । జ్యేష్ఠాను
వర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః। కింతు చిత్తం మను
ష్యాణా మనిత్య మితి మే మతిః । సతాం తు ధర్మనిత్యానాం
కృతశోభి చ రాఘవ। ఇత్యాది సందర్భేణ స్వీయయౌవరాజ్య
విషయే భరతా త్ప్రతిబంధ మాశంకమానస్య దశరథస్య తదీ
యగుణప్రకటనద్వారా తదాశంకాం కిమితి వా నపరిహృతవా
న్నామ ఇత్యాదినా విమృశ్య శ్రీరామచారిత్రే కలంక ఇతి। అత
స్తదాశయప్రకటనముఖేన త దాశంకా వార్యతే । దశరథో హి
స్వపుత్రచతుష్టయమధ్యే స్వానుభవేన సర్వప్రజాసమ్మతా చ
శ్రీరామ ఏవ రాజ్యాధికారయోగ్యగుణసంపత్తిం నిశ్చిత్య
భరతాద్యపేక్షయాపి రామస్య గుణశ్రేష్ఠతాం చాధ్యవ
సాయ రామస్యైవాభిషేకప్రయత్న మకృతేతి సర్వంసంప్రతి

పన్నం । తత్రాపి స్వస్య దైవికనిమిత్తవశా దసుభ మచిరభా వ్యతః శ్వ ఏవ పుష్యయోగరూపశుభ కాలవశా ద్రాజ్యస్వీకార ఆవశ్యక ఇతి చ పౌనః పున్యేవ దశరథో రామ మత్వరత్ । ఏవం స్థితే పితృహృదయపరిజ్ఞానపూర్వకం తచ్ఛాసనాను మోదీ ప్రాజ్ఞో రామో రాజాజ్ఞాభావేఽపి కథం భరతాహ్వాన ప్రసంగం స్వయం చికీర్షేత్ । కిం చానేకసామంతరాజన్య సమానయనాభిలాషేణ దశరథ స్స్వమంత్రిణ స్తదాకార ణా యాజ్ఞాపయన్ జనక కేకయనృపతీ ఏకాత్యంతావశ్యకావపి ప్రకృతపట్టాభిషేకకార్యాయ సమానేతుం న ప్రాయతిష్ఠ । అత ఏవ "న తు కేకయరాజానం జనకం వా నరాధిపః । త్వరయా చానయామాస పశ్చా త్తౌ శ్రోష్యతః ప్రియం" ఇతి సంగతం । త దనుమోదాభావ శ్చాత్యంతావిలంబేన స్వాదికీర్షితే రామ పట్టాభిషేకకార్యే దూరదేశవర్తిత్వేన తయో రాగమనావ కాశాభావనిమిత్తక ఇతి వ్యాఖ్యాత మభియుక్తైః । యద్యపి- "సుహృదశ్చాప్రమత్తాస్త్వా" మిత్యాది పూర్వోదాహృత శ్లోక చతుష్టయార్థపర్యాలోచనే రాజ్యవిషయే భరతచిత్తసామం జస్యే సందిహానో దశరథః భరతసౌశీల్యప్రకటనద్వారా శ్రీరా మేణ సమాధేయోఽపి తథా న కృత ఇతి తస్మి న్నాక్షేపబీజం కించి త్స్ఫురతి కేషాంచిత్ । తథాపి- "మద్విధా వా పితుః పుత్రా స్సుహృదో వా భవద్విధాః । న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతోపమా"॥ ఇత్యాదినా భరతే ప్రకటితసర్వో త్కృష్టసౌభ్రాత్రధర్మోఽపి రామః రావణజయానంతరం చిత్ర

సూటే భరతం ప్రతి స్వకృతప్రతిజ్ఞానుసారేణ తత్సమాగమత్వర యాఽచిరేణైవ పుష్పకేణాయోధ్యా మాగచ్ఛన్నంతరా భర ద్వాజాశ్రమం ప్రాప్య స్వాగమనసుభవృత్తాంతప్రతివేదనద్వారా భరత మానందయితు మాంజనేయం ప్రేషయ న్నపి రామః "పితృపైతామహం రాజ్యం కస్య నావర్తయే న్మన" ఇత్యాదినా తదీయేంగిత మవశ్యం త్వయా జ్ఞాత్వా సమాగంతవ్యం। యది భరతో రాజ్యకాంక్షీతి జానీయా స్తదా న పురం ప్రవి శామి। యది నాపేక్షేతేతి తర్హి పురం ప్రవిశా మీత్యాశ యేన ప్రాయశో ధనవిషయే నివృత్తిధర్మా న కశ్చి దపి సంసారీతి జ్ఞాతవ్య మపరిశీలనా త్ప్రాగితి నిశ్చినోతీతి కథం సామాన్య ధర్మానుసారేణ బ్రువాణం దశరథం విశేషతో భరతా న్నివ ర్తయే దితి వక్తుం శక్యం। ఏవం చ పితృవాక్య మేవ శబ్ద తోఽర్థత శ్చానువర్తనీయం- న తు తత్ర ప్రాతికూల్యవిచార ణార్హ తాస్మాకం- కిం పునా రాజ్ఞ ఇతి విశ్వాసమూలకం ప్రవర్తమానే రామే భరతగుణప్రకటనం వా త దానయన ప్రయత్నోద్ఘాటనం వా పితృసమీపే ఽనుచిత మిత్యే వా స్మాభి రేష్టవ్యం। వస్తుతస్తు రాజ్యం లబ్ధ్వాపి సర్వం శబ్దమా త్రేణ స్వస్య ప్రభుత్వేఽపి రాజ్యసంబంధి యావత్ఫలస్వా మిత్వం భరతే యోజయితుం కామస్య తస్య గుణాతిశయ ఏవ ప్రకాశతే। అత ఏవ కైకేయీం ప్రతి "అహం హి సీతాం రాజ్యం చ ప్రాణానిష్టాన్ ధనాని చ। హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతా యాప్రచోదిత" ఇతి స్వాశయం

కైకేయీం ప్రతి ప్రాకట్యేన దిత్యూహ్యం । దశరథస్యాపి కైకేయీపరిణయకాలికప్రతిజ్ఞాయా అపరిపాలనం చ నాధర్మేణ । కింతు- తత్ప్రతిజ్ఞాయా లోకరీత్యా స్వస్మాత్ కైకేయీ గర్భసంభూతపుత్రవిషయిణ్యా అసిద్ధ్యా దైవానుగ్రహలబ్ధపుత్రవిషయే అప్రవృత్తి రిత్యాశయేనైవ । తత్రాపి- సర్వప్రజానుకూల్యం రామ ఏవ జ్ఞాత్వా తదీయ జ్యేష్ఠత్వాది హేతువిశేషైః తస్యైవాభిషేకం చికీర్షోః ధార్మికత్వ మేవ ప్రతిభాతీతి సంతోష్టవ్యం । అన్యథాఽఽత్మమరణ మవశ్యంభావితయా నిశ్చిన్వానోపి దశరథః కథం కైకేయీవరద్వయం సఫలయాం చకారేతి సుధీభి రాస్థేయ మిత్యలం॥

తా॥ శ్రీరామచంద్రుడు తన పట్టాభిషేక ప్రసంగము తండ్రి సమక్షమున జరిగినపుడు, తన సహజానురాగమునకు పాత్రుడయిన భరతుని విషయమున ఆదరపూర్వకముగ నాతనిని ఆహ్వానింపవలెనను మాటనైన తలపెట్టకపోవుటచే అట్టిది శ్రీరాముని సచ్చరిత్ర విషయమున కొందరకు సందేహమును కలిగించుచున్నదని యీ ఘట్ట మారంభింపబడుచున్నది.

తన పట్టాభిషేక ప్రసంగము దశరథునిచే స్తుతింపబడు చుండ, భరతునియందు సహజప్రేమగల శ్రీరాముడు ఆతని నాహ్వానింపవలెనను ప్రసంగము నేల చేయలేదు ?

మఱియు, "స్నేహితులును ప్రమాదము లేనివారై నిన్నంతటను రక్షింతురుగాక. ఇట్టి కార్యము లనేకవిధములైన అంతరాయములతో గూడియుండును. "భరతు డెంతవరకు ఈ

పురమును వీడి పరదేశమునకు వెడలి యుండునో, ఆ లోపుననే నీ పట్టాభిషేకము జరుపుట తగునని నా యభిప్రాయము"

"నీ సోదరు డగు భరతుడు సత్పురుషులు నడుచుమార్గ మునందే ఎల్లపుడును సంచరించుచున్నాడు. జ్యేష్ఠు ననుసరించు వాడు ధర్మాత్ముడు, దయతో గూడినవాడు జితేంద్రియుడు (నై యున్నాడు). కాని మనుజుల చిత్తము అనిత్యము. ధర్మమే నిత్యముగా గల సత్పురుషుల చిత్త మన్ననో యేది ప్రథమమున నిశ్చిత మగునో దానిచేతనే శోభించునది" ఈ మున్నగు సంద ర్భములచే తన యౌవరాజ్యపట్టాభిషేకవిషయమున భరతుని వలన ప్రతిబంధము నూహించుచున్న దశరథునకు కలిగిన శంకను శ్రీరాము డా భరతుని గుణములను దెలిపి ఏల పోగొట్ట లేదు? అని విమర్శించి, శ్రీరాముని చరిత్రమున కిది యొక కళంక మనిరి. కావున ఆ యా యభిప్రాయముల ప్రకటించి ఆ శంకను నివారించువాడ. దశరథుడు తన నలుగురు పుత్రుల యందు శ్రీరామునకే రాజ్యాధికారమునకు తగిన గుణసంపత్తి కలదని, తన యనుభవముచేతను, సమస్తప్రజల యనుమతి తోడను నిశ్చయించి, భరతాదులకంటె శ్రీరామునియందు శ్రేష్ఠగుణములు కలవని నిర్ధారణచేసి, శ్రీరామునకే పట్టాభి షేక ప్రయత్నము చేసినాడనునది అందరకు తెలిసిన విషయమే.

అందునను తనకు దైవికముగ నమంగళము శీఘ్రముగ కలుగనై యున్నది గాన రేపే పుష్యయోగముతోగూడిన శుభకాలమున రాజ్యస్వీకార మావశ్యక మని దశరథుడు మాటి మాటికి శ్రీరాముని తొందర జేసెను. ఇట్లుండ, తండ్రి హృద

యమును దెలిసికొనుచు ఆతని యాజ్ఞను శిరసావహించు నట్టి శ్రీరాముడు రాజాజ్ఞ లేదన్నను భరతుని పిలువ బంప వలెనను ప్రసంగము తనంతట తానే ఎట్లు చేయును. మఱియు అనేకసామంతరాజులను రప్పింపవలె నను నభి లాషచే దశరథుడు తనమంత్రులను వారి వారిని బిలుచుటకై యాజ్ఞాపించుచు, మిక్కిలి యావశ్యకులగు జనక కేకయరాజులనే, ప్రస్తుత పట్టాభిషేక మహోత్సవమునకై రప్పించుటకు యత్నింప లేదు. కనుకనే "కేకయదేశ ప్రభువును గాని, జనకుని గాని, తొందరచే దశరథుడు, రప్పించలేదు. ఈ ప్రియవార్తను తరువాత వారు విందురు" అను వాక్యము సంగత మగుచున్నది. వారి యనుమోదము లేకుండుటయు, మిక్కిలి శీఘ్రముగ తాను చేయదలచిన శ్రీరామపట్టాభిషేకకార్యమునందు దూరదేశమం దుండుటచే వారు వచ్చుట కవకాశము లేకుండుట వలననే యని పెద్ద లీ శ్లోకమునకు వ్యాఖ్యానము చేసిరి.

"సుహృదశ్చాప్రమత్తాస్త్వాం" ఇత్యాది శ్లోకచతుష్టయమున కర్థపర్యాలోచనము చేయగ రాజ్యవిషయమున భరతుని చిత్త సామంజస్య మెట్లుండునో యని సందేహించుచున్న దశరథునకు, భరతుని సౌశీల్యమును ప్రకటించి శ్రీరాముడు సమాధానము చెప్పవలసినదే. కాని అట్లు చేసినాడు కాడను ఆక్షేపబీజము కొందఱ మనమున స్ఫురించును. అయినను "తండ్రికి నా వంటి పుత్రులు, నీవంటి స్నేహితులు, భరతునివంటి సోదరులు అందఱు కలుగరు" అని భరతుని విషయమున సర్వోత్కృష్టమైన సౌభ్రాత్రమును ప్రకటించిన శ్రీరామునకు, రావణుని జయిం

చిన పిమ్మట, చిత్రకూటపర్వతము నందు భరతునిగూర్చి తాను చేసిన ప్రతిజ్ఞ ననుసరించి ఆతనితో కలియవలె నను తొందర చే, శీఘ్రముగ పుష్పక విమానమున అయోధ్య కేతెంచుచు, మధ్య ను భరద్వాజాశ్రమమున నిలిచి, తాను వచ్చుచున్న శుభ వృత్తాంతమును దెలిపి భరతు నానందింప జేయుటకు ఆంజ నేయుని బంపుచును శ్రీరాముడు "పితృపితామహ క్రమాగత మైన రాజ్య మెవని మనస్సును త్రిప్పివేయదు." మున్నగు రీతిని భరతుని అభిప్రాయమును గుర్తెఱింగిరమ్మనెను. "భరతుడు రాజ్యాభిలాషియై యున్నాడని తెలిసికొందు నేని తిరిగి అయో ధ్యను ప్రవేశించువాడను గాను. రాజ్యము నపేక్షింప డేని పట్ట ణము ప్రవేశింతును." ఇట్టి యభిప్రాయముచే దక్షుడుగ పరిశీ లించుటకు పూర్వమందు ధనవిషయమున నివృత్తిధర్మముగల సంసారి యెవ్వడును ఉండ డని దెలియ దగునని నిశ్చయించు చున్నాడు. ఇట్టివాడు సామాన్యధర్మము ననుసరించి పలుకు చున్న దశరథుని విశేషముగ భరతుని వలన నెట్లు నివారించు నని చెప్పవచ్చును. కావున, పితృవాక్యమే శబ్దమునను అర్థమునను అనువర్తింప తగినది. దానికి ప్రతికూలముగ ఆలోచించు నర్హత మనకు లేదు; రాజునాజ్ఞ వేరె చెప్పనేల? అను విశ్వాస ముతో ప్రవర్తించు శ్రీరాముడు భరతుని గుణములను ప్రకటిం చుటగాని, ఆతని పిలువ బంపుటకైన ప్రయత్నమును వెల్లడిం చుటగాని, తండ్రి సమీపమున అనుచిత మనియే మనము తలంప వలయును. వాస్తవమునకైతే రాజ్యము నంతను పొంది యును, శబ్దమునకు మాత్రము తాను ప్రభువైనను, రాజ్య

మునకు సంబంధించిన యావత్ఫలభోక్తృత్వమును భరతునకే సమకూర్ప నిచ్ఛ గలిగిన శ్రీరాముని గుణాతిశయమే విరాజిల్లు చున్నది. కావుననే "నేను భరతుని కోరకుండగనే, సీతను, రాజ్యమును, ఇష్టములగు ప్రాణములను, ధనములను, స్వయముగనే సంతసించుచు నిచ్చెదను" అని కైకేయిని గూర్చి శ్రీరాముడు తన యభిప్రాయమును దెలిపినాడని యూహించుకొన దగినది.

దశరథుడును కైకేయిని వివాహమాడు సమయమున జేసిన ప్రతిజ్ఞను నిర్వహింప కుండుట అధర్మముచే గాదు. ఆతని ప్రతిజ్ఞ లోకరీతిచే తనవలన కైకేయిగర్భమున జనించిన పుత్రు నుద్దేశించినది గాన, అట్టి ప్రతిజ్ఞావిషయము సంభవించనే లేదు గాన, దైవానుగ్రహమువలన గలిగిన పుత్రుని విషయమై ప్రవృత్తియే లేదని యభిప్రాయము. అందును రామునందే ప్రజలందరకు గల యానుకూల్యమును దెలిసికొని, ఆతని జ్యేష్ఠత్వాదికారణవిశేషములచే ఆతనికే పట్టాభిషేకము చేయ నిచ్ఛయించిన దశరథునకు ధార్మికత్వమే భాసించు చున్నదని సంతోషింపనగును. లేకున్నచో తనకు మరణము తప్పక కలుగునని నిశ్చయించుకొనిన దశరథుడు, కైకేయి కిచ్చిన రెండువరముల నెట్లు సఫల మొనర్చెనని విద్వాంసు లూహించుకొనవలెను.

ఇది బొమ్మకంటి వంశోద్భవ, నృసింహశాస్త్రి జ్యేష్ఠపుత్ర, రామలక్ష్మీగర్భసంజాత, బుధజనవిధేయ, సుబ్రహ్మణ్యశాస్త్రి విరచితం బైన ఆంధ్రతాత్పర్యమున అయోధ్యాకాండము సమాప్తము.

# తప్పు ఒప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 16 | 6 | దశలచే | ముశలచే |
| 37 | 21 | ర్క్షిశ్చత | ర్క్షిశ్చిత |
| 38 | 16 | పదేవ | పదేన |
| 39 | 7 | నంతతి | నందతి |
| 43 | 2 | చతుష్షీవ | చతుష్షీవా |
| 69 | 6 | దుదీయా | తుదీయా |
| 74 | 9 | అంతః | అతః |
| 77 | 18 | సరః | నరః |
| 89 | 15 | జేతం | జేతు |
| 100 | 12 | సమపేతు | సమాపేతు |
| 112 | 20 | ప్రత్య | ప్రత్యయము |
| 126 | 6 | అపక్రపణ | అపక్రమణ |
| ,, | 8 | పితృవవశ్య | పితృవశ్య |
| ,, | 13 | అపక్రపణ | అపక్రమణ |
| 127 | 11 | ,, | ,, |
| 149 | 5 | నాననుభూతం | నానుభూతం |
| 162 | 14 | తద్దామి | తద్దదామి |

# బొమ్మకంటి నృసింహశాస్త్రి స్మారకనిధి వివరములు.

ఈనిధిని సమకూర్చుటకు శ్రీ శాస్త్రులవారిచే సంస్కృతభాషలో రచింపబడి దిగువ పేర్కొనబడు గ్రంథములకు పోషకులను చందాదారులను చేర్చుకొనుట, గ్రంథములను నాగరిలిపిని, తెలుగులిపిని (ఆంధ్రతాత్పర్యసహితము) ముద్రింపించి విక్రయించుటయు ముఖ్యోద్దేశములు. ఈనిధికి సంబంధించిన గ్రంథములు శ్రీ శాస్త్రులవారి జ్యేష్ఠకుమారులగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తండ్రిగారి స్మారకార్థము స్వగృహమునందు శాశ్వతముగ నెలకొల్పిన కల్పవల్లికా కార్యాలయమునందు లభించగలవు.

గ్రంథములు, చందాలు:—(1) కల్పవల్లికా (శ్రీమద్రామాయణవ్యాఖ్యానము). ఈగ్రంథము మూడు సంపుటములుగ ముద్రింపబడును. సంపుటములు మూడుకలసి నాగరిలిపి రు 5—0—0 తెలుగులిపి రు 3—0—0
(2) మణిమంజరీవిశ్లేషం ,, రు 2—0—0 ,, రు 1—0—0
(3) తారావళి, ప్రకీర్ణశ్లోకములు 1—0—0 ,, రు 1—0—0.

పోషకులు:—రు 10—0—0 గాని యంతకుమించిగాని ఒకేపర్యాయము నిచ్చువారు. వీరికి పైగ్రంథములన్నియు ముద్రణానంతర ముచితముగ పంపబడును.

చందాదారులు:—ఏగ్రంథమునకైనను చందాను ముందుగ నిచ్చువారు. వీరికి ముద్రణానంతర మాయాగ్రంథము లుచితముగ పంపబడును.

ప్రత్యేక చందాదారులు:—దరఖాస్తుతో రు 0-4-0 లు చెల్లించవలెను. కల్పవల్లికను కొనువారు నాగరిలిపి రు 5—4—0 తెలుగు రు 3—6—0 మూడుసంపుటములవైనను సహముగనిచ్చి పుచ్చుకొనవలెను. శేషించిన గ్రంథములను కొనువారు చందాలవెలలకే పుచ్చుకొనవలెను. (ఖర్చులు వేరు)

గ్రంథములన్నియు చక్కని కాగితముపైన ముద్రింపబడి శాస్త్రులవారి ఛాయాపటము, వంశావళి, జీవితచరిత్ర మున్నగునవి కలిగియుండును.

ముద్రితగ్రంథములు:—

కల్పవల్లిక (ప్రథమసంపుటము) వెల రు 1—4—0
,, (ద్వితీయసంపుటము) ,, రు 1—8—0

దరఖాస్తులు, చందాలువగైరాల నీక్రిందివిలాసమునకు పంపవలెను.

కల్పవల్లిక ఆఫీసు, రామారావుపేట, కాకినాడ.

తూర్పుగోదావరిజిల్లా.